# చతుర

సంపుటి:2    సంచిక:9

అక్టోబర్ 1979

ఈ నెల సమగ్ర నవల

"ఇదిలా ఎందుకు జరిగింది ఆంటీ! ఇంత పెద్ద దానివి నువ్వే ఎలా మోసపోయావు?" అని ఆ అమాయకురాలు అడిగిన ప్రశ్నకు లాయరు సుమతి ఇచ్చిన జవాబు "ఈ దేశంలో మెజారిటీ ఆడపిల్లల ప్రేమ కథల ముగింపులు ఎప్పుడూ ఒకేలా ఉంటాయి రూపా!" అని. ఏమిటా ముగింపు? "ఆలా జరగటానికి వీల్లేదు! అబ్బాయీ-అమ్మాయీ కలిసే చేసిన తప్పుకి అమ్మాయి మాత్రమే శిక్ష ఎందుకు అనుభవించాలి? అబ్బాయి కూడా వాటా పంచుకోవలసిందే" అన్న రూప-తల్లిదండ్రుల్నీ, సమాజ నీతి సూత్రాల్నీ కూడా ధిక్కరించి పాత విలువల్ని కాలదన్ని జీవిత న్యాయాన్ని ఓ...

## కొత్త మలుపు

లోకి మళ్ళించేందుకు చేసిన సాహసం ఎలాంటిది? దాని పర్యవసానం ఎలా పరిణమించింది?

### ఓ. కామేశ్వరి

సాంఘిక న్యాయాన్ని కొత్త దృక్కోణం నుండి పరిశీలించి సరికొత్త బాటలు వేయాలనే దృష్టితో రచించిన తాజానవల 'కొత్త మలుపు' ఈనెల 'చతుర' సమర్పిస్తున్న సమగ్ర నవల.





**ఈ నెల ముఖపత్రం:**

ఎడారులకు, ఒంటెలకు నిలయంగా సుప్రసిద్ధమైన రాజస్థాన్ ప్రాంతపు జనపదురాలు:
ఫొటో: సుధీర్ కాస్లివాల్, జైపూర్.

**రెండవ కవరు:**

ముస్లిం సంస్కృతికి కేంద్రంగా విలసిల్లిన లక్నో యువతి.
ఫొటో: సూరజ్ ఎస్. శర్మ, జైపూర్

**మూడవ కవరు:**

హైందవ శిల్ప కళా పునర్వికాస దశలో ప్రముఖ పాత్ర వహించిన 'బాదామి'లోని శివపార్వతులు.
ఫొటో: గీతాదత్తా, సికింద్రాబాద్



# చతుర


ఈనాడు కాంపౌండ్

సోమాజిగూడ, హైదరాబాద్-500 004

# చెక్కుచెదరని నౌక

బ్రిటిష్ రాయల్ నేవీకి చెందిన నౌకొకటి 1853లో ఉత్తర కెనడా ధృవ ప్రాంతాల్లో మంచులో కూరుకుపోయి ఆనాటి నుండీ అలాగే ఫ్రిజ్‌లో పెట్టిన ఆపిల్ పండులా చెక్కు చెదరకుండా వుండిపోయింది.

ఇటీవల ధృవ ప్రాంతాల్లోని బీచీ ద్వీపంలో ఓడ లాంటిదేదో మంచులో కూరుకు పోయినట్లు పరిశోధకులు తెలుసుకుని అదే ఇదని భావించి బైటికి తీయ వచ్చునని తీర్మానించారు.

చెక్కతో చేయబడిన బ్రిటిష్ నౌకల్లో ఇదే ఆఖరుది. ఆవిరితో నడిచే మరో



రాయల్ నౌక, ఈ నౌకా సిబ్బందిని అప్పట్లో ప్రమాదం నుండి రక్షించింది.

మంచులో కూరుకుపోయి కూడా ఇన్నేళ్ళపాటు చాలా భద్రంగా వుండటం, అందులోని ఏ చిన్న వస్తువూ పాడవకుండా వుండటం ఎంతో అరుదని నౌకా శాస్త్రజ్ఞులు అంటున్నారు.

నౌకా సిబ్బంది వుపయోగించిన దుస్తులూ చెక్కు చెదరనందున 126 ఏళ్ళ క్రిందటి నౌకాశాఖ వస్త్రధారణ వివరాలు తెలుస్తున్నాయి.

ఆ ప్రాంతంలోని నీరంతా శాశ్వతంగా గడ్డకట్టుకు పోయింది. వేసవి కాలంలో ఆ నౌకను బైటికితీసి నౌకా చరిత్రలో ఆనాటి విశేషాలను తెలుసుకునేందుకు నౌకా శాఖాధికారులు ఆసక్తి చూపుతున్నారు.

# ఆస్తిపరుడు

అమెరికాలో గొప్ప ధనవంతుడుగా పేరుమోసిన నెల్సన్‌రాక్ ఫెల్లర్ గత జనవరి 26వ తేదీన చనిపోయాడు. ఆయన భార్య, ఇద్దరు కొడుకులకు కలిపి 6 కోట్ల, 26 లక్షల డాలర్ల ఆస్తి వచ్చింది. ఈ ఆస్తిలో బంగారునగలు, వజ్రాలు, చిత్రపటాలు, శిల్పాలుగా కూడా ఉన్నాయి. వీటిలో 23 బొమ్మలు, 4 శిల్పాలు, 1610 ఆధునిక చిత్రాలు, కలిపి ఒక కోటి 35 లక్షల డాలర్ల ఖరీదు చేస్తాయని అంచనా.

పోకాటికోహిల్స్ అనేచోట రాక్ ఫెల్లర్ జ్ఞాపకార్థం 250 ఎకరాల స్థలంలో నిర్మించబడిన పార్కు, అందులోనే రాక్ ఫెల్లర్ అనుయాయులకోసం కట్టబడిన అందమైన ఇల్లు ఉన్నాయి.

1974లో అమెరికన్ కాంగ్రెసు వారు రాక్‌ఫెల్లర్ ఆస్తి 6 కోట్ల, 26 లక్షలని అంచనావేశారు.

# చీమల తెలివి

చీమలకీ, మనుషులకీ మనస్తత్వంలో దగ్గరి పోలికలున్నాయట. ఓ చీమ చచ్చిపోతే మిగతా చీమలు ఉరుకులు, పరుగులమీద వచ్చి ఆ చీమ శరీరాన్ని మోసుకెళ్ళి ఇసుకలో పాతిపెడతాయి. అవి తమ పిల్లల్ని పుట్ట బయటికి చల్లగాలిలో షికారుగా తీసుకొస్తాయి. ప్రపంచం గురించి, జీవితం గురించి పాఠాలు నేర్పిస్తాయి.

అనారోగ్యంగా వున్న చీమలకు చికిత్స చేసి, నయం చేసేందుకు చీమ డాక్టర్లు నిరంతరం కృషి చేస్తుంటాయి. వ్యాధి ప్రాణాంతకమైనదని భావించినప్పుడు వాటిని సాధ్యమైనంత సంతోషంగా ఉంచేందుకు చూస్తాయి.



దక్షిణ అమెరికాలో కొన్ని రకాల చీమలు వ్యవసాయం చేస్తాయి. చెట్టు తొర్రల్లో మట్టిపోసి విత్తనాల్ని పట్టుకొచ్చి అందులో వేసి పెంచుతాయి. కొన్ని చీమలు తమ పుట్ట చుట్టూ జొన్న, వరి, మొక్కజొన్న మొక్కల్ని పెంచి, పక్వానికి వచ్చాక ఆహారంగా ఉపయోగించుకుంటాయి.

అమెరికాలో ఒక జాతికి చెందిన అంబ్రెల్లా చీమలు రోజూ 30 మైళ్ళు నడిచి వెళ్ళి 30 పౌన్ల బరువుగల ఆహారాన్ని మోసుకొస్తాయి.

చాలా విషయాల్ని చీమలు మనిషి కంటే వేగంగా సునిశితంగా ఆలోచిస్తాయి. చీమ చిన్నదైన దాని బుర్ర పెద్దదే! చీమలు పెట్టిన పుట్టలు మనుషుల కట్టడాల్ని మించి వుంటాయన్నా ఆశ్చర్యం లేదు.

# శునక వైభవం

ఇంగ్లండు ప్రభుత్వానికీమధ్య కొత్తగా ఓ పెద్ద సమస్య వచ్చి పడింది. అక్కడ కుక్కల జనాభా విపరీతంగా పెరిగిపోవటంవల్ల ఆ పెరుగుదలను 'ఎలా అరికట్టాలా?' అని అధికారులు సతమతమవుతున్నారు.

ఇంగ్లండులో కుక్కల్ని పెంచటం హాబీ మాత్రమే కాదు-ప్రస్తుతం అదో వృత్తిగా కూడా తయారయింది. ఈ మధ్యనే ఎరల్స్ మైదానంలో బ్రహ్మాండమైన కుక్కల ప్రదర్శన జరిగింది. అక్కడ 30 కోట్ల పౌండ్ల విలువచేసే కుక్కల ఆహారం అమ్ముడయి పోయిందట! కిందటేడు కుక్క బిస్కెట్ల చిల్లర అమ్మకం 17 కోట్ల పౌండ్ల దాకా జరిగిందట. వీటికితోడు కుక్కల మందులు, డబ్బాల్లో నిలువ వుంచిన ఆహారం, చలికోట్లుకు కూడా విపరీతమైన డిమాండు

ఉంది.

ఈ మధ్యన జరిపిన సర్వేలో ప్రతి నాలుగు కుటుంబాలలో ఒక కుటుంబానికి పెంపుడు కుక్కలున్నాయని తేలింది.



కుక్కల డిమాండును తట్టుకునేందుకు ప్రతి ఏటా 10 లక్షల కుక్కలు జన్మించే ఏర్పాట్లు జరిగాయక్కడ. వీటిలో 2/3వంతు కుక్కలు పనికిరానివి అవటం వల్ల వాటిని చంపేస్తున్నారు. కొన్నిటిని పుట్టిన వెంటనే చంపితే, కొన్నిటిని కొన్ని వారాల తర్వాత చంపుతారు.

ప్రస్తుతం ఒక పెంపుడు కుక్క సగటు ధర 75 నుండీ 100 పౌండ్ల దాకా పలుకుతోంది. ఇంగ్లండు నుండి ఎన్నో దేశాలకు అసంఖ్యాకంగా కుక్కలు ఎగుమతి అవుతున్నాయి. ముఖ్యంగా కుక్కల కొనుగోలు విషయంలో ఫ్రాన్స్ ఇంగ్లండుకు ప్రధానమైన కస్టమర్. అమెరికా, జపాన్‌లకు చెందిన కొందరు బడా సంపన్నులు ఇంగ్లండుకు తమ సొంత విమానాలను పంపించి మరీ కుక్కల్ని తెప్పించుకుంటున్నారట!

# ఆత్మహత్యలరోగం

భారతదేశంలో ఎక్కువ శాతం ప్రజలు దారిద్ర్యం, నిరుద్యోగంవల్ల కాక, నయంకాని దీర్ఘ రోగాలను భరించలేక ఆత్మహత్యలకు పాల్పడుతున్నారని కేంద్ర ప్రభుత్వ పరిశీలనలో వెల్లడైంది. ఇలాంటి ఆత్మహత్యలకు పశ్చిమ బెంగాలుది అగ్రస్థానమట. అత్తాకోడళ్ళ మధ్య వివాదాలు, మనస్పర్థలు కారణంగా కూడా ఎక్కువ సంఖ్యలో ఆత్మహత్యలు జరుగుతున్నాయి. 1975లో ఇలాంటి కారణాలవల్ల ఆత్మహత్య చేసుకున్న 4,086 మందిలో వెయ్యిమందికి పైగా పశ్చిమ బెంగాల్‌కు చెందినవారే కావటం విశేషం!



1975 లో బలవంతంగా ప్రాణాలు తీసుకున్న 42,890 మందిలో 16.4 శాతందీర్ఘ రోగాలతో బాధపడుతున్నవారు. ఒక శాతం నిరుద్యోగులు, 3.7 శాతం

దారిద్ర్య పీడితులు ఉన్నారు.

దీనివల్ల భారతీయులు ఆర్థిక ఇబ్బందుల్ని ఎదుర్కొంటున్నంత ధైర్యంగా దీర్ఘ రోగాలను ఎదిరించలేక పోతున్నారని తెలుస్తోంది. ఓ పక్కనుంచి వైద్య శాస్త్రం విశేషంగా అభివృద్ధి చెంది మన జీవన కాలాన్ని పెంచుతూనే వున్నా, ఈ దీర్ఘ రోగాలూ, వ్యాధులూ అలా నిలకడగా ఉండిపోతూనే వున్నాయి. రోగాలు, జబ్బులవల్ల కలిగే బాధలను భరించలేక విషం, ఉరి, నీళ్ళలో దూకటం, రైలుకింద పడటం వంటి మార్గాలను అనుసరించి ఆత్మహత్యలు చేసుకుంటున్న వారికి అవసరమయిన పూర్తి వైద్య సౌకర్యాలు లభించి ప్రాణాలు నిలిచే దెప్పటికో!

# ఆడమళయాళం

కేరళలోని నాయర్ల కుటుంబాల్లో ఆడపిల్ల పుట్టీ పుట్టగానే ప్రత్యేకంగా ఒక గది కట్టి, జీవితాంతం ఆడపిల్లని అందులో ఉంచుతారు. అయితే నాయర్ల ఆడపిల్లలు ఆర్థికంగా స్వతంత్రులు. తల్లిదండ్రుల ఆస్థిలో ఆడపిల్లలక్కూడా భాగం ఉంటుంది. వయసొచ్చిన ఆడపిల్లలు నచ్చినవాళ్ళని పెళ్ళాడవచ్చు. వివాహం ఇష్టంలేకపోతే మానేయనూ వచ్చు. బ్రతికి నంతకాలం ఏలోటూ లేకుండా గడప డానికి తగినంత ఆస్థి తల్లిదండ్రులు సంపాదించి పెడతారుకాబట్టి, నాయర్ల ఆడపిల్లలు కోరుకున్న విధంగా జీవితం గడపొచ్చు. గది బందిఖానా తప్పించి మిగతా అన్ని విషయాల్లోనూ వారికి పూర్తి స్వేచ్ఛ ఉంటుంది. పెళ్ళయిన తరువాత భర్తకు విడాకులివ్వాలన్నా ఇవ్వొచ్చు.

అయితే విడాకులివ్వదలుచుకున్న స్త్రీ భర్త చెప్పుల్ని పట్టుకెళ్ళి గడప బయట పెడుతుంది. ఇంకేం మాట్లాడదు. దాన్నిబట్టి భర్త అర్థంచేసుకోవాలన్న మాట. ఇంకో విశేషమేమిటంటే భర్తలనేవాళ్ళు చుట్టం చూపుగా రాత్రిళ్ళు మాత్రమే ఇంటికి వస్తారు.

కానీ వీళ్ళలో ఎక్కువగా వ్యాపార నిమిత్తం దేశాలు తిరగడం అలవాటు.

'మేమే శుద్ధ బ్రాహ్మణం' అని నమ్మే నంబూద్రీల్లో కూడా ఇలాంటి ఆచారమే ఉంది. వీరిలో ఇంటికి పెద్ద కొడుక్కి మాత్రమే పెళ్ళి అర్హత ఉంటుంది. మిగతా కొడుకులు తమ కులంలోని పిల్లల్ని పెళ్ళాడకూడదు గాని, వేరే కులస్త్రీల్ని



ఉంచుకోవచ్చు. సామాన్యంగా నంబూద్రీలు నాయర్ల ఆడపిల్లల్ని ఉంచుకుంటారు.

# మేకు న్యాయం

ఫిన్‌లాండ్ రాజధాని హెల్సింకీలోని ఉన్నత న్యాయస్థానంలో, ఒక లాయరు మేజాబల్లమీద దావా వేశాడు. లాయరుగారు హడావిడిగా కోర్టులోకి ప్రవేశిసుంటే ఒక మేజాబల్ల నుంచి పైకి పొడుచుకొచ్చిన మేకు ఆయనగారి పాంటుని చరాలున చీరింది. కొత్తగా కుట్టించుకున్న పాంటు చిరిగింది కాబట్టి నాకు నష్టపరిహారం ఇప్పించమని, సదరు లాయరుగారు ఆకోర్టులోనే దావా వేశాడు. ముద్దాయి 'మేజాబల్ల'ని బోనులో నిలబెట్టారు.

ఈ కేసు పరిశీలన నాలుగు సంవత్సరాలు సాగింది. చివరకు బల్లతరపున కోర్టువారు 228 మార్కులు నష్టపరిహారం చెల్లించారు.



అమెరికాలోని బెర్కాండ్ కోర్టులో, పిల్లిని చంపిన నేరానికి హూల్స్ అనే అతని మీద అభియోగం తీసుకొచ్చారు కొంతమంది. అతను క్షుద్రశక్తులనుంచి కాపాడుకోటానికి పిల్లి చెవులు కోటు కాలరుకి కుట్టుకున్నాడట. పిల్లి చెవులు కాలరుకి కుట్టుకుంటే, క్షుద్రశక్తులు భయపడతాయని నీకెవరు చెప్పారు? అని జడ్జిగారడిగిన ప్రశ్నలకి అతను సమాధానమివ్వలేక పోయేసరికి మూడు నెలల జైలుశిక్ష, వంద డాలర్ల జరిమానా విధించారు జడ్జిగారు.

# వద్దంటే డబ్బు

ప్రఖ్యాత ఆంగ్ల రచయిత సోమర్‌సెట్ మామ్ స్పెయిన్ దర్శించడానికి వెళ్ళి అక్కడ ఉన్న సమయంలో అతని పుస్తకాలకు రావలసిన రాయల్టీ డబ్బు అందించబడింది. అంత డబ్బు ఒకేసారిగా తరలించుకుపోవడం స్పానిష్ చట్టం ఒప్పుకోదు. అందుకని కొంత డబ్బుతో జల్సా చేసి ఖర్చు పెట్టేద్దామని మామ్ 'మాడ్రిడ్'లోని ఓ ఖరీదైన హోటల్లో బస చేసి అక్కడ ఉన్నన్ని రోజులూ రాజభోగాలనుభవించాడు. విసుగెత్తాక ఇప్పటికి ఖర్చు పెట్టింది చాలెమ్మనుకొని గది ఖాళీ చేసి హోటల్ ప్రొప్రయిటర్ దగ్గరకొచ్చి "బిల్లెంత?" అన్నాడు. అందుకా పెద్దమనిషి తడబడి "మీవంటి మహా రచయితలు మా హోటల్లో బసచేయడమే మాకో వరం, మీ పేరు గొప్పతో మా వ్యాపారం ఇబ్బడి ముబ్బడిగా పెరిగింది, మీరేం చెల్లించనక్కరలేదు. పైగా మీరెప్పుడు స్పెయిన్ వచ్చినా మా హోటల్లోనే ఉచితంగా బస చేయవచ్చు" అనేసరికి మామ్ అవాక్కయి పోయాట్ట!

రాత్రి ఏడు అయింది. తెలుగులో వార్తలు విని ట్రాన్సిస్టర్ నోరు నొక్కేశారు విశ్వనాథంగారు. పక్కనే కుర్చీలో కూర్చున్న భార్య వంక ఒకసారి గంభీరంగా చూశారు. పద్మావతి ఆయన చూపులు ఎదుర్కోలేనట్టు కళ్ళు వాల్చుకుంది.

ఆయన పడక్కుర్చీలోంచి లేచి వరండాలో పచార్లు ఆరంభించారు. పద్మావతి అక్కడ కూర్చుందన్నమాటే గాని ఆవిడ దృష్టి అంతా వీధి గుమ్మంలోనే వుంది. గుమ్మందాటి బయట గేటులోకి ఆవిడ దృష్టి చూసుకుపోతున్నా ప్రయోజనం శూన్యం. రాబోయే ఉపద్రవం ఎదుర్కోడం ఎలా భగవంతుడా అని బెంబేలు పడ్తూంది ఆవిడ. అంత వరకు ఉరుములు ఉరిమిన భర్త కూతురు రాగానే పిడుగులు కురిపిస్తారని తెలిసి ఎంతకూ రాని కూతురుని త్వరగా యిల్లు చేరేటట్టు చెయ్యమని భగవంతుడికి మనసులో మౌనంగా మొరపెట్టుకుంటూంది.

కూతురు మీద ఆవిడకి కోపం ముంచుకు వస్తూంది. తన మాట లెక్క చెయ్యకుండా, తనెన్నిసార్లు చెప్పినా నిర్లక్ష్యంగా ప్రవర్తిస్తున్న కూతురు ఒకపక్క; ఆడపిల్లని అదుపులో పెట్టుకోడం తల్లిపని, దాన్నలా విచ్చలవిడిగా ఎందుకు తిరగనిస్తున్నావు? అసలు తప్పు నీది అని దుయ్యబట్టే భర్తమధ్య ఆవిడ నలిగిపోతూంది కొద్ది రోజులుగా. ఆవిడ కూతుర్ని చాటుగా మందలిస్తూ, భర్తకి నచ్చజెప్తూ ఏదో సర్దేస్తూంది యిన్నాళ్ళూ.

కానీ, ఈ రోజు ... సాయంత్రం యింటికి వస్తూనే విశ్వనాథం పద్మావతి మీద ఎగిరి పడ్డాడు - "రూప యింటికి వచ్చిందా?" అన్నాడు గంభీరంగా చూస్తూ.

"లేదు... లేదింకా రాలేదు" అంది తడబడూ పద్మావతి...

"టైమెంతయింది?" ఆయన తీక్షణంగా చూశాడు. పద్మావతి అప్రయత్నంగానే గోడవంక చూసి తలదించుకుంది.

"పావు తక్కువ ఏడు. శీతాకాలం. యింత చీకటిపడి యింత రాత్రయినా అదింటికి రాకుండా ఎక్కడికి వెళ్ళింది?" నిలేశాడు విశ్వనాథం.

"టైపు నించి యింకా యింటికి రాలేదండీ! అట్నించి ఎవరన్నా స్నేహితురాలి ఇంటికి వెళ్ళిందేమో..." నసిగింది.

"నాలుగు నించి, ఐదు ఐదున్నరవరకు టైపు. ఆ తర్వాత యింటికి రాకుండా యింత చీకటిపడ్డా ఎక్కడ తిరుగుతూంది? స్నేహితురాలా, స్నేహితుడా..." ఆయన గొంతు రాను రాను కరకుగా మారడం గుర్తించి పద్మావతి మనసు బెదిరింది.

భర్త 'స్నేహితుడా' అనగానే ఆమె మరింత భయపడింది. రూప వరస రెండు మూడు నెలలుగా ఆవిడా గమనిస్తూనే వుంది. రోజూ సాయంత్రం ఏడు దాటాకగాని యిల్లు చేరకపోవడం, ఎక్కడికెళ్ళావంటే, 'అబ్బ యింటిదగ్గిర బోర్ అమ్మా! ఫ్రెండింటికి వెళ్ళాను' అని ఓసారి, అలా 'టాంక్ బండ్ మీదకి షికారు వెళ్ళాం నా ఫ్రెండు నేను', 'నీరూ వాళ్ళింట్లో పేకాడుతూ కూర్చున్నాను', 'లతా వాళ్ళింట్లో రికార్డ్సు వింటూ వుండి పోయాను', 'అబ్బ సాయంత్రం అన్నా ఒక గంట తిరగనీయవు. అన్నిటికి

అనుమానమే! నేనేం చిన్న పిల్లనా ఏమిటి-చీకట్లో భయపడడానికి. రోడ్డు పట్ట పగలులా వుంటుంది లైట్లతో. ఇన్ని వందల మంది వుంటారు రోడ్లమీద. ఒక్కర్తినీ రావడాని కెందుకు భయం.' ఇలా ప్రతి రోజూ ఏదో వంక చెపుతూ చీకటి పడ్డాకగాని యిల్లు చేరేదికాదు. ముందు ఒక నెల పద్మావతీ అంత పట్టించుకోలేదు. ఒక రోజు కేకలువేసి, మరో రోజు చూసిచూడనట్లు వూరుకునేది. దానికీ యింట్లో తోచదు. ఒక్కర్తీ యింట్లో ఎంతకని కూర్చుంటుందిలే అని సర్దిపుచ్చుకునేది...విశ్వనాథం సాధారణంగా ఆఫీసునించి యింటికి వచ్చేసరికి ఏడుగంటలవుతుందేమో కూతురు ఆలస్యంగా యిల్లు చేరడం అతనికి తెలియదు. ఒకో రోజు అతనొచ్చేసరికి రూప లేకపోతే పద్మావతి ఏదో సర్ది చెప్పేది. ఆహా అనుకునేవాడు కాని అది రోజూ భాగోతం అని అతనికి తెలియలేదు. రాను రాను రూప ధోరణి పద్మావతికి అనుమానం కల్గించింది. ఓ రోజు రూప రాగానే ఎవరింటికి వెళ్ళావు అంది పద్మావతి. లత యింటికి అంది రూప. అబద్ధం ఆడుతున్నావు? అంది తీక్షణంగా. రూప తడబడూ- లేదు...లేదు...లత యింటికి వెడితే అదింట్లోలేదు, అందుకు నీరూ యింటికి వెళ్ళాను అని బుకాయించింది. 'నీ వరస బాగులేదు.రోజూ యీ తిరుగుడేమిటి? రేపట్నించి ఫైవు నించి తిన్నగా యింటికి వచ్చే మాటయితే వెళ్ళు, లేదంటే మానేయి అంది పద్మావతి కోపంగా. రూప అప్పటికి వూరుకుని మర్నాడు మాత్రం పెందరాడే ఇంటికి వచ్చింది. మూడో రోజునించి మామూలే. రూప గంటలకొద్దీ అద్దం ముందు కూర్చుని కనుబొమ్మలు కత్తిరించుకోడం, క్రీములు పాముకుంటూ, పౌడరద్దుకుంటూ, జడవిప్పి అల్లుతూ గంట ముస్తాబయి రోజూ మడత నలగని చీరతో శ్రద్ధగా ముస్తాబవడం, కొత్త చీరలు కావాలని ప్రాణం తీస్తూ వేధించడం యిదంతా పద్మావతి దృష్టిని దాటిపోలేదు. ఈ వయసులో ఆడపిల్లలందరూ అందంగా కనబడాలని తాపత్రయపడడం సహజం...తోటి పిల్లలని చూసి యిదీ నేర్చింది షోకులు అనుకుంది. విశ్వనాథం "స్నేహితుడా" అనగానే కలవరపడ్తూ భర్తవంక చూసింది.

"నీకసలు బుద్ధుందా - ఆడపిల్ల ఏడు గంటలు దాటినా ఇల్లు చేరకపోయినా పట్టించుకోకుండా అలా వదిలేస్తావా?" తీక్షణంగా అన్నాడు విశ్వనాథం.

"పట్టించుకోకుండా వదిలేశానా! చూసినట్టు మాట్లాడకండి" భర్త మాటలకి పౌరుషం వచ్చి అంది పద్మావతి. "ఆలస్యంగా వచ్చినందుకు ఎన్నిసార్లు తిట్టలేదు."

"చాలు ఇంకా సమర్థించుకుంటున్నావు. ఏం పట్టించుకున్నావు - పోనీ ఒక్కనాడన్నా నాతో చెప్పావా ఇలా ప్రతి రోజూ ఆలస్యంగా వస్తూందని - ఎవడో వూర్లో పుల్లయ్య, ఎల్లయ్య ఇలా మీ అమ్మాయి పార్కులు, సినిమాలు ఎవడితోనో షికార్లు తిరుగుతుందయ్యా జాగ్రత్త పడు అనే వరకు నాకేమన్నా తెల్సిందా. తెలియనిచ్చావా ? నేనంటే ఇంట్లో వుండే వాడిని కాదు. ఇంట్లోవున్న నీ కళ్ళు ఎలా మూసుకుపోయాయి. ఆ మాత్రం గుర్తించలేక పోయావా? ఇవాళ మా బ్యాంక్ లో ఆ ప్రసాదరావు నన్ను పిలిచి ఎవరండీ ఆ కుర్రాడు మీ రూపతో తిరుగు

తున్నాడు. మా ఆవిడకి ఒకరోజు సిని మాలో కనిపించాపుట. మొన్న మేం పబ్లిక్‌గార్డెన్స్‌కి వెడితేఁకనపడ్డారు. మన సదాశివం అన్నాడు మొన్న ఏదో హోటల్లోఁ కనిపించారని - ఎవరతను మీకేమన్నా బంధువా—అంటూ నా మాడి పోయిన మొహం చూసి నాకేం తెలియదని గు ర్తించి కూతుర్ని జాగ్రత్త పెట్టుకో మంటూ నీతులు భోధించాడు. నా కెంత తల కొట్టేసినట్లయిందో నీ కెమన్నా తెలుసా ? తల్లివి ఆడపిల్లని ఆ మాత్రం అదుపులో పెట్టుకోలేవూ ?" ఎదురుగా లేని కూతురి మీద కోపం భార్య మీద చూపించి ఎగిరిపడ్డాడు విశ్వనాథం. తన కూతురు ఎవరితోనో తిరుగుతూందన్న బాధకంటే వీళ్ళు, వాళ్ళు తేలిగ్గా మాట్లా డడం అవమానంగా వుందాయనకి. ఆఫీ సులో పని చెయ్యలేక పోయాడు-కూతురు మీద, పెళ్ళాం మీద పీకలదాకా కోపం వచ్చింది. సెగలు పొగలు కక్కుతూ ఇల్లు చేరాడు - ఇంట్లో కూతురు లేక పోవడం ఆయన ఆగ్రహాన్ని మరింత పెంచిది.

"బాగుంది. మధ్య నా మీద ఎగుర్తా రెందుకు - ఏదో స్నేహితురాలింటి కెళ్ళాను, గార్డెను కెళ్ళాను, సినిమాకెళ్లాను అంటే స్నేహితురాళ్ళతో వెళ్ళిందను కుంటాను గాని ఇలా ఎవడితోనో తిరుగు తూందని కలకన్నానా? నేనేదో చూసి తెలిసి పూరుకున్నట్టు మాట్లాడుతారేం? ఇంట్లో వుండేదాన్ని అది బయట ఎక్కడ తిరుగుతూందో నాకెలా తెలుసుంది-అక్క డికీ ఆలస్యంగా వచ్చినపుడు చివాట్లు వేశాను-ఈ కాలం పిల్లలు కాళ్ళు చేతులు కట్టిపడేస్తే మాత్రం ఇంట్లో కూర్చుంటా రేమిటి? అందరికి స్నేహితులు, సినిమాలు, షికారు-తిరిగితే తప్పేమిటని మొహాన్నే అడిగేసి నోరు మూయిస్తున్నారు పిల్లలు. ఇంట్లో బోర్ బోర్ అంటూ అందరికి తిరుగుడలవాటయింది ... " పద్మావతీ తీవ్రంగానే సంజాయిషీ ఇచ్చింది.

"అసలు నీవల్లే అదలా తయారైంది- వద్దంటుంటే ఆ టైప్ ఇన్‌స్టిట్యూట్ కి పంపిం చావు, అప్పటినించే దానికీ తిరుగుడు బాగా అలవాటయింది..." కోపంగా అన్నాడు.

"అవును అన్నింటికీ నన్నే అనండి- అదేమో నాకేం తోచడం లేదు మొర్రో, టైపన్నా నేర్చుకుంటాను, ఇంట్లో కూర్చుని బోరెత్తుతూందని ప్రాణాలు కొరికితే సరే అన్నాను అదీ తప్పేనా. పరీక్షలయి ఇంట్లో పూరికే కూర్చుంది.- పోనీ టైపు నేర్చుకుంటే ఎందుకన్నా పనికొస్తుందని వప్పుకోడం తప్పా..." పద్మావతి ఉక్రోషంగా అంది.

"అబ్బే ఏది తప్పుకాదు. రాత్రి ఎనిమిదైనా బోయ్ ఫ్రెండ్సుతో షికార్లు తిరగడం తప్పుకాదు-రేప్పొద్దున ఏకడుపో కాలోవస్తే అదంతకంటే తప్పుకాదు- ఎబార్షన్ చేయించుకోడం మామూలు, మరొకడ్ని పెళ్ళాడడం అంతకంటే మామూలు. ఇదంతా ఫేషనే - అను, రోజులు మారాయి ఇందులో ఏం తప్పు లేదను... పంపించు కూతుర్ని రోజూ తిరగడానికి..."

"మీరనవసరంగా మాటలు జారకండి, ఇష్టం వచ్చినట్లు మాట్లాడుతున్నారు-పిల్ల తప్పుచేస్తే మందలించి బుద్ధిచెప్పడం మాని నా మీద ఎగురుతారేం - నేనెవడితోనూ తిరిగిరమ్మని పంపలేదు. ఆ మాత్రం

బాధ్యత నాకూతెల్సు.అది వచ్చాక నిలబెట్టి అడగండి చాతనయితే, అంతేకాని నన్నవసరంగా అనకండి" పద్మావతి కోపంగా లేచి లోపలికెళ్ళి పోయింది. విశ్వనాథం కోపంతో బుసలు కొడ్తూ బోనులో పులిలా విసురుగా పచార్లు చెయ్యసాగాడు-తల్లితండ్రుల వాగ్వివాదం విన్న రవి, శారద బితుకు బితుకు మంటూ పుస్తకాలు ముందు కూర్చుని చదువు నటిస్తున్నారు గదిలో.

*　　*　　*

పబ్లిక్‌గార్డెన్‌లో ఆ చీకటి పొద చాటున ఒక యువజంట అంతసేపు చుట్టూ ప్రపంచాన్నే మరిచినట్టు కూర్చు న్నారు. అప్పుడే గుర్తుకొచ్చినట్టు చుట్టూ చీకటి చూసి "మైగాడ్ ... ఏడున్నర యింది. బాబోయ్ నేవెళ్ళిపోవాలి సురేష్! ఇంతసేపూ టైమే గుర్తురాలేదు" రూప కంగారుగా లేచింది.

"ఎంతసేపున్నా నిన్ను వదలాలని పించదు!రూపా కొంప మునిగినట్లు అప్పుడే ఇంత రాత్రవాలా" రూప చెయ్యి నొక్కి తప్పదన్నట్టు లేచాడు సురేష్. "నీ సమ క్షంలో గంటలు నిమిషాలుగా,నీపరోక్షంలో నిమిషాలు గంటలుగా అనిపిస్తాయి..."

"ఆహ...చాల్లే పెద్దకవిత్వం చెప్తున్నట్టు పోజులు మాను..." రూప అల్లరిగా నవ్వి ఇటు అటు చూసి చటుక్కున వంగి అతని పెదాలమీద చిన్న ముద్దు పెట్టి "బై డార్లింగ్......" అంటూ హేండ్ బ్యాగ్ అందుకుంది.

"ఫిర్ కబ్? కహా...?" రొమాంటిక్ సినీ హీరోలా కొంటెగా చూస్తూ అన్నాడు సురేష్.

"జబ్ తుమ్ క హో గె" రూప తక్కువ తినలేదన్నట్టు గడుసుగా అంది.

"చాల్లే కాని, రేపు వస్తావా..."

"అమ్మో వద్దు. రోజూ వస్తే అమ్మ చంపుతుంది. అసలీమధ్య అమ్మకేదో అనుమానం వచ్చినట్లుంది. అనుమానంగా చూస్తూ పదిసార్లు ఆరా తీసి అడుగు తూంది. రేపొద్దులే ఎల్లుండి వస్తా. నువ్వి క్కడే వుండి నే వెళ్ళాక కాసేపుండి రా. ఎవరన్నా చూస్తారు యిద్దరం వెళ్ళడం. గుడ్‌నైట్ సురేష్" చీకట్లోంచి చక చక బయటికి వచ్చి రిక్షా ఎక్కింది రూప. అంతవరకు టైము, ఉనికి, పరిసరాలు ఏమి గుర్తు రాలేదు కాని, ఇప్పుడు రిక్షా ఎక్కి యింటికి వస్తూంటే యింతాలశ్యం అయినందుకు ఏం సంజాయిషీ ఇవ్వాలా? తండ్రి యింటికి వచ్చి వుంటాడు ఏమనదు గదా అన్న భయం పట్టుకుంది రూపకి.

రిక్షా దిగుతూండగానే వీధి వరండా లోనే తండ్రిని చూసి గతుక్కుమంది రూప.రూప గేటు తీసుకు రావడం చూసి పచార్లు ఆపి నడుంమీద చేతులు పెట్టుకుని తీవ్రంగా రూపని చూశాడు విశ్వనాథం. తండ్రినిచూసి జంకుతూ లోపలికి వెళ్ళ బోయింది.

"ఆగు, యింతవరకు ఎక్కడికెళ్లావు?" తీక్షణంగా అడిగాడాయన.

"లతా వాళ్ళింట్లో కొత్త రికార్డులు తెచ్చారు, వింటూ కూర్చుండి పోయాను" గొణిగింది భయంగా. విశ్వనాథంగారొక్క క్షణం రూప మొహంలోకి చూసి చరచర డ్రాయింగు రూములోకి వెళ్ళి ఫోను తీసి లతఇంటికి డయల్ చేశారు."హల్లో లతేనా మాట్లాడుతోంది ? మా రూప మీ యింటికి వచ్చిందా సాయంత్రం ?" అన్నారు గంభీరంగా. రూప పై ప్రాణాలు పైనే పోయాయి. ఆమె నుదురంతా చెమట పట్టింది "లేదు అంకుల్ మా యింటికి

రాలేదే. ఏం యింకా యింటికి రాలేదా?" అంది "ఆఁ లేదు... ఇదిగో యిప్పుడే వచ్చిందిలే" అంటూ ఫోను పెట్టేసి రూప వైపు తిరిగి తీక్షణంగా చూశారు. రూప కాళ్ళలో వణుకు బయలు దేరింది. పద్మావతికి భర్త రౌద్రావతారం చూసేసరికి గుండెలు దడదడలాడాయి. ఆయన రూప దగ్గరకి వచ్చి..."నిజం చెప్పు ఎక్కడికెళ్ళావు? ఎవరితో వెళ్ళావు? నిజం చెప్పు అబద్ధం చెప్పడానికి ప్రయత్నించకు. డోన్ట్ లైటుమి, ఐ వాంట్ ట్రూత్...." కర్కశంగా అన్నారు. రూప తడబడిపోయింది. ఏం చెప్పాలో తెలియక భయంగా తల్లివంక చూసింది. పద్మావతి కూడా-చెప్పు, జవాబు చెప్పు అన్నట్టు చూసేసరికి తల్లి తనని ఆదుకోదని అర్థం కాగానే మరింత చెమటలు పట్టాయి. నిస్సహాయంగా చూసింది తండ్రి వంక. "ఊఁ జవాబు చెప్పు తొందరగా" అసహనంగా అరిచాడాయన.

''పబ్లిక్ గార్డెన్సుకి వెళ్ళాను'' బితుకు బితుకుమని చూస్తూ అంది రూప.

"ఎవరితో ...?"

"మా టైప్ ఇన్‌స్టిట్యూట్ నించి ముగ్గురు నలుగురు ఫ్రెండ్స్ వెడుతూంటే వెళ్ళాను" రూప చెంప ఛళ్ళుమంది. ''నోర్మూయ్ అబద్ధం ఆడద్దని చెప్పాను. ఫ్రెండ్స్‌తో వెళ్ళావా? ఇంకా అబద్ధం ఆడతావా? చెప్పు ఎవడువాడు ? ఎవడితో తిరుగుతున్నావు ఇన్నాళ్ళు?"ఆయన మితిమీరిన ఆవేశంతో మరోసారి చేయి ఎత్తబోతూంటే పద్మావతి చటుక్కున ముందుకు వచ్చి చెయ్యి పట్టుకుంది.

"మతిపోతూందా ఏమిటి? ఈడొచ్చిన పిల్లని కొట్టడం ఏమిటి..."

"నువ్వు ముందు నోర్మూయ్! ఈడొచ్చిన పిల్ల కనకే కొట్టడం. అడ్డమైన వెధవలతో తిరుగుతూంటే చూస్తూ వూర్కోమన్నావా? నీవు ముందు అవతలికెళ్లు" భార్యని విసురుగా తోశారు.

"హుఁకడుపు చించుకుంటే కాళ్ళమీద పడుతుంది. మీ అరుపులు, కేకలు ఇరుగు పొరుగు వింటే నష్టపోయేది మనమే! ఆవేశం పనికి రాదు ఇలాంటి వాటిల్లో. మీరూరుకోండి, నేను అన్నీ అడుగుతాను" సర్దబోయింది పద్మావతి.

"ఆఁ ఇన్నాళ్ళు అడిగి చేసిన నిర్వాకం చాలు. వుండు. ముందు ఈ సంగతి ఇవాళ తేలిపోవాలి ఊఁ చెప్పు యిన్నాళ్ళు నీవు తిరిగింది ఎవరితో? దాచాలని చూడకు నాకు తెల్సింది నిజం. అంతా చెప్పు" గొంతు తగ్గించినా తీవ్రంగానే అడిగారాయన. రూపకి తల్లిదండ్రులకి తన సంగతి తెల్సిపోయిందన్నది అర్థంకాగానే ఏదో మొండి ధైర్యం ప్రవేశించింది. విసురుగా తలెత్తి తండ్రిని చూసి "తెలిస్తే నన్నడగడం ఎందుకు? అవును సురేష్, నేనూ ప్రేమించుకున్నాం, ఏం నాకు నచ్చిన వ్యక్తిని ప్రేమించే హక్కు నాకు లేదా ?" చెంప పట్టుకుని పౌరుషంగా అంది. ఆమె చెప్పిన తీరుకి, ఆ ధైర్యానికి ఒక్క క్షణం విస్తుపోయారు విశ్వనాథం.

"నీ కూతురు ఎంత ప్రయోజకురాలైందో చూసి సంతోషించు. ప్రేమించడానికి హక్కులేదా అని నిలేసి అడుగుతూంది. జవాబు చెప్పు" ఆవేశంతో విశ్వనాథంగారి గొంతు వణికింది. "ప్రేమించడానికి ఎందుకు హక్కులేదు. మహారాజులా ప్రేమించు, వాడితో షికార్లు తిరుగు. అనకవాడు పెళ్ళి చేసుకోనంటే

ఏడ్చే హక్కు వుంది నీకు. ఇంకా ముందుకు వెళ్ళితే ఏదన్నా అయితే ఎనుయ్యో గొయ్యో చూసుకునే హక్కు వుంది నీకు'' కసిగా కూతుర్ని చూస్తూ కర్కశంగా అన్నారాయన. రూప తల దించుకుంది. "ఇంతకీ వాడెవడు? వాడితో ఉత్తి ప్రేమేనా యింకా ఏమన్నా వుందా?" వ్యంగ్యంగా అడిగారాయన. రూప ఉక్రోషంగా చూసింది. పద్మావతి కల్పించుకుని "ఏమిటండీ ఆ మాటలు. ఇదేనా అడిగే తీరు" కాస్త కఠినంగా అంది.

"ఇలా కాకపోతే యింకెలా అడగాలి? అదంత కుండ బద్దలు కొట్టినట్టు మన మొహాన ప్రేమించాను, తిరుగుతాను అని చెప్పగా లేంది నేను అడగడం తప్పా. ఫారెనర్స్‌లా బెల్‌బాటమ్స్ వేసుకోడం, జుట్టు కత్తిరించుకోడంతో సరిపెట్టకుండా బాయ్‌ఫ్రెండ్స్, డేటింగులు పెళ్ళికిముందే అన్ని అనుభవాలు పూర్తి చేసుకుంటూండగా నేనడగడం తప్పా? పద్మా నీ కూతురికి ఒక్క విషయం మాత్రం చెప్పు ఫారెనర్స్‌లా బాయ్‌ఫ్రెండుతో లవ్ ఎఫైర్ జరపచ్చునని, ఆ తరువాత వాడు కాదంటే ఈ దేశంలో మగ వెధవన్న వాడు ఎవడూ దాన్ని పెళ్ళాడదని, పెళ్ళికి ముందేదన్నా అయితే దాని బతుకు అధోగతేనని, అలాంటి ఆడదాన్ని ఈ దేశంలో ఏ మగాడూ ఉద్ధరించడని, ఆ తరువాత దాని గతి బజారు పాలేనని తెల్లియచెప్పు. వాడు కాదంటే తన బతుకు అది బతికే అవకాశం కూడా యీ సంఘం యివ్వకుండా కాకుల్లా పొడిచి చంపుతుందని పాపం దానికి తెలియనివన్నీ విడమర్చి చెప్పు. మనదేశంలో ఆడదాని శీలానికి ఎంత విలువ యిస్తారో, ప్రతి మగాడు అందినంత మేరకు అనుభవిద్దామని తప్ప, నిజాయితీగా ప్రేమించి పెళ్ళాడేవాడు నూటికి ఒకడన్నా వుండడని కూడా చెప్పు. మన అభ్యున్నతి, మన పురోగతి అంతా బెల్‌బాటమ్స్, బాబ్డ్ హెయిర్‌లతోనే ఆగిపోతుంది కాని ఒకసారి తప్పటడుగు వేసిన ఆడదాన్ని అర్థం చేసుకు, ఆ బలహీనతని క్షమించే ఔదార్యం చూపే సంస్కారం, ఔన్నత్యం మనదేశంలో మగాళ్ళకి లేదన్నది దానికి అర్థం అయ్యేట్టు చెప్పు. అన్నీ చెప్పాక ఆ ప్రేమించిన వాడెవడో, ఆ ప్రేమ పెళ్ళిదాకా వెడ్తుందో లేదో అడుగు. ఇది హిందూదేశం కనక కూతురి పెళ్ళి బాధ్యత తండ్రిది కనక ఆ వివరాలు తెలుసుకోడం అవసరం కనక అన్నీ అడుగు. అక్కరలేదు దాని పెళ్ళి అదే చేసుకుంటానంటే మరీ మంచిది ఖర్చు తగ్గిందనుకుంటాను"

"మీకు మతిపోయింది. ఏది అడగకుండా ఏది వినకుండా ఈ గొడవేమిటి?" పద్మావతి కాస్త తీక్షణంగా అంది.

"అవును మతిపోయింది.. ప్రతీవెధవా వచ్చి నీ కూతురు హోటళ్లలో, పార్కుల్లో సినిమాల్లో ఎవడితోనో తిరుగుతూంది అని చెప్పిన క్షణంలోనే మతిపోయింది"

"రూపా!" పద్మావతి కూతురు వంక తిరిగి తీక్షణంగా చూస్తూ అరిచినట్టే పిల్చింది.

"చెప్పు-ఎవరా కుర్రాడు? ఎన్నాళ్ళబట్టి మీ పరిచయం?ఇన్నాళ్ళబట్టి ఎందుకు నేనెన్నిసార్లు అడిగినా అబద్ధాలు చెప్పావు...మీ నాన్న ఇలాగ, నీవలాగ? మధ్య నేను చస్తున్నాను. పద్దెనిమిదేళ్ళ పిల్లవు, ఆ మాత్రం ఇంగిత జ్ఞానంలేదు- ఇన్ని పుస్తకాలు చదువుతూ, ఇన్ని సినిమాలలో ఈ ప్రేమలు నమ్ముకుని మోస



పోయిన ఆడపిల్లల గతి చూస్తూ కూడా జ్ఞానం లేకుండా మమ్మల్ని ఇలా మోసం చేస్తావా? ఊరంతా తెలిసేవరకు మాకు తెలియనే లేదు" పద్మావతి ఆవేశంగా దులిపేసింది. తండ్రి, ఆ తరువాత తల్లి వరసగా తిడ్తోంటే గుడ్లప్పగించి చూస్తూ వూరుకుంది రూప "ఏం మాట్లాడవేం?" గద్దించింది పద్మావతి.

"ఏం మాట్లాడాలి?" రూప తలెత్తి సూటిగా చూసింది నిర్భయంగా.

"అదే మా దగ్గర ఎందుకు దాచావు? ఎందుకు చెప్పలేదు?"

"ప్రేమించుకునేవాళ్ళు అందరికీ చెప్పి ప్రేమించుకోరు" మొండిగా అంది రూప.

"చూశావా దాని పొగరు..." విశ్వనాధంగారు ఆవేశంగా అన్నారు.

"పొగరేముంది యిందులో! అతను నాకు నచ్చాడు. ఇద్దరం పెళ్ళి విషయం నిర్ణయించుకున్నాక మీకు చెబుదామనుకున్నాను. ఏం నా అంతట నేను నాకు

కావల్సిన వాడిని నిర్ణయించుకోకూడదా? ఆ మాత్రం స్వాతంత్ర్యం నాకు లేదా?" రూప రోషంగా అడిగింది తండ్రివంక చూస్తూ.

"అంత స్వాతంత్ర్యం వుందనుకున్న దానివి, నీవు చేస్తున్నదానిలో తప్పు లేదనుకున్నదానివి అలా రహస్యంగా చాటుగా తిరుగుతూ అబద్ధాలెందుకు ఆడావు. ధైర్యంగా ఆ అబ్బాయిని ఇంటికి తీసుకొచ్చి మాకు చూపిస్తే చాలా సంతోషించేవాళ్ళం. తప్పకుండా మీ ఇద్దరికీ పెళ్ళి చేసేవారం..."పద్మావతి అంది.

"మేం ఇంకా పెళ్ళిమాట నిర్ణయించుకోలేదు. నిర్ణయించుకున్నాక చెబుదామనుకున్నాను"

"రూపా! మతిలేని మాటలు మాట్లాడకు. నీవు ఇష్టం వచ్చినట్టు అతనితో ఆర్నెల్లు తిరిగాక అతను చేసుకోనంటే ఏం చేస్తావ్?"

"ఎందుకు చేసుకోడు" రెట్టించింది



రూప. "అంతా మీరనుకున్నలాంటివాళ్ళే గాదు...సురేష్ అలాంటివాడుకాదని నాకు తెల్సు..."

"మంచిదే నీకంత నమ్మకం వుంటేకాని కీడెంచి మేలెంచాలి. ఒకవేళ ఈ అర్నెల్లు తిరిగాక అతను ఈ వ్యవహారాన్ని పెళ్ళి వరకు తేవడానికి ఇష్టపడకపోతే అప్పుడు నీ గతి ఏమవుతుందో ఆలోచించావా ? అపుడు నీవేం చెయ్యగలవు-అదంతా ఆలోచించావా...?" పద్మావతి శాంతంగా నచ్చ చెప్పే ధోరణిలో అంది. "ఇందాక మీ నాన్న అన్నట్టు డేటింగ్‌లు చేసి నచ్చక పోతే వదిలేసి మరొకడ్ని కట్టుకోడానికి ఇదేం విదేశం కాదు. ఇప్పటికే మీ ఇద్దరి సంగతి వూరు వాడ తెల్సింది. రేపొద్దున అతను కాదంటే నీకింక ఈ జన్మలో పెళ్ళి కాదు. అది తెల్సునా నీకు" తీక్షణంగా అంది పద్మావతి.

"పోనీ కాకపోతే ! పెళ్ళి కాకపోతే చచ్చిపోం. ఏ ఉద్యోగం చేసుకునో బతక గలను..." రోషంగా అంది.

"మొండి వాదన మాను. అదంతా తర్వాత సంగతి. ముందసలు అతనెవరు? నీకెలా పరిచయం-అది చెప్పు" విశ్వనాధం గద్దించారు. రూప ఇబ్బందిగా కదిలింది. "నేను అడుగుతాలెండి. మీరు వెళ్ళండి ఎనిమిదిన్నర అయింది. ముందు భోజనాలకి పదండి" ఇంక ఇప్పటికి వూరుకోండన్నట్టు భర్తకి కళ్ళతో సైగచేసి వంటింట్లోకి వెళ్ళింది పద్మావతి. విశ్వనాధం రూప వంక తీక్షణంగా ఓ చూపు విసిరి పడక గదిలోకి వెళ్ళిపోయాడు. రూప అప్పటికి గండం గడిచినందుకు తేలిగ్గా ఊపిరి తీసుకుంది.




విశ్వనాధంగారు స్టేట్ బ్యాంకులో ఆఫీసరు. రెండు వేల జీతం...ఫోను, మంచి ఇల్లు హంగులు అన్నీ వున్నాయి. ఆయనకి నలభై ఎనిమిదేళ్లు. పాతికేళ్ళ క్రితం బ్యాంకులో గుమాస్తాగా చేరి అలా పరీక్షలు పాసయి స్వశక్తితో పైకివచ్చిన మధ్యతరగతి సంసారి. గుమస్తాగా వున్నప్పుడు మూడు నాలుగు వందల జీతంతో అట్టే వేషాలకి పోకుండా ఎలా సంసారం నెట్టారో, ఈనాడు రెండు వేలు వచ్చినా రాబడితో పాటు ధరలు, ఖర్చులు అన్నీ పెరిగి మామూలు మధ్యతరగతి సంసారుల జీవితాలోనే వున్నారు వారు.

ఆయన భార్య పద్మావతి మెట్రిక్ వరకు చదువుకుంది. అందగత్తె కాకపోయినా చామనఛాయ రంగులో కలకల్లాడుతూ వుంటుంది. వారి మొదటి సంతానం రూప, రెండు రవి, మూడు శారద. ముచ్చటగా ముగ్గురు పిల్లలతో దేనికి లోటులేని సంసారం వారిది. రూప బి. ఏ. పరీక్ష ఇచ్చిందగ్గిరనించి కూతురికి పెళ్ళి చెయ్యాలని పద్మావతి విశ్వనాధం గార్ని తొందరపెట్టింది. గత మూడు నెలలుగా ఆయన వీళ్ళని వాళ్ళని మంచి సంబంధాల కోసం వాకబు చేస్తూనే వున్నాడు. కాస్త వెయ్యిరూపాయలు తెచ్చుకునేవాడుగా ఏ ఇంజనీరో, డాక్టరో, కాస మంచి కంపెనీ ఉద్యోగంలో వున్నవాడో

చూసి చెయ్యాలని ఆయన సంబంధాలు చూస్తున్నారు. కాస్తో కూస్తో కట్నం ఇవ్వ గల శక్తి వుంది. వున్నది ముగ్గురేకనక, శారద పెళ్లి ఇప్పట్లో లేదు కనక ఓ ఇరవై - పాతికవేలు ఖర్చుపెట్టి మంచి సంబంధం చెయ్యాలని వారి కోరిక.

రూప పేరుకి తగ్గట్టు రూపసే! తండ్రి రంగు, తల్లి పోలికలతో సన్నగా నాజుగ్గా పొడుగ్గా తెల్లగా అందం గానే వుంటుంది. అందానికి తోడు ఈ కాలం పిల్లలలా ఆకర్షణీయంగా అలంక రించు కుంటుంది. ఆమె చిన్నతనం యించుమించు కాస్త మంచి వూర్లల్లో గడ పడం, చిన్నప్పటినించి కాన్వెంటు స్కూల్సులో చదవడం, మెట్రిక్ దగిర నించి హైదరాబాద్‌లో వుండడం అన్నీ కలసి ఆమెకి నాగరీకంగా వుండడం, అధునికంగా ముస్తాబవడం, తెగ ఇంగ్లీషు పుస్తకాలు చదవడం, వచ్చిన సినిమా లన్నీ చూడడం, ఫ్రెండ్సు, పార్టీలు అంటూ తిరగడం అన్నీ అలవాటే. యింట్లో ఏ పనీ ముట్టుకోకుండా ఏ మిల్స్ అండ్ బూన్ నవలో పట్టుకుని, రికార్డులు వింటూ కూర్చోవడం, టెలిఫోనులో గంటలకొద్దీ స్నేహితులతో కబుర్లు-ఈ కాలం పిల్లలకి ప్రతీక రూప. విశ్వనాధంగారు కాస్త పాత భావాలున్న ఆయన. ఆడపిల్లలు విచ్చల విడిగా తిరగడం ఆయనకి నచ్చదు. శుభ్రంగా వాల్జడ వేసుకుని చీరకట్టుకో కుండా ఆ మాక్సీలు, బెల్‌బాటమ్స్ వేసు కోడం ఆయనకి నచ్చదు. కాని రూప యింట్లో తల్లిని వేధించి ప్రాణాలు తీసి మా ఫ్రెండ్స్ అందరూ బెల్‌బాటమ్స్ వేసుకుంటూంటే నేను ముసలమ్మలా చీర కట్టుకోవాలా, ప్రతి వాళ్లు కట్టుకుంటూంటే నాకేమా వచ్చింది అని సాధించి పంతం నెగ్గించుకునేది. పద్మావతి కాలానికి అను గుణంగా పోవాలనుకునే తత్వంగలది. ఆమెకి ఛాందస భావాలు లేవు. ఆమె అధునికతపట్లే మొగ్గు జూపేరకం. అందరి పిల్లలు ఒకలా వుంటే తన కూతురు వారికి తీసిపోయినట్లుండడం ఆమెకీ నచ్చదు. అంచేత భర్తతో వాదించి ఒప్పించింది. విశ్వనాధంగారు మొదట్లో అభ్యంతరం చెప్పేవారు. పద్మావతిని కసిరేవారు - ఏమిటి మగ రాయుడులా ఆ బట్టలేమిటి, ఆ రవిగాడికి దీనికి ఒకటే బట్టలా? ఆ జీన్స్ ఏమిటి అసహ్యంగా? ఆ రంగు వెల్సి పోయిన ఆ ప్యాంటులు ఫాషనా... శుభ్రమైన జుత్తంతా అలా కత్తిరించింది ఎందుకు, ఆ కను బొమలు కోసుకోవడం ఏమిటి, ఆ హీల్స్ చాలా జోళ్ళకి-అంటూ గొణిగేవారు భార్య దగ్గిర.

మీరు మరీనూ...వూరుకోండి, అన్నిం టికి సాధిస్తారేమిటి? దాని ఈడు పిల్లలు అందరూ అలా తయారవుతూంటే అది వూరుకుంటుందేమిటి? ఈ రోజుల్లో ఫాషన్ యిది. మన కాలంలా పరికిణీ, ఓణీ, వాల్జడ వేసుకోమంటే వేసుకుంటారా ఈ కాలం పిల్లలు. కొన్ని చూసి చూడనట్టు వూరుకోవాలి మనమూ అనేది. భార్య, కూతురు ఒకటవడం, మిగతా ఆడపిల్లల్ని అందరిని చూసి ఫేషను కాబోలు అని ఆయనా కొన్నాళ్లకి సర్దుకుని వూరు కున్నారు.

సినిమాలకి, షికార్లకి ఫ్రెండ్స్‌తో తిరగడం మొదలైన విషయాలు ఆయనకి తెలియకుండా కొన్ని దాచిపెట్టాల్సి వచ్చేది పద్మావతికి. ప్రాణాలు కొరికే పిల్లలు.... పిల్లల సరదాలు అనుకోకుండా రాద్ధాంతం చేసే భర్త మధ్య పద్మావతికి అప్పుడప్పుడు

ప్రాణసంకటంగా వుండేది. ఈడొచ్చిన పిల్లలు, అందునా, ఈ కాలం పిల్లలు ఇంట్లో తల్లి తండ్రుల భావాలు ఓల్డ్ ఫేషన్ అనుకుని తల్లిమాట లెక్కచెయ్యకుండా తిరిగేది రూప. అది భర్తకు తెలియకుండా కప్పిపుచ్చుతూ, ఏదో సర్ది చెపుతూ అవస్థ పడేది. పదిసార్లు ప్రాణం తీస్తే నాలుగు సార్లు ఒప్పుకునేది సినిమాలకి వాటికి. తెల్సిన రోజు భర్తతో చివాట్లు తినేది. విశ్వనాథం ఎంతసేపు భార్య మీద ఎగిరే వాడు కాని పిల్లలని అదేం అని ఎదురుగా అడిగేవాడు కాడు. విశ్వనాథమేకాదు మూడొంతుల మంది తండ్రులు పిల్లలు ఏం చేసినా తల్లిదే తప్పన్నట్టు పిల్లలని పిలిచి అడగకుండా భార్యని తిడ్తారు. దాంతో పిల్లలకి తిట్టినా అమ్మని తిడ్తారు అన్న ధైర్యం వచ్చి తల్లిమాట లెక్క చెయ్యరు. దాంతో రూపకి తల్లిమాట అలుసు అయి ఒక్కోసారి పద్మావతి గట్టిగా కేకలు వేసినా ఆ నాన్న అడిగితే నేను చెపుతాలే అంటూ నిర్లక్ష్యంగా వెళ్ళి పోయేది. భర్తకి తెలిస్తే తిట్లు తనకేనని పద్మావతి అది దాచేది. ఆ విధంగా రూప కావాలనుకున్న చోటికి యిష్టం వచ్చినట్లు తిరగడం అలవాటయింది.

కాలేజీలో చదివినన్నాళ్ల ఫ్రెండ్స్‌తో అట్నించి అటు మాట్నీ సినిమాలకి చెక్కేయడం, ఏమంత ఆలస్యమయిందంటే ఏ ఎక్స్‌ట్రా క్లాసు వుందనో అనేది. కాలేజీ వున్నన్ని రోజులు రోజుకో డ్రెస్సుతో ముస్తాబయి విచ్చలవిడిగా తిరిగేది. పరీక్ష లవగానే కాళ్లు చేతులు కట్టేసినట్లయి పోయింది. ఏ వంకన యింట్లోంచి బయట పడాలా అని ఆలోచించేది. ప్రతిరోజూ బయటికి వెళ్లడానికి లక్ష అంక్షలు చెప్పేది పద్మావతి. ఒక నెల రోజులు ఇంట్లో కూర్చునే సరికే పిచ్చిఎక్కినట్లయింది రూపకి.

ఆఖరికి ఓ రోజు టాంక్‌బండ్ వైపు షికారు వెడ్తూంటే తోవలో ఓ టైపు ఇన్‌స్టిట్యూట్ కన్పించింది. దాన్ని చూడగానే ఓ ఆలోచన తళుక్కుమంది రూపకి. లోపలికెళ్లి వివరాలు కనుక్కుంది. సాయంత్రం ఓ గంట గంటన్నర టైపు నేర్చుకునే వంకతో యింట్లోంచి బయట పడొచ్చని సంతోషించింది. టైపు నేర్చు కోడమూ సరదాగా వుంటుంది. ఏదన్నా ఉద్యోగం చెయ్యాలంటే సుళువుగా దొరికే ఛాన్సు వుంటుంది. తల్లిని ఎలా గైనా ఒప్పించవచ్చు. తండ్రి ఒప్పుకోడమే ప్రాబ్లము అనుకుంది.

"నీకెందుకే టైపు యిప్పుడు పనిపాట లేక" అంది పద్మావతి రూప అడగగానే. "ఏదో ఆడపిల్లలకీ డిగ్రీలుండాలని చదివించాంకాని నీవేం ఉద్యోగం చెయ్యాలా, వూళ్లేలాలా? ఆ టైపెందుకు దండుగ. రేపో మాపో పెళ్ళి చేసుకుని వెడతావు, ఎటూ కాకుండా నాల్గురోజులు నేర్చుకుని ఏం లాభం" అంది. "ఆ! లాభం ఎందుకు లేదు, ఆర్నెల్లు నేర్చుకుంటే లోయర్ పరీక్ష పాసయితే ఏదన్నా ఉద్యోగం చెయ్యచ్చు. నాకు యింట్లో బోర్‌కొట్టి చస్తున్నాను, టైపు నేర్చుకున్నట్లుంటుంది నాకూ తోస్తుంది..."

"ఒసే, నీవు నా ప్రాణాలుతినకు, వెళ్లి మీ నాన్నని అడుగు. మీ నాన్న మాట్లాడితే ఆడ పిల్ల వంటరిగా వెళ్లి ఆ టైపు నేర్చుకోకపోతే కొంప మునగదు అంటారు. కాలేజీకంటె తప్పక చదువు లేకపోతే లాభం లేదని పంపారు గాని

టైపు గీపు అంటే ఒప్పుకోరు నేనడగను. నీవే అడుగు..." అంది పద్మావతి విసుగ్గా.

"అబ్బబ్బ...ఆడ పిల్ల...ఆడ పిల్ల. ఏమిటమ్మా ఎన్నాళ్ళయినా ఈ ఆడపిల్ల అన్న మాట మీరు వదలరేం. ఏం ఆడ పిల్లనయితే ఏంతక్కువచ్చింది-మన ఇంటి నుంచి మహా అయితే అర కిలో మీటరు దూరం. నడి బజారు, సాయంత్రం ఒక గంటన్నర వెళ్ళి రావడానికి ఆడ పిల్ల ఏమిటి. టైపు నేర్చుకొంటే దేనికన్నా పనికొస్తుంది. నేను వెడతాను" మొండిగా అంది రూప.

"ఉద్యోగం చెయ్యాలనుకున్న వాళ్ళకి టైపు పనికొస్తుంది. నీకెందుకు? రేపో, మాపో పెళ్ళి చేద్దాం అనుకునే దానికి ఆ డబ్బు కూడా దండగ ఎందుకు"

"ఆ...చేస్తారు పెళ్ళి. అంతా మీ ఇష్టమే. నేను యం.ఏ. చదవాలి. నేనేం ఇప్పటి నుంచి పెళ్లిచేసుకోను, రిజల్ట్సు రావాలి, యూనివర్సిటీలో చేరాలి – ఈ లోగా టైపు నేర్చుకొంటాను. అంతే. నాన్నకి నీవు చెప్పుకో. రేపట్నించి నేను వెడుతున్నాను" అంటూ నిష్కర్షగా చెప్పేసింది రూప. కూతురు మొండితనం తెల్సింది కనక ఏం చేసినా పంతం నెగ్గించుకుంటుందని అర్థం అయి విశ్వనాథం గారికి నచ్చ చెప్పి, బతిమిలాడి, తిట్లు తిని ఒప్పించింది "పోనీలెండి! కాల క్షేపం లేదని కొట్టుకొంటోంది. ఆడ పిల్లలకి యిటు చదువూ లేక, అటు పెళ్లీ లేక యింట్లో కూర్చోడం అంటే విసుగు కాదూ? పోనీ బద్ధకంగా ఈ చెత్త ఆ చెత్త చదివేకంటే పనికొచ్చే పని మంచిదేగా! పదిరూపాయలే అట నెలకి. సాయంత్రం ఓ గంటేగా – ఆ పెళ్ళి కుదిరితే అపుడే మాన్పించవచ్చు. ఇంక వద్దంటే రోజూ తోచడం లేదంటూ సినిమాలు, షికార్లు అంటూ ప్రాణాలు తీస్తుంది" అంటూ బతిమిలాడి ఒప్పించింది.

"దాన్ని నీవే పాడుచేస్తున్నావు. దాని ఇష్టం వచ్చినట్టు ఆడుతున్నావు. నీ ఇష్టం, నీ కూతురిష్టం నాతో ఎందుకు చెప్పడం" అని విసుక్కుని ఊరుకున్నారాయన.

రూప సంబరంగా టైపు ఇన్‌స్టిట్యూట్ కి వెళ్ళడం ఆరంభించింది. మొదటి రోజు అక్కడ అంత మంది అపరిచితుల మధ్య సురేష్‌ని చూడగానే చాలా సంతోషం కలిగింది. అక్కడ మొత్తం ఏభయిమంది ఒక్కసారి నేర్చుకోడానికి వీలుగా పెద్ద హాలు, టైపు మిషన్స్ వున్నాయి. పది పన్నెండు మంది ఆడ పిల్లలు, మిగతా అంతా మగవాళ్ళు. వాళ్ళలో టీనేజ్ వాళ్లున్నారు. కొందరు 30–40 ఏళ్ల వాళ్ళూ వున్నారు. పార్ట్ టైంగా సాయంత్రం వచ్చి నేర్చుకొనే వాళ్ళు చాలా మందివున్నారు. టైపు నేర్చుకొంటే ఉద్యోగాలు వస్తాయన్న ఆశతో చాలా మంది నేర్చుకుంటున్నారు. టైపు, షార్ట్‌హాండ్ నేర్చుకుంటే అన్నింటికీ మంచిదని సెలవుల్లోవచ్చినేర్చుకునే కాలేజీ పిల్లలూ వున్నారు. రోజుకి ఆరు షిఫ్టులుతో ఎప్పుడూ ఆ ఇన్‌స్టిట్యూట్ బిజీగానే వుంటుంది. సురేష్ ఇల్లు అక్కడికి దగ్గరవడం, ఖాళీగా వున్నానని అతనూ నేర్చుకోడానికి పదిహేను రోజుల నించి రావడం ఆరంభించాడు. సురేష్ బి. కాం., రూప బి. ఏ. రూపకి సీనియర్ అయినా ఇద్దరూ ఒకే కాలేజీ అవడంతో చాలా సార్లే చూసింది రూప. అంతేకాక సురేష్ కాలేజీ డ్రామాలలో చాలా సార్లు ఏక్ట్ చేశాడు. ఏక పాత్రాభి

నయాలు, ఫాన్సీ డ్రస్సులు అన్నింట్లో ఫస్టు ప్రైజులు కొట్టేసి అమ్మాయిల దృష్టిలో హీరో అయ్యాడేమో - రూపకి అతను బాగా గుర్తే. సురేష్ అమ్మాయిలు కలలు కనే హీరోలా వుంటాడు. 5 అడుగుల 11 అంగుళాలు. మంచి రంగు, పొడుక్కుతగ్గ లావు-షోగ్గా పెంచిన మీసాలు, సైడ్ బరన్స్ - మంచి మడత నలగని డ్రస్సులు. టిప్‌టాప్‌గా చాలా కలివిడిగా, జోక్స్ కట్ చేస్తూ అందరినీ చుట్టూ తిప్పుకునే చాకచక్యాలున్నవాడు. అతన్ని చూసి, అతని నాటకాలలో వేషాలు చూసిన చాలా మంది అమ్మాయిలకి హీరో వర్షిప్ అతనంటే ఆ కాలేజీలో. రూప క్లాస్ మేట్స్ కూడా అతనంటే పడి చచ్చేవారు కొంతమంది. అప్పుడు అతని గురించి రూప అంత పట్టించుకోలేదు. ఏదో ఒకటి, రెండుసార్లు మామూలు మాటలు తప్ప అంత పరిచయం లేదు అతనితో.

కాని ఆ రోజు అంత మంది అపరిచిత అమ్మాయిలు, అబ్బాయిల మధ్య సురేష్ కనపడగానే ఏదో ఆప్తమిత్రుడిని ఏదో చాలా రోజుల తర్వాత చూసినంత ఆనందం కలిగింది. సురేష్ కూడా రూపని చూడగానే కాలేజీమెట్ అని గుర్తించి సంతోషంగా "అరే! మీరూ టైపు నేర్చుకోడానికి వచ్చారా?" అన్నాడు.

"ఊ...మీరూ నేర్చుకుంటున్నారా? ఎన్నాళ్ళనించి?" కుతూహలంగా అడిగింది రూప. "ఏది మొన్నే! పది పది హేనురోజుల నించి వస్తున్నాను. శలవుల్లో తోచడం లేదు. పోనీ సాయంత్రం ఇదో కాలక్షేపం. ముందు ముందు ఎందుకన్నా పనికొస్తుంది ఇంకా ఉద్యోగం దొరక్కపోయినా ఏ టైపిస్టుగానో, ఏ ఆఫీసులోనో పని దొరక్క పోతుందా అని వచ్చాను నేర్చుకోడానికి" అన్నాడు నవ్వుతూ. "మరి మీరు? టైపు షార్టు హాండు కూడా నేర్చుకొంటే, మీలాంటి అందమైన అమ్మాయిలకి సెక్రటరీలుగా, రిసెప్షనిష్టులుగా మంచి ఉద్యోగాలు గ్యారంటీగా దొరుకుతాయి" అన్నాడు చనువుగా. అందమైన మీలాంటి అమ్మాయిలు అన్న అతని మాట రూప మీద మొదటి క్షణం లోనే పని చేసింది. తన అందాన్ని పరోక్షంగా పొగిడిన అతను ఆమెకి చాలా నచ్చాడు. ఒక టీనేజ్ ఆడపిల్ల హృదయాన్ని ఎలా మీటాలో అలా మీటి వదిలాడు ఆ ఒక్క మాటతో సురేష్.

"నేనూ ఊరికే కాలక్షేపానికే వచ్చాను. అబ్బ ఈ నెలకే యింట్లో కూర్చునేసరికి బోర్ కొట్టిపోయింది. మా ఇల్లు హిమయత్ నగర్‌లో. వాకింగ్ డిస్టన్స్ సరే అని వచ్చాను" అంది రూప.

"అరే! మీ ఇల్లు హిమయత్ నగర్‌లోనా! చూశారా ఇన్నాళ్ళబట్టి ఆ విషయమే తెలియలేదు. అఫ్‌కోర్స్ మీరు క్లాస్‌మేట్ కాదుగా. లేకపోతే మీ ఎడ్రసు, బయోడాటా అంతా మాకు చేరేది ఎప్పుడో. పోనీలెండి ఇప్పుడు ఎక్కించుకొంటాను డైరీలో" అన్నాడు గమ్మత్తుగా నవ్వుతూ. రూప ఆ నవ్వుకి, ఆ చూపుకి ముగ్ధురాలైంది మొదటి క్షణంలోనే.

* * *

ఆ తర్వాత మూడు నెలల్లో వాళ్ళిద్దరూ చాలా సన్నిహితులయిపోయారు. మొదట్లో ఇద్దరూ టైపు నేర్చుకుంటూ కబుర్లు చెప్పుకునేవారు. ఇంటికెళ్ళేటప్పుడు నెమ్మదిగా ఈ మాట ఆ మాట మాట్లాడు

కుంటూ ఇద్దరూ కలిసి వెళ్ళేవాడు. కాలేజి విషయాలు సినిమాలు, పుస్తకాలు, ఫ్రెండ్సు...ఇద్దరి కబుర్లకి అంతువుండేది కాదు. రూపకి స్నేహితులుంటే చాలు మాటలు అలా దొర్లిపోతాయి. అందులో సురేష్ చమత్కారమో ఆ మాటల ప్రభావానికి చాలా తొందరలోనే ఆకర్షితురాలైంది. వారి పరిచయం పదిహేను రోజులు గడిచేసరికి మంచి స్నేహంగా మారింది. "ఇంకా ఆరు కూడా అవలేదు, అప్పుడే ఇంటికెళ్ళి ఏం చేస్తారు? కాసేపు అలా టాంక్‌బండ్ మీద కూర్చుందామా" అనేవాడు సురేష్. అంతకంటే రూపకింకేం కావాలి. 'ఓ యస్' అంది రూప. "అరే లిబర్టీలో మంచి ఇంగ్లీషు పిక్చర్ వచ్చిందే" అన్నాడొకరోజు. సినిమా అయితే చాలు ఎంత చెత్తయినా చూడడానికిష్టపడే రూప సంబరంగా ''వెడదామా?'' అంది ఆరాటంగా. తను పిలిస్తే అభ్యంతరం చెపుతుందేమోనని సందేహించిన సురేష్ ఆమె అడగానే చాలా ఆనందించాడు. ఆ రోజు సురేష్‌తో కల్సి చూడడం రూపకి కొత్త అనుభవం. ఇదివరకు గరల్‌ఫ్రెండ్సుతో వెళ్ళింది. ఒకటి రెండుసార్లు క్లాసు పిల్లలందరూ ఫేర్‌వెల్ పార్టీ అంటూ పార్టీ చేసుకు పిక్చరుకెళ్ళారు. ఇలా బాయ్ ఫ్రెండుతో ఒంటరిగా రావడం అదే ప్రథమం రూపకి. సురేష్ పక్కన కూర్చుని పిక్చర్ చూడడం చాలా ఎక్సైటింగ్‌గా అనిపించింది ఆమెకి. అసలే ఇంగ్లీషు పిక్చరు, దానికి తోడు రొమాంటిక్ పిక్చరేమో సినిమా అంతా ముద్దులు, కౌగలింతలు. సురేష్‌ని పక్కనుంచుకుని అవన్నీ చూస్తుంటే రూపకేదో అయింది. దానికి తోడు సురేష్ తెరమీద అలాంటి దృశ్యాలు వచ్చినపుడల్లా రూప వైపు కొంటెగా చూస్తూ నవ్వాడు.

చీకట్లో కూడా అతని కళ్ళలో మెరుపు, ఆ కళ్ళల్లో మెదిలిన భావం స్పష్టంగా చూసి రూప సిగ్గుపడింది. సురేష్ చెయ్యి అంటీ అంటనట్టు అప్పుడప్పుడు ఆమెకి తగులుతూంటే ఏదో తెలియని పులకింత, మరేదో తెలియని అనుభూతిని కల్గించింది. రూప మొదటిసారిగా సినిమా సరిగాచూడలేకపోయింది. తెరవైపు చూస్తున్నా కథ ఏం జరుగుతుందో అసలు తలకెక్కలేదు. రూప సిగ్గుపడడం చూసి సురేష్ "వై యూ ఆర్ సో అన్ కంఫర్టబుల్, సిగ్గేస్తుందా?" అని చెవి దగ్గిర నోరుపెట్టి కొంటెగా అన్నాడు. "బాగులేవూ ఆ సీన్లు. మనవాళ్ళ లవ్ సీన్లు వల్గర్‌గా వుంటాయి. ఇవి చూడండి ఎంత నేచురల్‌గావుంటాయి చూస్తుంటే! అసహ్యం అన్పిస్తుందా నిజం చెప్పండి బాగులేదూ హౌ డు యూ లైక్ ఇట్" అన్నాడు ఆమెవైపు వంగి. ఆమె మొహం మీదకి అతని వెచ్చని ఊపిరి తగిలింది. 'ఊదో' సువాసన, అతను రాసుకున్న 'లిరిల్' పౌడరు వాసనా రూపని మైమరపులో పడేశాయి. అతని కళ్ళతో కళ్ళు కలపలేక తలదించుకుంది. ఆమె శరీరం చిన్నగా వణికింది. రూపలో అలజడి గుర్తించాడు సురేష్. అతనికి అమ్మాయితో ఇలాంటనుభవం మొదటిదే! రూప వైఖరి అన్నివిధాలా ప్రోత్సాహకరంగా వుండడంతో అతనిలో ఉత్సాహం పెరిగింది. తను ఎక్కడికి రమ్మన్నా అభ్యంతరం చెప్పకపోవడం, సినిమాకి కూడా ఒంటరిగా ఇంట్లోవాళ్ళు ఏమన్నా అనుకుంటారని కూడా భయపడకుండా రావడం అతన్ని ముందుకు వెళ్ళడానికి ప్రోత్సహించాయి. "రూపా!..." హఠాత్తుగా అన్నాడు.

అన్నాళ్లూ 'రూపగారూ' అనే సురేష్ 'రూపా' అనగానే ఆ గొంతులో మార్పుకి ఆశ్చర్యపడి తలతిప్పి చూసింది "సారీ రూపగారూ...". "వద్దు వద్దు...అలాగే పిలవండి" అంది రూప. "అయితే మీరు గీరు మానేసి నన్ను సురేష్ అనాలి. ఓ.కె. నిజంగా ఈ ఇరవై రోజులలో మనం ఇంత ఫ్రెండ్స్‌లా అయిపోయాం అంటే ఆశ్చర్యంగా లేదూ? ఇన్నాళ్ళుగా తెల్సినా, చూసినా ఒకరినొకరం పట్టించు



కోకుండా ఎలా వున్నామా అని ఆశ్చర్యంగా వుంది ఇప్పుడు. ఈ లైవ్ ధర్మమా అని మనం ఫ్రెండ్స్ అయ్యాం...రూపా టూ టెల్ యూ ఫ్రాంక్‌లీ...ఐ లైక్ యూ. కొంతమంది అమ్మాయిలలా మాట్లాడిసే సిగ్గుతో ముడుచుకుపోకుండా మగాళ్ళతో మాట్లాడితే తప్పన్నట్టు ప్రవర్తించే అమ్మాయిలని చూస్తే నాకు ఎలర్జీ...నీలా ఇలా ధైర్యంగా, ఫ్రాంక్‌గా, ఫ్రెండ్లీగా వుండే అమ్మాయిలు అరుదు. మీ ఆడపిల్లలు ఎంతసేపూ డ్రస్సులు వేసుకోవడంలో తప్ప మిగతా వాటిల్లో ఫార్వార్డ్‌గా వుండరు. ఎన్ని కబుర్లు చెప్పినా మళ్ళీ మగాళ్ళతో ఫ్రీగా వుండరు. అంచేతే ఐ లైక్ యూ అన్నాడు మెచ్చుకోలుగా. రూప పొంగిపోయింది ఆ పొగడ్తలకి. అతని ఐ లైక్ యూ అన్న మాట ఆమెకి బాగా నచ్చింది. ఆ రాత్రి రూప ఒక్క క్షణం నిద్రపోలేకపోయింది. ఎటుచూసినా సురేష్ రూపం తప్ప మరోటి కనపడ



లేదామెకి. 'ఐ లైక్ యూ' అన్న ...అతని పొగడ్త 'ఐ లవ్ యూ'లా ఆమె మీద పనిచేసింది. 'ఐ టు లైక్ యూ' సురేష్. ఐ లవ్ యూ...ఐ లవ్ యూ...' మనసులో పదేపదే అనుకుంటూ మంచం మీద దొర్లుతూ ఆ రాత్రంతా జాగారం చేసింది.

ఆ రోజునించీ రూప ప్రేమలోపడింది.

* * *

తరువాత రెండు నెలల్లోనే వారి ప్రేమ

పరాకాష్ట చేరింది. రూప సురేష్‌ని మన సారా ప్రేమించింది. అతని కోసం ఏం చెయ్యడానికన్నా సిద్ధపడేంతగా అతని ప్రేమని నమ్మింది. అతనికోసం, ఆ ప్రేమ కోసం లోకాన్ని కూడా లెక్క చెయ్యలేదు. ఎవరన్నా చూస్తారేమోనన్న భయమన్నా లేకుండా అతనెక్కడికి రమ్మంటే అడ్డు చెప్పకుండా విచ్చలవిడిగా తిరిగింది. తల్లి తండ్రి ఏమంటారోనని కూడా ఆలోచించ లేదు. రోజుకో అబద్ధం ఆడి రోజూ ఆల స్యంగా ఇల్లు చేరేది. మొదట్లో పద్మావతి అడిగినపుడల్లా అబద్ధాలు చెప్పేది.

పద్మావతి కేకలువేస్తే ఏం ఫ్రెండ్స్‌తోనూ ఎక్కడికి వెళ్ళనేమిటి అని దబాయించేది. ఎవరన్నా తెలిసినవాళ్ళు కనిపించితే ఇంట్లో తల్లిదండ్రులకి చెప్తారేమోనన్న ఆలోచన కూడా రాలేదు. అంతలా అతని ప్రేమ మైకంలో మునిగిపోయింది. సురేష్‌-సురేష్ తప్ప మిగతా లోకం ఒకటుందన్న విషయం ఆ మూడు నెలల్లో ఆ మె కి గుర్తు రాలేదు. సినిమాలు, పబ్లిక్‌గార్డెను, టాంక్‌బండ్ ఇవన్నీ పాతపడిపోయి కొ త్త అనుభవం కావాలనిపించింది...అంతకు ముందు ఒకసారి పబ్లిక్‌గార్డెనులో చీకటి చాటున కూర్చుని మాట్లాడుతూండగా... సురేష్ యధాలాపంగా వేసినట్టు మాటల మధ్య ఆమె చెయ్యి మీద చెయ్యి వేశాడు.

అదే మొదటి పురుష స్పర్శ. అందులో తను ప్రేమించిన సురేష్ స్పర్శకి రూప తనువెల్లా పులకరించింది. ఆమెనించి ఏమి అభ్యంతరం రాకపోవడంతో ఆ వేసిన చేతిని లాక్కోకుండా మరికాస్త ముందుకు జరిపి ఆమె చెయ్యి చేతిలోకి తీసుకుని "రూపా !" అన్నాడు నెమ్మదిగా. ఆమె చెయ్యి తన చేతిలో బిగించి...రూప మాట్లాడలేని ఏదో స్థితిలో వుండిపో యింది. "కోపం వచ్చిందా రూపా..." మృదువుగా అడిగాడు సురేష్. తల అడ్డంగా మాత్రం తిప్పగల్గింది రూప.

"అమ్మయ్య...నీకు కోపం వసుందేమో, తిడ్తావేమో ననుకున్నాను. రూపా! నిన్ను చూస్తుంటే...నిన్నలా చూస్తూ ఊరికే వుండాలంటే ఎంత కష్టంగా వుందో తెలుసా? అసలు నీవు ఎందుకు ఈ టైపు ఇన్‌స్టిట్యూట్‌కి వచ్చావు ? అసలు నీవు ఇంత అందంగా ఎందుకున్నావు రూపా ?" అన్నాడు ఏదో పడరాని యాతన పడుతున్నట్టు. రూప ఆ మాట లకి కరిగిపోయింది. తనమీద అతనికి కలిగిన ప్రేమకి మురిసిపోయింది. "రాక పోతే నీవెలా కన్పించేవాడివి సురేష్. మనిద్దరం ఎలా దగ్గిరయేవాళ్ళం..."

"దగ్గిరెక్కడ అయ్యాం. దగ్గిరెక్కడ అవనిచ్చావు. చూడు మనమధ్య ఎంత దూరం వుందో"...గడుసుగా తమమధ్య దూరం చేతితో కొల్చి అన్నాడు. "ఇన్నా ళ్ళకి చెయ్యి పట్టుకోనిచ్చావు"అని కూడా చేర్చాడు.

"ఏయ్...నేరం నామీదకి తోసావా ? నిన్ను గిరిగీసి నిల్చోమన్నానా?" సురేష్ మొహం విప్పారింది. "ఊజిట్ వాటెఫూల్ ఐయామ్! చూశావా ఇన్నాళ్ళు ఎలా వృధా చేశానో" అంటూ రూప ఇచ్చిన ప్రోత్సా హంతో అతని మనసు ఉరకలు వేసింది. "ఇంత అందాన్ని పక్కనుంచుకుని ఎన్ని రోజులు కాలయాపం చేశాను. పశ్చాత్తాప పడుతున్నట్టు అంటూ ఆమె చెయ్యి అందుకుని "రూపా ఇంకా ఫూల్‌లా ప్రవర్తించను"అంటూ ఆమె దగ్గరికి జరిగి భుజం చుట్టూ చెయ్యివేసి. "మై రూపా !

మై లవ్! మై డార్లింగ్...ఐ లవ్ యూ" అంటూ ఆమె పెదాలు అందుకున్నాడు. రూపకి ప్రపంచం అంతా గిర్రున తిరిగి చీకటయినట్లయి వివశురాలై పోయింది ఒక్క క్షణం. తరువాత ఆవేశంగా రెండు చేతులు అతని మెడచుట్టూ వేసి గట్టిగా బిగించింది. "సురేష్..." అంటూ గొణిగింది. సురేష్‌కి అదే మొదటి అనుభవం కాబోలు సన్నగా వణికాడు. "రూపా, ముద్దు ఇంత తియ్యగా వుంటుందని తెలిస్తే నీవు చెంపదెబ్బ కొట్టినా ముందు రోజే పెట్టుకునేవాడిని. రెండు నెలల్లో ఎన్ని కిస్‌లు... రోజుకొకటి చూసినా అరవై మిస్సయ్యేవాడిని గాను చచ్చినా" అన్నాడు ఆమె మొహం అంతా పెదాలతో అద్దుతూ. "సురేష్... సురేష్" ఆపై ఇంకేమి చెప్పలేకపోయింది ఆ క్షణాలలో.

అలా అవకాశం వచ్చినపుడల్లా ఏకాంతం కోసం వెతుక్కొని ఏ గార్డెన్స్ లోనో, సినిమా హాలులోనో అవకాశం వున్నంత మేరకు సురేష్ ఆ అవకాశాన్ని వృథా పోనిచ్చేవాడు కాడు. అందుకు రూప ప్రోత్సాహమూ తక్కువ లేదు. అలా ఒక నెల గడిచాక ఆ చిన్న చిన్న అనుభవాలు, అనుభూతులతో సురేష్ తృప్తి పడలేకపోయాడు. కాస్త రుచి చూసి పూర్తిగా తినకుండా వదలడం ఎవరికన్నా కష్టమే. స్త్రీతో అనుభవం అసంపూర్తిగా విడిచిపెట్టటం ఏపురుషుడికీ ఇష్టం వుండదు. రూప అతన్ని దూరంగా హద్దులో వుంచితే ధైర్యం చెయ్యడానికి జంకేవాడేమో గాని, రూప వైపునించి అభ్యంతరం ఏమీ లేకపోవడంతో తను వ్రుట్టి ఫూల్‌లా ఇన్నాళ్లు అందిన అవకాశాన్ని వృథా పోనిచ్చేస్తున్నానన్న భావం కల్గింది సురేష్‌కి. ఇంత ముందుకు వెళ్ళినవాడు మరికాస్త ముందుకు వెళ్ళడానికి భయం ఎందుకు? రూప అంతగా వద్దంటే అప్పుడే చూడవచ్చు. మగాడు తను ముందడుగు వేయాలి గాని రూప ఎలా వేస్తుంది అని ఆలోచించి ఓరోజు "రూపా! రేపు నీకో సర్‌ప్రైజ్" అన్నాడు ఊరిస్తున్నట్టు. "ఏమిటి?" అంది కుతూహలంగా.

"ఊహు...ఇప్పుడు నీకేమీ చెప్పను. రేపు సాయంత్రం సరిగ్గా ఆరు గంటలకి హోటల్ 'ద్వారకా' దగ్గరకు రావాలి నీవు" అన్నాడు. "ఏమిటి పార్టీ ఇస్తావా, రేపు నీ బర్‌డేనా? ప్లీజ్ సురేష్! చెప్పు సస్పెన్సులో పెట్టి చంపకు" అంది బతిమాలుతూ. రూప ఎంత ప్రాధేయపడినా ఊరించాడు తప్ప చెప్పలేదు. ఆఖరికి మర్నాడు ఆరుగంటలకి వచ్చాక చెపుతానని తప్పించుకున్నాడు. ఆ రాత్రంతా ఏమయి వుంటుందా అని ఊహాగానాలు చేసింది రూప. ఆఖరికి సురేష్ బర్‌డే అయివుంటుంది పార్టీ ఇస్తాడు అనుకుంది.

మర్నాడు హోటలు కెళ్ళాలని మరికాస్త శ్రద్ధగా అలంకరించుకుని, మరింత మంచి చీర కట్టుకుని ఇంట్లో-ఫ్రెండు బర్‌డేపార్టీకనుక కాస్త ఆలస్యంఅవుతుంది రావడం అని చెప్పి బయలుదేరింది. హోటలు బయట సురేష్ ఎదురు చూస్తూ నిల్చున్నాడు. "ఇప్పుడు చెప్పు ఏమిటి సంగతి?" అంది ఆరాటంగా రూప. "అరే అంత గాభరా ఎందుకు? లోపలికి రా తెలుస్తుంది" అంటూ ఆమెని వెంటబెట్టుకుని రెండో అంతస్థులో ఒక రూము దగ్గరికి తీసికెళ్ళాడు. రూము తాళం తీస్తూంటే రూపకి కాస్త అనుమానం వచ్చింది. తాళం తీసి రూప లోపలికి రాగానే ఒక్క ఉదుటున రూపని గట్టిగా కౌగలించుకుని గుండెలకి హత్తుకుని ఆవే

శంగా నలిపివేస్తూ "ఇందుకు రమ్మన్నాను అర్థమైందా డార్లింగ్" అన్నాడు వణుకుతున్న గొంతుతో. రూప అతని కౌగలిలో ఉక్కిరిబిక్కిరి అయింది ఒక్క క్షణం.

అతని ఆవేశం చూడగానే మొదటిసారిగా రూప భయపడింది. ఏదో తెలియని భయంతో అమె మొహం పాలిపోయింది. అతని కౌగిలినించి విడిపించుకోడానికి ప్రయత్నిస్తూ "వదులు సురేష్! ముందు వదులు. ఇందుకా తీసుకొచ్చావు ఇలా అంటే రాకపోదును. వుండు సురేష్ ప్లీజ్ నాకు భయంగా ఉంది. నన్ను వదులు" అంది దీనంగా. ఆమె పరిస్థితి ఏమిటో ఆమెకే తెలియదు. సురేష్ కౌగిలిలో కరిగిపోవాలనీ, అతని సన్నిధిలో మైమరచిపోవాలనీ వుంది. ఒకపక్క ఏదో భయం, ఏదో తప్పు చేసున్నానన్న భావం, ఎవరికన్నా తెలిస్తే, ఏదన్నా అయితే, అమ్మో అమ్మ, నాన్న చంపేస్తారు. ఈ భయాలు ఆమె వివేకాన్ని తట్టిలేపాయి.

"రూపా డార్లింగ్!నీకోసం తపించిపోతున్నాను ఇన్నాళ్ళూ. ఈ అవకాశం కోసం ఎంతలా వెయిట్ చేశానో తెలుసా?"తమకంగా చూస్తూ ఆమె పెదాలు అందుకున్నాడు. నిగ్రహించుకోడం రూప వశం కాలేకపోయింది. అతని భుజంమీద తల వాల్చి కంపిస్తున్న గొంతుతో "వద్దు సురేష్! పెళ్ళవకుండా ఇది వద్దు సురేష్! ఇన్నాళ్ళు నిన్నెప్పుడైనావద్దన్నానా...ఇది వద్దుసురేష్. మా అమ్మ నాన్నకి తెలిస్తే చంపేస్తారు, పెళ్ళవకుండా యిది వద్దు" అంది అతని కౌగిలినించి తప్పించుకుంటూ.

సురేష్ మొహం ఎర్రబడింది. అతని ఉత్సాహం చప్పున చల్లారిపోయింది. డిసపాయింట్ మెంట్ తో అతనికి కోపం వచ్చింది. జేబులో డబ్బులేకపోతే ఒక ఫ్రెండు దగ్గిర అప్పుతెచ్చి ఒక గంట కోసం! ముప్ఫై నలభై ఖర్చుపెట్టడానికి సిద్ధపడి ఆశగా ఎదురుచూసింది అనుభవంలోకి రాకుండా రూప వారించడంతో సురేష్ మొహం గంటుపెట్టుకున్నాడు.

''ఇంతేనన్నమాట నామీద ప్రేమ. నీకు నిజంగా నామీద ప్రేమ వుంటే ఎందుకు వద్దంటావు?'' అన్నాడు కినుకుగా. రూప చప్పున అతని గుండెలమీద తల ఆన్చి అతని మెడచుట్టూ చేతులు బిగించి... ''సురేష్...సురేష్! ఐలవ్‌యూ, సురేష్! అది నీకు తెలియదా...అని..ఇది...వద్దు.. ఏదన్నా అయితే...'' అంది భయం భయంగా...సురేష్‌లో చల్లారిన ఆవేశం తిరిగి రాజుకుంది. "యూ సిల్లీ! అంతేనా నీ భయం. నాకా మాత్రం తెలీదా. అజాగ్రత్తలో నేను రాను." "సురేష్! అదికాదు సురేష్! పెళ్లయ్యేవరకు అదంతా వద్దు..." భయంగా అతనికి కోపం వస్తుందేమోనన్నట్టు నెమ్మదిగా అంది.

"డోన్ట్‌టాక్ ట్రాష్.. పెళ్ళి.పవిత్రత.. శీలం ... అమ్మమ్మ కబుర్లు చెప్పకు. నీవింకా ఏదో డేరింగ్ టైప్ అనుకున్నాను. ఇంతేనా నీ ధైర్యం? ప్రేమించవచ్చు. కిస్ చెయ్యొచ్చు. కలిసి తిరగచ్చు. దీనికేనా తప్పు...అప్పుడులేని తప్పు యిప్పుడొచ్చిందా. పవిత్రత అవన్నీ చేసినపుడు పోలేదా. ప్రెగ్నెన్సీ వస్తుందని ఆడదానికి శీలం, పవిత్రత వుండాలని మనవాళ్ళు యీ నీతి సూత్రాలన్నీ తయారుచేసి ఆడదాన్ని బంధించారు- అవన్నీ నీవూ నమ్ముతావా! ఇదంతా అంత యిష్టంలేనిదానివి యింట్లో కూచుని చక్కగా అమ్మ నాన్న తెచ్చినవాడిని

పెళ్ళాడవలసింది..." సురేష్‌కి కోపం వచ్చిందని రూపకి అర్థం అయింది.

సురేష్‌ని ఏ పరిస్థితిలోనూ దూరం చేసుకోడం ఆమెకిష్టంలేదు. సురేష్‌కి, అతని ప్రేమకి దూరమయి తను బతకలేదు రూప మొహంలో భావాలు చదువుతూ, ఆమె కాస మెత్తపడుతూందని గుర్తించాడు సురేష్. తరువాత ఒక అరగంట.. ప్రేమగురించి, సెక్స్‌గురించి లెక్చరిచ్చాడు. సెక్స్‌లేని ప్రేమ నిలవదన్నాడు. సెక్స్‌కి ప్రేమకీ అవినాభావ సంబంధం వుందన్నాడు. మగవాడి వీక్‌నెస్ సెక్స్ కనక ఆ విషయంలో మగాడ్ని తృప్తిపరిచి బానిస చేసుకోవాలి ఆడది అన్నాడు.

సెక్స్‌వాంఛ తప్పు, పాపం అవన్నీ పాత భావాలన్నాడు. ఆకలి ఎలాగో సెక్స్ కూడా ఒక ఆకలే. అది తీర్చుకోవాలనుకోడం సహజం. ఏదో పెళ్ళి కాకుండా పిల్లలుపుడితే ఆ పిల్లలకి సంఘంలో స్థానం వుండదని యిన్ని కట్టుబాట్లు పెట్టారు. ఇప్పుడాభయం లేకుండా. పది పైసలు పారేస్తే వచ్చే ఫామిలీ ప్లానింగ్ సాధనాలు వుండగా భయపడడంలో అర్థం లేదన్నాడు. విదేశాలలో ఎంచక్కగా ఎలా లైఫ్ ఎన్‌జాయ్ చేస్తారో చెప్పాడు.

పెళ్ళికి ముందే చక్కగా అన్నీ ఎంజాయ్ చేస్తారు. పెళ్ళి కేవలం పిల్లలకోసం, కుటుంబంకోసం మాత్రమే నన్నాడు. ఎవరికీ ఎలా తెలుస్తుంది అని ధైర్యం చెప్పాడు. నీకేమీ జరగకుండా చూసేపూచి నాదన్నాడు. అంతసేపు రూపని దగ్గిరకి లాక్కుంటు, ఆమె మొహాన్ని రెండు చేతులలో బిగించి పెదాలతో అద్దుతూ, ఆమె జుత్తు సవరిస్తూ...ఆమె చెంపలు నిమురుతూ ... మృదువుగా ఆమెకి నచ్చజెప్తూ ఆమెని వశపరుచుకుంటూ, నెమ్మది నెమ్మదిగా ఆక్రమించుకోడం ఆరంభించాడు. రూప మైమరుపు, మత్తులోపడి అతన్ని వారించే శక్తి కోల్పోయి బలహీనంగా అతని చేతుల్లో యిమిడి పోయింది. రూపకి ఆ అనుభవం చవిచూడాలని వుందిగాని ఏం అవుతుందో నన్న భయం సురేష్ పోగొట్టి అభయహస్తం యివ్వగానే యింక అడ్డు చెప్పి సురేష్‌కి కోపం తెప్పించలేకపోయింది. మరుక్షణంలో అంతామరిచిపోయిందిరూప.





ఇప్పుడు చెప్పు. ఎవరా కుర్రాడు. చదువుకున్నాడా, ఉద్యోగమా...వాళ్ళు మనవాళ్ళేనా?..." భోజనాలు అయ్యాక రూపని పిలిచి డాబా ఎక్కింది పద్మావతి. డాబామీద చలిగావున్నా అక్కడయితే ఏకాంతంలో కూతుర్ని సావకాశంగా అన్ని విషయాలు అడగచ్చని అక్కడికి పిల్చుకు వెళ్ళింది. రూపకి మనసులో జంకుగా వుంది. ఇన్నాళ్ళు ఇలాంటి స్థితిని ఎదుర్కోవాల్సి వుంటుంది ఏదో రోజు అన్న ఆలోచనే ఆమెకి రాలేదు. తల్లి ఏం అడగబోతోందో, వాటికి జవాబులు ఎలా చెప్పాలో కూడా ఆలోచించే వ్యవధిలేకపోయిందామెకి. భోజనం చేస్తున్నంతసేపూ అదే విషయం ఆలోచించింది. తనకు తాను ధైర్యం చెప్పుకుంది. ఏం చేస్తారేం, తనకి నచ్చినవాడిని తను చేసుకుంటుంది

అని ధైర్యం కూడదీసుకుంది. "అతని పేరు సురేష్. కిందటేడు బి. కాం. పాసయ్యాడు ఐ. ఎ. ఎస్. పరీక్షకి ప్రిపేరు అవుతున్నాడు. బ్యాంకు పరీక్షలకి కూడా కట్టాడట. కాలేజిలో నాకో ఏడాది సీనియర్..."

"అంటే అప్పటినించి అతను నీకు ఫ్రెండా ?"

"కాదు. అసలు అప్పుడు ఏదో కాలేజిలో అప్పుడప్పుడు చూశాను కాని పరిచయం లేదు. టైపు ఇన్‌స్టిట్యూట్‌లోనే కల్సు కున్నాం..."

"అంటే ఈమూడు నాలుగు నెలల్లోనే యింత స్నేహం అయిందన్నమాట. అతని తండ్రేం చేస్తాడు? మనవాళ్ళేనా?" పద్మావతి ఆరాతీసింది. కులాల ప్రసక్తి రూప ఎత్తలేదు. అతని తండ్రి లాయరు అన్నమాట మాత్రం ఏదో మాటల్లో వింది. బ్రాహ్మలా ? అబ్రాహ్మలా... యిలాంటి కులాల ప్రసక్తి తీసుకురావడం ఆధునికతకి భంగం అని ఈతరం వాళ్ళ నమ్మకం. నిజంగా రూపకి ఆ విషయం తెలియదు. మనిషిని చూసి కులం గుర్తించడం కష్టం ఈ రోజుల్లో. సాధారణంగా మాటల్లో యాసని బట్టి కొంచెం పోల్చవచ్చు. సురేష్ మాటల్లో అదేం గుర్తించ లేదు రూప. నిజంగా అతని కులం గురించి అడగాలని కూడా అంతవరకు ఆమెకి తట్టలేదు.

"అదేమిటే ఏ కులం వాడో తెలుసుకో కుండానే ఎలా ప్రేమలో పడ్డావే... రేపు పెళ్ళి ఎలా చేసుకుందామను కుంటు న్నావు.... బ్రాహ్మడు కాకపోతే మీ నాన్న ఒప్పుకుంటారనుకుంటున్నావా ? ఒసేయ్ ! ఎన్ని పెద్ద కబుర్లు చెప్పినా పెళ్ళిదగ్గరకు వచ్చేసరికి అందరికీ కులాల మతాల పట్టింపులు వాటంతట అవే వస్తాయి. మనం ఇంకా అంత ప్రగతి సాధించలేదు. కాగితాలలో తప్ప కార్యా చరణలో లేదు..."

"అబ్బ... ప్రేమకి కులాలు అడ్డు రావమ్మా...ముందన్నీ అడిగి ప్రేమించు కుంటారేమిటి ?" రూప విసుగ్గా అంది. "పెద్ద కబుర్లు చెప్పకుండా ముందు అతని కులం గురించి తెల్సుకో ... ఇంతకీ అతనితో పెళ్ళి విషయం ఎత్తేవా ? ... ఏమన్నాడు?" ఆరాటంగా అడిగింది పద్మా వతి. రూప కొంచెం తడబడింది. "ఇంకా అడగలేదమ్మా...ముందురోజే ఎవరన్నా అడుగుతారేమిటి?... అడుగుతాను..." అంది గొణుగుతూ.

"ఒసే నీకు బుర్ర వుందో లేదో నా కర్థం కావడం లేదు. మూడు నాలుగు నెలల బట్టి అతనితో తిరుగుతున్నావు. ఇప్పటి వరకు పెళ్ళి విషయం అడగలే దంటున్నావు. రేపు అతనికా ఉద్దేశం లేదంటే ఏం చేస్తావు? ఇప్పటికే నలుగురి నోళ్ళల్లో నానావు. రేపు ఇదంతా అందరికీ తెల్సి ఎవడూ చేసుకోకపోతే ఏంచేస్తావు? మీ నాన్నగారి పరువు ప్రతిష్ఠ సంగతి అలావుంచి నీ బతుకేం అవుతుందో ఆలో చించావా. నీకింత బుద్ధిలేకుండా పోయిం దేం? ఎందుకీ చదువు ఈ మాత్రం లోక జ్ఞానం లేకపోయాక" పద్మావతి తీక్షణంగా అంది. తల్లి మాటలు వింటుంటే రూపకి కొద్దిగా భయం కల్గింది. నిజమే, తను వెర్రిగా సురేష్‌ని ప్రేమించింది... కాని పెళ్ళి గురించి ఆలోచించలేదు. ఇంతవరకూ ఆ ప్రసక్తే తీసుకురాలేదు...తను అతిగా ప్రవర్తించి, చాలా దూరం వెళ్ళింది-

అన్న భావం ఆ క్షణంలోనే కల్గింది. జవాబు ఇవ్వకుండా తల దించుకుంది. కూతురి మొహం చూసేసరికి పద్మావతికి ఏదో అనుమానం కల్గింది. "పుట్టి షికార్లూ సినిమాలేనా ఇంకా ఏమన్నావుందా... నిజం చెప్పు" అంది నిలేస్తూ.

"అబ్బ ఏమిటమ్మా....నాకామాత్రం బుద్ధి లేదనుకున్నావేమిటి?" అంది దబా యింపుగా. పట్టి షికార్లే కాదు,...కనీసం ఆరుసార్లన్నా అతనితో హోటలులో గడిపినట్లు తల్లితండ్రికి తెలిస్తే ఏమవు తుందో ఆలోచిస్తుంటే రూప తను తొందర పడిందేమోనన్న భావం కల్గింది. పద్మావతి ఆ జవాబుతో కాస్త భారం దిగినట్లు సంతృప్తి పడింది, ఈ కాలం పిల్లలు చదువుకున్న వాళ్లు, అంత త్వరగా ఆ మాయ మాటలకి బోల్తాపడరులే. ఏదో టీనేజ్ వయసు ఈ ఆకర్షణలు, ప్రేమలు అదంతా ఏదో ఎడ్వంచర్ అనుకుంటారు గాని అంత సాహసం చెయ్యదు రూప అని నమ్మింది.

"రూపా! అయిందేదో అయింది. ఆ అబ్బాయి ఇంకా చదువుతున్నాడు. ఇంకా చిన్నవాడే... ఉద్యోగం సద్యోగం లేకుండా ఇప్పటినించి పెళ్ళిచేసుకుంటాడా? అసలు అతని అభిప్రాయం ఏమిటో అడుగు. పెళ్ళి ప్రసక్తి తీసుకురా... అతనితో నీవు ముందు మాట్లాడాక తరు వాత సంగతి ఆలోచిద్దాం. తరువాత మీ నాన్న వాళ్ళ వాళ్ళని కలుస్తారు...ఇంతకీ అతని కులం, కుటుంబం వివరాలు, అతని తండ్రి ఆస్తిపాస్తులు, ఆ అబ్బాయి ఉద్దేశం అన్నీ అడుగు రేపు వివరంగా. నీకు మీ నాన్న సంగతి తెలుసు. ఈ ప్రేమలు, తిరుగుడు అవన్నీ ఆయన ఒప్పుకోరు. ఆ అబ్బాయికాని కాదు అన్నాడంటే...నాకు భయంగా వుంది..." పద్మావతి ఊహించ డాన్నికే భయపడింది. "ఆ... లేదూ అంటాడు. ఎందుకు చేసుకోడు ఇన్నాళ్ళు తిరిగి చేసుకోనంటే ఊరుకుంటానేమిటి?" దబాయింపుగా అంది రూప.

"ఊరుకోక ఏం చేస్తావేం?" కూతుర్ని పరీక్షగా చూస్తూ అంది పద్మావతి.

"ఏం చేస్తానో చూద్దువుగాని. నేనేం అంత వెర్రిదాన్ని కాదు. ఇదివరకులా చదువు సంధ్యలేని అమాయకురాలిని కాదు" ధీమాగా అంది.

"హుఁ...అనుకుంటున్నావు. ఆడది ఎప్పుడూ మోసగింప బడడం అన్నది యుగయుగాలనించి వస్తున్నది. ఎంత చదువుకున్నా ఎంత అనుభవం వున్నా మగాడిదే పైచెయ్యి. శారీరకంగా, మానసి కంగా బలవంతులు వాళ్ళు. ప్రకృతే ఆ వరం ఇచ్చింది వాళ్ళకి. మనం ఈనాడు మార్చలేం. చదువుకున్నందుకు, లోక జ్ఞానం అలవరచుకున్నందుకు మనం వాళ్ళచేత వంచించ బడకుండా చూసు కోడంలో తెలివితేటలు చూపాలిగాని, ఓ సారి వాళ్ళ వలలో పడ్డాక వాళ్లు మోస గించినా ఎంత అన్యాయానికి, అక్రమానికి వడిగట్టినా మనం చెయ్యగల్గింది ఏమీ వుండదన్నది తెల్సుకో. రూపా! ఇదంతా నాకేదో భయంగా వుంది. రేపు నీవు ఆ అబ్బాయిని కల్సుకుని అన్ని విషయాలు మాట్లాడే వరకు నా మనసు మనసులో వుండదు. మీ నాన్న సంగతి తల్చుకుంటే నాకు భయం వేస్తూంది. ఒసేయ్.. ఇన్ని సార్లు అడిగాను. కన్నతల్లిని. నా దగ్గిర ఇలా అబద్ధాలాడి, మోసం చేస్తావా? రూపా! కూతురు ఏదో తప్పు చేసిందన్నది వీళ్ళనోట వాళ్ళనోట వినడం ఎంత బాధ కరమో నీకూ బిడ్డలు పుట్టాకగాని తెలి



యదు. నీవేం చేసేది.. మంచో.. చెడో.. దాచకుండా తల్లితండ్రుల దగ్గిర దాపరికం లేకుండా చెప్ప గలిగిన పిల్లలు మంచి పెంపకానికి గుర్తులు. నీవు సినిమాకెళ్ళ, షికారుకెళ్ళు, ఫ్రెండ్సుతో తిరుగు... ఏం చేసినా ధైర్యంగా ఫలాన చోటికి వెళ్ళానని చెప్పగల్గిన ఆత్మస్థైర్యం నీకు నేనుఇవ్వలేక పోయానంటే బహుశ నా పెంపకంలో లోపమేమో?రూపా! నీ కోసం మీనాన్నతో ఎన్ని విషయాలలో దెబ్బలాడలేదు—బెల్ బాటమ్స్ వేసుకుంటానంటే, జుత్తు కత్తిరించుకుంటానంటే,పార్టీలకు వెడతానంటే, టైపుకి వెడతానంటే... ఏది వద్దన్నాను.

అన్నింటికీ మీ నాన్నతో వాదించి ఒప్పించాను. ఇదీ నీవు నాకు అలా ముందు ఎందుకు చెప్పలేదు? నీ కంతగా అతను నచ్చితే మీ నాన్నని ఒప్పించి పెళ్ళి అయ్యేట్టు చూసేదాన్ని గదా ... ఇలా నలుగురి నోళ్ళల్లో పడేకంటే, తల్లిదండ్రుల పరువుతో ఆడుకునేకంటే తల్లిదండ్రులతో నిజాయితీగా వున్న విషయం చెప్పడం మంచిదని తోచలేదా...నీ మేలు కోరేవాళ్ళు మా కంటే ఎవరన్నా వుంటారా?" పద్మావతి ఆవేదనగా అంది. తల్లి మాటలు వింటూంటే రూప గిల్టీగా ఫీలయింది. తల్లి ఇచ్చిన చనువు, స్వాతంత్ర్యాన్ని దుర్వినియోగ పరిచానేమోనన్న భావంతో బాధ పడుతూ తల దించుకుంది. పద్మావతి నిట్టూర్చి లేచి నుంచుని "సరే... ముందు రేపు అతనితో మాట్లాడాక మిగతాది ఆలోచిద్దాం ... అన్నీ అడుగు పద కిందకి" అంటూ కిందకిదారి తీసింది.

* * *

"సురేష్...మా అమ్మ, నాన్నకి మన సంగతి తెలిసిపోయింది. నిన్న ఇంటికి వెళ్ళగానే మా నాన్న గారు నన్ను నిలదీసి అడిగేశారు. మనని చూసిన ఆయన ఫ్రెండు ఎవరో నాన్నతో చెప్పారట" మర్నాడు లైపుకు వెళ్ళగానే సురేష్‌ని చూడగానే రూప దగ్గిర కెళ్ళి ఆందోళనగా చెప్పేసింది.

సురేష్ మొహం కళ తప్పింది–"ఈ జిట్ ఎలా...ఏం అన్నారు?" ఆదుర్దాగా అడిగాడు. "ఇంటి కెళ్ళేటప్పుడు చెప్తా అంతా టాంక్‌బండ్‌కి వెడదాం ... చాలా మాట్లాడాలి" అంది రూప. తర్వాత గంటా సురేష్ రోజులా లేకుండా సీరియస్‌గా, అన్య మనస్కంగా, మొహం గంటు పెట్టుకుని లైపు కొట్టాడు. లైపవగానే ఇద్దరూ టాంక్‌బండ్‌కి నడిచివెళ్ళారు.

ఖాళీ బెంచీ ఒకటి చూసుకొని కూర్చున్నారు. రోజూ ఎన్నెన్నో కబుర్లు చెప్పుకునే ఇద్దరూ అంతసేపూ మౌనంగా నడిచి వచ్చారు.

"సురేష్...ఏమిటలా వున్నావు ... నిన్న ఇంట్లో పెద్ద గొడవయింది"

"ఏం జరిగింది? అంతా సరిగా చెప్పు" అన్నాడు సురేష్. రూప జరిగిందంతా ఏకరువు పెట్టి ఆందోళనగా చూసింది. "మా అమ్మ, నాన్న ఇంత జరిగాక వూరుకోరు. మనం పెళ్ళి చేసుకోవాలి సురేష్. మీ నాన్నగారి పేరు, వివరాలు అన్నీ అడిగేరమ్మన్నారు. పెళ్ళి విషయం మీ నాన్నగారితో మాట్లాడుతారట నాన్న గారు." "ఆర్ యూ క్రేజీ, రూపా. పెళ్ళేమిటి నాకు ఇప్పటినించి. చదువైనా అవలేదు. ఓ ఉద్యోగం లేదు, సంపాదనలేదు. ఐ యామ్ ఓన్లీ ట్వెంటీ టూ. ఇప్పటి నుంచి పెళ్ళేమిటి నాకు...చదువు కావాలి, ఉద్యోగం దొరకాలి, లైఫ్‌లో సెటిల్ అవాలి, నాలుగు డబ్బులు వెనకేసుకోవాలి ... అప్పుడూ పెళ్ళి ప్రసక్తి. ఇప్పుడు పెళ్ళి చేసుకుని ఏం పెట్టి పోషించాలి పెళ్ళాన్ని. ఆర్ యూ మేడ్. పెళ్ళిఇంకో ఐదేళ్ళ తర్వాత మాట. ఇంకా మా అన్నయ్య వున్నాడు. వాడికే పెళ్ళవలేదు, నాకు పెళ్ళేమిటి?"

రూప ఆందోళనగా, భయంగా సురేష్ వంక చూసింది. "మరి ఎలా సురేష్...అయిదేళ్ళంటె నాన్న వూరుకుంటారా? వాళ్ళకేం చెప్పడం? మరో అయిదేళ్ళంటే నాకు పాతికేళ్ళు వచ్చే వరకు పెళ్ళిచేయకుండా వుంటారా? నాకు అప్పుడే సంబంధాలు చూస్తున్నారు మా

వాళ్లు. ఐదేళ్ళు వెయిట్ చెయ్యరు మా వాళ్ళు!"

"అయితే చేసేసుకో ఎవరినన్నా, మంచి సంబంధం వస్తే వదలకుండా చేసుకోవడం మంచిది, నా కోసం అన్నాళ్లు వెయిట్ చేయడం మంచిది కాదు" కూల్‌గా అన్నాడు.

రూప తెల్లబోతూ చూసింది. "సురేష్!" అంది ఆశ్చర్యంగా.

"అవును రూపా! ఐదారేళ్ళు వెయిట్ చెయ్యమని నేను మాత్రం ఎలాఅంటాను. మీ వాళ్ళ ఆదుర్దా మీ వాళ్ళకుంటుంది. ఇంతకీ నేనీ ఐ.ఏ.ఎస్. పరీక్ష పాసవుతానో లేదో, ఆ బ్యాంక్ పరీక్షన్నా పాసవుతానో లేదో. ఏం ఉద్యోగం వస్తుందో, ఎన్నాళ్ళకొస్తుందో, ఐదేళ్ళ తర్వాతన్నా పెళ్ళి చేసుకునే పొజిషన్‌లో వుంటానో లేదో! నా ఫ్యూచర్ ఏమిటో నాకే తెలియదు నేనేం చెప్పగలనిప్పుడు"

"సురేష్ నీ కోసం ఐదేళ్ళు కాదు, పదేళ్ళన్నా వెయిట్ చేస్తాను. అంతేగాని మరొకర్ని ఎలా పెళ్లి చేసుకోగలను. ఆ మాట అసలు ఎలా అనగలిగావు - ఇదేనా నా ప్రేమని అర్థం చేసుకున్నది."

ఆవేశంగా ఏదో అనబోయింది రూప. సురేష్ విసుగ్గా వారిస్తూ "రూపా! థింక్ ప్రాక్టికల్లీ. డోంటాక్ లైక్ ఎ ఫూల్. ప్రేమ-పెళ్ళి రెండూ వేరు వేరు. ప్రేమ అన్నది ఒక థ్రిల్లింగ్. ఎమోషనల్ ఎక్స్‌పీరియన్స్. పెళ్ళి సోషల్ సెక్యూరిటీకి, పిల్లలికి, ఫేమిలీ లైఫ్-రెండింటికీ ముడిపెట్టకు. అఫ్‌కోర్స్! ప్రేమించి పెళ్లిచేసుకోగలిగితే మంచి మాటే. మనకా అవకాశం లేనపుడు ఏం చేస్తాం. నేను ఉద్యోగస్తుడినైతే మనం పెళ్ళి చేసుకోగలిగే వాళ్ళం. ఇప్పుడు మనకా వీలు లేదు కనక-ఈ అనుభవం ఒక తియ్యని జ్ఞాపకంగా మిగుల్చుకుని లైఫ్‌తో ఎడ్జస్ట్ అవాలి. లైఫ్ ఇట్ సెల్ఫ్ ఈజ్ ఏన్ ఎడ్జస్ట్‌మెంట్. మనం కాలేజీలో సరదాగా చదువుకుంటూ, ఫ్రెండ్స్‌తో సినిమాలకి, షికార్లకి, పిక్నిక్‌లకి, హోటళ్ళకి...ఇష్టం వచ్చినవి తింటూ ఎంజాయ్ చెయ్యలేదూ! ఇదీ జస్ట్ ఫర్ ఫన్ అనుకుని ఓ మూడు నాలుగు నెలలు సరదాగా ఎంజాయ్ చెయ్యగలిగినందుకు ఆనందించి ఈ అనుభవానికి గుడ్‌బై చెప్పేసి లైఫ్‌లో సెటిల్ అయిపోవాలి. అదీ ప్రాక్టికల్ థింకింగ్ అంటే" సురేష్ చాలా అనుభవశాలిలా, ఆరిందాలా వేదమర్పి బోధపరుస్తూంటే రూప వింటూండి పోయింది.

ఆ మాటలకి అర్థం కాసేపటికి బోధపడి వెర్రిదానిలా సురేష్‌ని చూస్తూ వుండిపోయింది. "సురేష్! ఏమిటలా మాట్లాడుతున్నావు. నాకు భయం వేస్తూంది. నిజంగా పెళ్ళిచేసుకోవా నన్ను? ఇన్నాళ్ళూ నీతో తిరిగాను. అందరికీ తెల్సింది. ఇప్పుడు నీవు చేసుకోకపోతే మా నాన్న అమ్మ నన్ను చంపేస్తారు'' రూపకి భయంతో చెమటలు పట్టాయి. ఏడుపు ముంచుకు రాసాగింది. గొంతు రుద్ధమవుతుండగా వణుకుతున్న గొంతుతో అంది బేలగా చూస్తూ.

"రూపా! ఎందుకలా భయపడుతున్నావు. ఏం జరిగిందిప్పుడు. లోకంలో నేనొక్కడ్నే మగాడినా. నాకంటె మంచి అర్హతలున్నవాళ్ళు నీకు దొరుకుతారు. మీ అమ్మ నాన్నగార్లతో చెప్పు. నాకింక చదువు అవలేదు. ఉద్యోగంలేదు యిప్పటినించి చేసుకోనంటున్నాడు అని. దానికింత



భయం ఎందుకు ?" తేలిగ్గా అన్నాడు.

"సురేష్ నీకు తెలీదు మానాన్న సంగతి. ఆయన ఓల్డ్ ఫాషన్. ఇలా పెళ్ళికాకుండా అమ్మాయిలు తిరగడం అదీ నచ్చదు ఆయనకి. నిన్ననే అసలు అడిగేశారు, పెళ్ళి చేసుకుంటానన్నాడా అతను అని.''

"రూపా ! ఒక సంగతి చెప్పు. నిన్ను పెళ్ళిచేసుకుంటానని నే నెప్పుడన్నా ప్రామిస్ చేశానా?'' రూప తలదించుకుంది. తన తప్పు తెలిసి వచ్చింది. "లేదు, అదే నా పొరపాటు. నీ ప్రేమని నమ్మాను. మన ప్రేమ పెళ్ళివరకు వెడుతుందను కున్నాను" రూప ఆవేశంగా ఏదో అన బోయింది.

"కూల్ డౌన్ మై డియర్ ! పెళ్ళి చేసుకోవాలన్న షరతు నీవు పెట్టలేదు ఆ మాటన్నా అడగలేదు. నీవూ నాతో తిరగడానికిష్టం చూపావు. నీవు ఎంకరేజ్ చెయ్యకపోతే నేనెలా నీతో యింత చనువు తీసుకోగలిగేవాడిని. ఆడదానికి

యిష్టం లేకుండా యిండిఫరంట్‌గా వుంటే మగాడు ముందుకు వెళ్ళగలడా? నీవు సినిమాలకి, షికార్లకి, హోటళ్ళకి రాను అంటే బలవంతంగా తీసికెళ్ళగలిగేవాడినా నీవిష్టపడే వచ్చావు. నీకు యీ ప్రేమ, ఎక్స్‌పీరియన్స్ రుచి చూడాలనిపించింది. ఇప్పుడు నన్నొకడినే ఎందుకు బ్లేమ్ చేసావు. నీవు ముందు రోజే పెళ్ళి చేసుకుంటే తిరుగుతాను అన్న షరతు పెడితే నేను ఆరోజే చెప్పేవాడినేమో. పెళ్ళి చేసుకోడానికి నీకర్హతలు చాలవని కాదు, నీవు నచ్చకా కాదు, కాని ఇప్పట్లో నేను చేసుకోవడం కుదరదు. నాకాళ్ళ మీద నేను నిలబడగలగాలి. ఆతర్వాతే పెళ్ళి.

ఇప్పుడు చేసుకుని నిన్నేం చెయ్యమంటావు? మా నాన్న నన్నే కాక నిన్ను పోషిస్తారా. రేపు మనకి పిల్లలు పుడితే వాళ్ళనీ పోషిస్తారా? అసలెలా అడగడం, నీకిప్పుడు పెళ్ళికి తొందరొచ్చిందా అని మొహన్నే అడుగుతారు యింట్లో..."

"సురేష్! నీకోసం నేను ఐదేళ్ళు ఆగుతాను. ఇంట్లో సర్దిచెపుతాను. ఈలోగా నేనూ ఎమ్. ఎ. చదువుతాను. ఆ తర్వాత ఏదన్నా ఉద్యోగానికి ప్రయత్నించి ఉద్యోగం చేస్తూంటాను. నీకుద్యోగం రాగానే పెళ్ళి చేసుకుందాం. ఏమో ఐ. ఎ. ఎస్. అయితే ఉద్యోగం మళ్ళీ ఏడాదే వచ్చేస్తుంది. అది రాక పోయినా ఏదో ఉద్యోగం వచ్చేదాక నేను వెయిట్ చేస్తాను. మావాళ్ళని వప్పిస్తాను"

రూప ఆశగా అతన్ని చూస్తూ అంది. సురేష్ మొహంలో రంగులు మారాయి ఒక్క క్షణం ఆలోచనలో పడ్డాడు. ఏదో స్థిర నిశ్చయానికొచ్చి. "చూడు రూపా! టూ టెల్ యు ఫ్రాంక్‌లీ. ఉద్యోగం వచ్చినా ఐదేళ్ళలోపు పెళ్ళి మాట తలపెట్టను. నా సంపాదనతో హాయిగా ఫ్రీగా కొన్నాళ్ళయినా ఎంజాయ్ చెయ్యాలి నేను. పెళ్ళి, సంసారం యీ జంజాటంలో దిగే ముందు ఐ వాంట్ టు ఎంజాయ్ లైఫ్. ఆ తర్వాత ఐదేళ్ళంటే చాలా ఎక్కువ టైము. ఈలోపల ఎన్నైనా జరగచ్చు. నామనసు మారచ్చు, నీమనసు మారచ్చు. అపుడు నాకు నిన్ను చేసుకోవాలని లేకపోతే....ఎందుకి గొడవంతా? అన్నాళ్ళు ఒకరి కోసం వెయిట్ చెయ్యడం మంచిదికాదు. మీవాళ్ళు తెచ్చిన సంబంధం ఏదన్నా చేసుకోవడం మంచిదని నా ఉద్దేశం" నిష్కర్షగా అన్నాడు. రూప మొహం ఎర్రబడింది. తీక్షణంగా చూసింది. కోపం, ఆవేశం పట్టలేక పోయింది. "అంటే...నన్ను చేసుకోడం నీకిష్టం లేదన్నమాట. ఇన్నిమాటలెందుకు, ఈ డొంక తిరుగుడెందుకు? ఫ్రాంక్‌గా నీతో ఎంజాయ్ చెయ్యాలనుకున్నాను తప్ప పెళ్ళాడే ఉద్దేశం లేదని చెప్ప కూడదూ. సురేష్ ఛీ నీవింత నీచుడవని తెలియక గోతిలోకి దిగాను. నీ అంత నీచుడు, హీనుడు..."

"మైండ్ యువర్ లేంగ్వేజ్ మేడమ్" సురేష్ కర్కశంగా అన్నాడు. "నీకు ... నీకో మర్యాద ఇవ్వాలా ఇంత దగాకోరువని ఎన్నడూ అనుకోలేదు. ఇంత మోసగాడివని, ఇంత నీచుడివని తెలిస్తే..."రూప గుండెలు ఎగిసిపడ్డాయి.

"ఇప్పుడు తెల్సిందిగా. ఇంక దూరంగా వుండు" హేళనగా ఎత్తిపొడిచాడు.

"హుఁ అవును. ఇంక నీ మోజు తీరి

పోయింది. దూరంగానే వుంటావు యింక. నేనెంత పిచ్చిదాన్ని. నేనేగాదు, మా ఆడ పిల్లలు ఎంత అమాయకంగా మీ మగాళ్ళని నమ్ముతారు. ఎన్ని వందల మంది, వేలమంది యిలా మోసగించబడ్డా మళ్ళీ మళ్ళీ దీపంచుట్టూచేరి మాడిపోయే శలభాలం మేము." "ఓహ్. కవిత్వం బాగానే వచ్చే" నవ్వాడు వేళాకోళంగా.

"షటప్. సిగ్గులేదూ నవ్వేలా వస్తుంది మొహానికి. ఒక ఆడపిల్ల ఏడుస్తుంటే నవ్వడం సంస్కారం అనుకుంటున్నావా. చదువుకున్నావు గాబోలు. సంస్కారంలేని ఆ డిగ్రీలెందుకు..." రూప ఆవేశం పట్టలేక అరిచింది. నడిరోడ్డు అయింది కాని లేకపోతే చెంప ఛెళ్ళు మనిపించాలన్నంత ఆగ్రహం, కసి పుట్టింది ఆమెకి.

"మీ ఆడ పిల్లలకి చాతనయింది ఏడుపేగా... ఏం, నేను కాదంటే ఏడవడం ఎందుకు...చావ వుంటే, గోటూహెల్ అని మరోడ్ని పెళ్ళాడి చూపాలి...అదీ ధైర్యం అంటే."

"హుం ఈ దేశంలో మగాళ్ళందరూ నీ బ్రదర్సేగా. ఓ ఆడపిల్ల వీక్‌నెస్ అర్థం చేసుకుని వివాహం ఆడడానికి ముందుకొచ్చే చావ మీ మగాళ్ళకి వుంటే మేం యిలా ఎందుకేడుస్తాం. మీకు ఎన్నేనా వీక్‌నెస్‌లు వుండవచ్చు. కాని పొరపాటునైనా మాకు బలహీనతలుండ రాదు. ఇలాంటి మగ వెధవలున్న దేశంలో నన్ను పెళ్ళాడడానికి ఏ మగాడు ముందుకొస్తాడంటావు?" రూప తిరస్కారంగా చూస్తూ హేళనగా అంది.

"పోనీ పెళ్ళి కాకపోతే ఏడవాలా? హాయిగా ఉద్యోగం చేసుకుంటూ ఆకలేస్తే అన్నం తిన్నట్టు, చక్కగా నచ్చిన వాడితో ఎంజాయ్ చెయ్యచ్చు. అలా అయితే రోజుకో హోటల్లో తిన్నట్టు, ఇంటి భోజనం విసిగె తినట్టూ వుండదు."

"ఆహాహ్. ఏం ప్రోగ్రెసివ్ థాట్స్... రియల్లీ. అలాగే రేపు పొద్దుట నీ పెళ్ళాన్ని ఆమె యిష్టం వచ్చిన వాడి దగ్గరకి పంపిస్తూ వుండుగాని. సురేష్! నీతో మాట్లాడాలంటేనే అసహ్యం వేస్తూంది. ఈ వేళా కోళాలు మాని ఆఖరిసారిగా అడుగుతున్నాను. పెళ్ళి చేసుకుంటావా లేదా?" చాలా సీరియస్‌గా చూస్తూ అడిగింది.

"డోన్ట్ బీ క్రేజీ. ఇంకెన్ని సార్లు చెప్పాలి!"

"సురేష్! ఈ గేమ్ మీ మగాళ్ళకి అలవాటయిన ఆటే. ఇలా ప్రేమించడం, మోసగించ బడడమూ మా ఆడపిల్లలకి అలవాటే. ఇన్నాళ్ళూ ఒకే గేము ఆడారు. ఎప్పుడూ గెలుపు మీదే అయింది. ఈ సారి మాత్రం గెలుపు నీకు దక్కనివ్వను. ఇన్నాళ్ళూ తిరిగి, నన్ను వాడుకుని, కూల్‌గా పెళ్ళి చేసుకోను పో-అంటే ఏడుస్తూ ఏ నుయ్యో గొయ్యో చూసుకోవడమో, అమ్మా నాన్న తెచ్చిన వాడిని పెళ్ళాడడమో చేసేంత దద్దమ్మని కాను. ఎలా చేసుకోవో నేనూ చూసాను. అంతా నీ యిష్టమే కాదు" ఏదో చెయ్యాలి సురేష్‌కి బుద్ధి చెప్పాలన్న కసితో ఆవేశంగా అంది. సురేష్ మనసులో ఒక్క క్షణం బెదిరాడు.

"ఏం చేసావేం.?" రెట్టించాడు.

"నలుగురిలో నిలబెట్టి అంతా చెప్తాను. మీ యింటికెళ్ళి మీ నాన్నగారితో చెప్తాను."

"అపుడు పోయేది నీ పరువే" నిర్లక్ష్యంగా అన్నాడు.



"ఇంకా నాకో పరువు మిగిలిందేమిటి. పోయిన పరువు ఎలాగో పోయింది. నిన్ను మాత్రం వదలను. మర్యాదగా ఒప్పుకో."

"యూ డెవిల్. బెదిరిస్తున్నావా?. నీ యిష్టం వచ్చింది చెయ్యి గోటూ హెల్" ఆడపిల్ల బెదిరిస్తుంటే తగ్గిపోవడానికి మగ అహం అడ్డువచ్చి తీవ్రంగా జవాబిచ్చి విసవిస నడిచి వెళ్లిపోయాడు సురేష్. వెడుతున్న సురేష్ని చూస్తూ చెంపలెంబడి కారుతున్న కన్నీటిని కూడా తుడుచుకోవడం మరచి అలా కూర్చుండిపోయింది ఆ చీకట్లో.

* * *

వాడిపోయిన మొహంతో, వాచిన కళ్లతో యిల్లుచేరిన రూపని చూడగానే పద్మావతికి సగం సంగతి అర్థమైపోయింది. ఆమె గుండెలు దడదడలాడాయి. ఏం వినాల్సి వస్తుందోనని ఆమె బెదిరింది మనసులో. గంట సించి

ఆరాటంగా ఎదురుచూస్తూంది పద్మావతి.

రూప తల్లి చూపులనుంచి తప్పించుకుని తిన్నగా పడక గదిలోకి వెళ్లి పక్కమీద వాలిపోయింది. పద్మావతి గబగబ గదిలోకి వచ్చి... "ఆ అబ్బాయిని కలుసుకున్నావా ఏమన్నాడు? అన్ని విషయాలు అడిగావా?" ఆరాటంగా అడిగింది మంచం మీద కూర్చుంటూ. రూప జవాబివ్వలేదు.

"ఏమన్నాడే. అలా వున్నావేమిటి?" కూతురి వంటి మీద చెయ్యి వేసి మరింత ఆరాటంగా అడిగింది, అటు తిరిగి పడుకున్న రూప కళ్లబడి నీరు కారింది. తల్లికి మొహం చూపలేక తలగడలో తల దాచుకుంది. పద్మావతి గాభరాగా "రూపా! ఏమయిందే: పెళ్లి చేసుకోనన్నాడా?. ఏం జరిగిందో ముందు చెప్పవే" గట్టిగా అడిగింది.

రూప తల అడ్డంగా ఆడించింది.

"చేసుకోనన్నాడా?. ఎందుకు? ఏం?" వివర్ణమయిన మొహంతో అంది పద్మావతి.

"అతని చదువవ్వాలిట, ఉద్యోగం రావాలిట, ఐదారేళ్ల వరకు చేసుకోడట. ఇంకా అతని అన్నయ్యకే పెళ్లి కాలేదట. ఇప్పుడు సంపాదన లేకుండా పెళ్లి ఏమిటన్నాడు" రూప గొంతు పెగుల్చుకుని అంది.

"నాకు తెలుసు ఈ జవాబు వస్తుందని. చదువన్నా పూర్తికాకుండా ఈ రోజుల్లో ఎవరు చేసుకుంటారు. పోనీ ఉద్యోగం వచ్చాక చేసుకుంటానన్నాడా?" అనుమానంగాచూసింది.

"అదీ సరిగా చెప్పలేదమ్మా ఎప్పుడో ఐదారేళ్ల సంగతి యిప్పుడేం చెప్పను అన్నాడు" బేలగా అంది రూప తల్లి వంక భయంగా చూస్తూ.

"హు... తెల్సిందా! ఈ ప్రేమలు ఎలాంటివో. ఇప్పటికన్నా బుద్ధొచ్చిందా. ప్రేమించడం ఒక హాబి యీ కుర్రాళ్లకి. అది పెళ్లి దాకా రానివ్వరన్న బుద్ధి, జ్ఞానం నీకు లేకపోయింది. వాళ్లు చక్కగా కట్నాలు తీసుకుని అమ్మా నాన్న తెచ్చిన సంబంధాలు చేసుకుంటారు మళ్లీ. అమ్మాయిలని ప్రేమించడం తిరగడం అంతా ఫేషన్. మళ్లీ పెళ్లి మాత్రం చక్కగా ఆచారం ప్రకారం సాంప్రదాయాలు చూసి చేసుకుంటారు. వాళ్లెంత మంది అమ్మాయిలతో తిరిగినా వాళ్ళు పెళ్ళాడే అమ్మాయి మాత్రం గుమ్మం దాటని బుద్ధిమంతురాలయి ఉండాలి మగాళ్ళకి. ఇలాంటివి ఎన్నిచోట్ల వినడంలేదు, చూడడం లేదు. అందుకేనే ఆడపిల్లల తండ్రులు కూతుళ్ళని జాగ్రత్త పెట్టుకోవాలని ఆరాట పడ్తారు. ఎటొచ్చి ఎటు పోయినా నష్టపోయేది ఆడపిల్లలు, వాళ్ళని కన్న తల్లిదండ్రులు. రూపా! నీ తెలివితక్కువ తనం ఎంత చేటుకి దారి తీసిందో ఇప్పటికన్నా తెల్సిందా. ఇప్పుడు మీ నాన్న నా ప్రాణాలు తీస్తారు ముందు. మధ్య నాకు చావొచ్చిపడింది" భయం, బాధ, ఆరాటం, ఆవేదన అన్నీ కలిసి పద్మావతి మతి పోగొట్టాయి.

ఉద్యోగం వచ్చేవరకు ఆగుతాను. ఈలోగా సంబంధం నిశ్చయం చేసుకుని తాంబూలాలు తీసుకుందాం. మా నాన్న వెళ్ళి మీ నాన్నగారితో మాట్లాడి నిశ్చయం చేస్తారని నెమ్మదిగా నచ్చచెప్పక పోయావా?" "అదీ చెప్పానమ్మా... ఏ ఉద్యోగం వచ్చినా ఐదేళ్ళలోపు చేసుకోవడం, అన్నాళ్ళ తరువాత ఏమో ఎవరి బుద్ధి ఎలా వుంటుందో. నా మనసు

మారచ్చు. ఇంట్లో చెపితే నీకు ఇప్పుడు పెళ్ళి తొందరేం వచ్చిందని తిడ్తారు అన్నాడమ్మా. అతనికి చేసుకునే ఉద్దేశం వుంటే ఉద్యోగం రాగానే చేసుకుందాం అనేవాడు. నేను ఎంత చెప్పినా దానికి ఒప్పుకోలేదు. ఏదో సరదాగా తిరిగాం. ఇప్పుడేం కొంప మునిగిందన్నాడు."

"రాస్కెల్ సరదాగా తిరిగాడా... వాడికీ అక్కచెల్లెళ్లుండిఫుంటారు,ఆ చెల్లెల్నీ ఇలా సరదాగా తిరిగిరమ్మని పంపుతాడా. రేపొద్దుట పెళ్ళాన్నీ పంపుతాడా? వాడినని ఏం లాభం. నీకసలు బుద్ధి వుంటే ఇలా ఎందుకు చేస్తావు. వెధవ అబద్ధాలాడి ఇన్నాళ్ల నన్ను మోసం చేశావు ఇప్పుడేం చేస్తావు మీ నాన్నకిఏం చెప్తావు?" పద్మావతి కోపంతో కూతురిని తిట్ట సాగింది.

"వాడెందుకు చేసుకోడో నేనూ చూస్తాను. వాడింటికెళ్ళి వాడి నాన్నతో అంతా చెప్తాను. అందరి ముందు నిలబెట్టి వాడి మొహాన పేడనీళ్లు కొట్టి బుద్ధి చెప్తాను" రూప పౌరుషంగా అంది.

"నోరు మూసుకో. పిచ్చిమాటలు మాట్లాడకు. చేసింది చాలక ఇంక పౌరుషం కూడాను. ఆడపిల్లవు నీకుండాలి జాగ్రత్త మావాడికెందుకు అని నీ మొహాన పేడ నీళ్లు కొట్టి పంపిస్తారు అంపరూ" కోపంగా అంది పద్మావతి. ఆమెకి ముందు సమస్య భర్తకి ఏం చెప్పాలా అన్నది.

ఈ సంగతి ఎందరికి తెల్సిందో. దీని వల్ల పర్యవసానం ఎలా వుంటుంది. కూతురి పెళ్ళికి ఇదో సమస్య అవదుగదా అన్నది మరో భయం.

"అవునమ్మా ఇద్దరం తిరిగాం. ఎంజాయ్ చేశాం. అంత సులువుగా వది లేసి పోనిస్తానా. అంత చాతకాని దద్దమ్మలా ఊరుకోను. ఊరుకుంటూంటే మరింత చేస్తారు. కనీసం ఒక్కడికేనా బుద్ధి చెప్పాలి" ఉక్రోషంగా అంది రూప.

"ఏమిటే నీవు చేసేది? నీకు నేనేమన్నా పెళ్ళి చేసుకుంటానని వాగ్దానం చేశానా అంటాడు. నీ దగ్గిర జవాబుందా దానికి. వాళ్ళ తల్లిదండ్రులు మంచివాళ్ళయినా కొడుకు చేసుకోనంటే బలవంతంగా చేస్తారా. ఒకవేళ చేసినా ఆ కోపం, కసి నీ మీద చూపి నిన్ను హింసించడా పెళ్లయ్యాక. ఇవన్నీ ఉత్తి కబుర్లు. మగాడి కిష్టం లేకపోతే మనం చెయ్యగల్గింది ఏమీ లేదు" నిస్పృహగా అంది.

"కోర్టుకీడుస్తాను" కసిగా పళ్లు కొరికి అంది రూప.

"ఆ అక్కడా ఇదే మాట అడుగుతారు. ఇష్టపడి తిరిగావా లేదా, బలవంతం చేసినట్లు సాక్ష్యం వుందా అంటారు. ఏం చేస్తావు? రూపా! చిన్నతనం, ఆవేశంలో ఏదో మాట్లాడడం తప్ప ఇదేం లాభం లేదు. ఇప్పటికయినా మేల్కొన్నావు పూర్తిగా మునగక ముందే. అదృష్ట వంతులం మేం. ఏదన్నా అయితే మొహం ఎత్తుకోలేకపోయేవాళ్ళం. ఇంక నోరు మూసుకుని ఇంట్లో పడివుండు. ఇల్లు వదులు చెప్తా ఇచ్చిన స్వాతంత్ర్యాన్ని దుర్వినియోగపరిచి అల్లరి పాలయ్యావు. ఇంక బుద్ధి తెచ్చుకో" పద్మావతి మాట్లాడుతుండగానే విశ్వనాథం గదిలోకి వచ్చాడు. అతను అఫీసునించి వచ్చిన సంగతన్నా ఇద్దరూ గుర్తించలేదు.

తల్లి, కూతురు అతన్ని చూసి గాభరా పడ్డారు. కళావిహీనంగా వున్న ఇద్దరి మొహాలు ఆయన దృష్టినించి దాటిపో

లేదు. "ఏమిటి గూడుపుఠాని చేసున్నారు ఇద్దరూ. ఏం జరిగింది?" గంభీరంగా అన్నారు విశ్వనాథం. "ఏం లేదు" పద్మావతి తడబడూ "కాఫీ తెస్తాను" అంటూ వంటింట్లోకి వెళ్ళబోయింది. "ఏం లేక పోవడం ఏమిటి - నీ కూతురు సంగతి ఏమయింది! వాడెవడో చేసుకోను పొమ్మన్నాడా? అడిగిందా ? ఏమన్నాడు" కూతురు వంక చూస్తూ అడిగారాయన. రూప భయంగా తల దించుకుంది. పద్మావతి మరోవైపు చూసింది.

"ఏమయిందంటే మాట్లాడరేం?" ఒక్కకసురు కసిరారు అసహనంగా.

"ఆ అబ్బాయి చదువదీ అవలేదు. చదువయి ఉద్యోగం వచ్చి ఐదారేళ్లు వరకు చేసుకోడట..." పద్మావతి గొణిగింది.

"అయిందా...నాకు తెలుసు ఇలాంటి జవాబొస్తుందని. ఇప్పుడింక ఏం చేస్తుందిట నీ కూతురు. ఊరు వాడ తెలిసింది ఈ సంగతి" కూతురి వంక తిరస్కారంగా చూశారాయన. "ఇదివరకు తెలియక పోయినా ఇప్పుడు మీ కేకలకి అంతా తెలుసుకుంటారులేండి. ముందు మీరే వెళ్ళి అందరికీ చాటించేలా వున్నారు" అక్కసుగా అంది పద్మావతి భర్తను చురచుర చూస్తూ. "ఇదిగో ఇలాగే పిల్లల్ని వెనకేసుకు వచ్చి ఇన్నాళ్ళూ పాడుచేశావు. అది ఆడించినట్లాడావు. తల్లి,కూతురుకలిసి నాటకం ఆడారు నాకు తెలియకుండా ఇన్నాళ్లూ. ఇప్పుడు ఆడండి ఇద్దరూ కల్సి గంగలో దూకండి. నాకు నీ కూతురి సంగతి అనవసరం. ఇంక దాని సంగతి ఎత్తితే అడుగు. ఇద్దరు ఏం చేసారో చేసుకోండి. వాడి కాళ్ళు పట్టుకుని పెళ్ళే చేసావో మరేం చేసావో చెయ్యి."

"ఆయన కోపంగా విసురుగా గది లోంచి వెళ్ళిపోయారు. పద్మావతి నిట్టూర్చి రూప వంక ఒకసారి చూసి గదిలోంచి వెళ్ళింది. మాడిపోయిన మొహంతో రూప పక్కమీద వాలిపోయింది.

* * *

రాత్రి పదిన్నర అయింది. రేపు వాదించాల్సిన కేసు గురించి ఆఖరిసారిగా చదివి పాయింట్స్ నోట్ చేసుకుంటూంది లాయరు సుమతి. ఆ పని పూర్తిచేసి నిద్రపోవాలి అనుకుంటూ ఆవలింతలు వస్తున్నా నిద్ర ఆపుకుంటూ చకచక కాగితాలు తిరగేస్తూంది సుమతి. బయట కాలింగ్ బెల్ మోగింది. ఇంత రాత్రి ఎవరొచ్చారు చెప్మా అనుకుంది. వంటావిడ వెంకమ్మగారప్పుడే వంటింటి నడవాలో గుర్రుపెట్టి నిద్రపోతూంది. సుమతి ఆవిడ లేచి తలుపు తీసుందేమోనని కాసేపు చూసి - బెల్ మరోసారి మోగడంతో లేచి వీధి తలుపు తీసి ఆశ్చర్యపోయింది. గుమ్మంలో ఓ ఇరవై యేళ్ళ అమ్మాయిని, అంత రాత్రిపూట ఒంటరిగా వచ్చిన ఒక అపరిచిత యువతిని చూసి ఆశ్చర్యపడింది. "ఎవరమ్మా నీవు. ఏం కావాలి?" అంది.

"నమస్కారమండి. మా ఇల్లు ఈ ముందు సందులో వుంది. మీతో పనుండి వచ్చాను. లోపలికి రావచ్చాండి" అంది నమస్కారం చేసి.

"ఇప్పుడా! ఇంత రాత్రా!! రేపు రాకూడదూ. అంత అర్జంటా. నీవెవరమ్మాయివి ఇంతకీ ? ఒంటరిగా ఇలా రాత్రి..." సందిగ్ధంగా అంది సుమతి.

"అంతా చెప్తాను. ఈ రాత్రే ఎందుకు వచ్చానో మీకర్థం అవుతుంది. మానాన్నగారి పేరు విశ్వనాథంగారు. ఆయన బ్యాంకు ఆఫీసరు. మీ ఇంటిమీదుగా చాలా

సార్లు వెళ్ళుతూ మీ బోర్డు చూశాను. మీ నించి ఒక సహాయం కోరి ఇలా వచ్చాను. నా పేరు రూప. ప్లీజ్...ఒక్క పది నిమిషాలు నాకు టైము ఇవ్వండి" అర్థిస్తూ అడిగిన రూపని చూసి, పరువు మర్యాద గల ఓ ఇంటి ఆడపిల్ల అని అర్థం చేసుకుని ఇలా ఒంటరిగా ఏం పనిమీద వచ్చిందని ఊహించడానికి ప్రయత్నిస్తూ

"రా!లోపలికి రా అమ్మా"అంది సుమతి· దారికి అడ్డుతొలగి రూప లోపలికి రాగానే తలుపువేసి ఆఫీసు గదిలోకి తీసికెళ్ళి కుర్చీచూపి, తనోకుర్చీలో కూర్చుంది. లైటు వెలుగులో రూపని ఒక నిమిషం పరీక్షగా చూసింది. "చెప్పమ్మా! ఏం పని మీద యిలా వచ్చావు. ఇలా నీవు వచ్చి నట్లు మీ ఇంట్లో తెలుసా, ఒంటరిగా ఎందుకు వచ్చావు?" కుతూహలంగా చూస్తూ అడిగింది.

లాయర్ సుమతి ముప్పై అయిదేళ్ళు దాటిన అవివాహిత యువతి. మంచి ఫిగర్‌తో చక్కటిరంగు. మంచి ఫీచర్స్‌తో హుందాగా, అందంగా, వున్న వయసుకి పదేళ్ళు తక్కువున్నట్టు వుంటుంది.

అందం, చదువు, మంచి ప్రాక్టీసు అన్నీవున్న ఆమె ఎందుకు అవివాహితగా వుండి పోయిందో ఎవరికీ తెలియదు. నలభై య్యో పడిలో పడినా యీనాడూ ఆమెని వివాహం ఆడడానికి చాలామంది మగాళ్ల ముందుకు వస్తారు. మంచి ఇల్లు కట్టుకుంది. వంట మనిషి, దాసి, కాపు, డ్రైవరు...వుండాల్సిన హంగులన్నీ వున్నాయి. ఇన్నాళ్ళూ ముసలి తల్లి వుండేది. ఆవిడపోయి మూడేళ్లు అయింది.

తర్వాత ఒంటరితనం భరించలేకేమో ఓ ఆడపిల్ల పదిహేను ఏళ్ళున్న ఓ అమ్మాయిని అనాధ శరణాలయం నించి తీసుకొచ్చి చదువు చెప్పిస్తూ పెంచుకుం టోంది. ఆ అమ్మాయి వచ్చాక ఆమె జీవితానికో వెలుగొచ్చినట్లు, జీవితానికో అర్థం ఏర్పడినట్లు లాయరు సుమతి మొహంలో సంతోషపు ఛాయలు కనిపిస్తున్నాయి. నిర్లిప్తంగా వుండే ఆమెలో ఓ నూతనోత్సాహం కనిపిస్తూం దని అందరూ అనుకుంటున్నారు. ఆమె స్నేహితులు, తోటిలాయర్లు, హితైషులు ఆమెని వివాహం చేసుకోమని చెప్పి చెప్పి ఒప్పించలేక వదిలేశారు. పోనీ ఏదో ఒక పిల్లని చేరదీసింది కాస్త కాలక్షేపం అని సంతోషించారు అందరూ. ఆమెకి లాయ రుగా హైకోర్టులో మంచి పేరుంది. చాలా ఉదారస్వభావురాలని, హెల్పింగ్ నేచరని అందరూ ఆమెతో స్నేహం పెంచుకో డానికి ఆరాట పడ్డారు. కాని సుమతి అందరితో నవ్వుతూ మాట్లాడుతూనే అందరినీ దూరంగా వుంచుతూ తన పని తను చేసుకునే స్వభావం కలది. ఆమె ప్రాక్టీసు పెట్టిన ఇన్నాళ్ళలో... ఇలా ఒకమ్మాయి రాత్రిపూట ఒంటరిగా రావటం ఆశ్చర్యం కల్గించింది. ఈ కేసు ఏమిటి చెప్మా అన్న సంధిగ్ధంలో పడింది.

"లాయరుగారూ...నా పేరు రూప. బి.ఏ. పరీక్ష ఇచ్చాను. మా ఇల్లు ఈ ముందు లైన్లో వుంది. నేనిలా యింట్లో ఎవరికీ తెలీకుండా మిమ్మల్ని కలవాలని వచ్చాను. దయచేసి నేను చెప్పే విషయాలు మీరు రహస్యంగా వుంచాలి. మా వాళ్ళతో అసలు చెప్పకూడదు...."

"అసలు ఏమిటి విషయం. లాయరుగా నా సలహా సంప్రదింపుల కోసం వచ్చావా ఏదన్నా కోర్టు కేసులో నా సలహా



కావాలా?..." సుమతి ఆశ్చర్యంగా అడిగింది.

"లాయరుగారూ...నేనసలు మీదగ్గర కెందుకొచ్చానో నాకే తెలియదు. మీ రేదన్నా సలహా యిస్తారని, నాకేదన్నా చెయ్యగలరేమోనన్న ఆశతో వచ్చాను. మీరెంతవరకు నాకు సహాయపడగలరో, అసలు సహాయం చేయగలరో లేదో నాకు తెలియదు. మీ 'లా' పాయింట్ల గురించి నాకు తెలియదు. నే చెప్పింది విన్నాక అప్పుడు మీరే ఆలోచిద్దురుగాని. నా కాట్టే టైము లేదు. ఓ అరగంటలో వెళ్ళిపోవాలి"

"అసలు ఇంట్లో తెలీకుండా ఎలా

వచ్చావు?" అనుమానంగా అడిగింది.

"ఇంట్లో అంతా పడుకున్నారు. నా రూముకి పైన తాళం పెట్టి ఇలా వచ్చాను. మధ్యలో మా అమ్మ లేవదు. లేచినా నా రూములోకి రాదు"

"సరే చెప్పు" సుమతికి కుతూహలంగా వుంది, రూప వచ్చిన విషయం తెల్సుకోడానికి.

రూప ధైర్యంగా జంకు గొంకు లేకుండా తన గురించి, తన ఫేమిలీ గురించి ముందు క్లుప్తంగా చెప్పి తరువాత సురేష్‌తో తన పరిచయం, ప్రేమ అతను నిరాకరించడం, ఇంట్లో తల్లిదండ్రి తిట్టడం, వారి బాధ అన్నీ వివరంగా చెప్పింది. సుమతి చాలా శ్రద్ధగా, కుతూహలంగా వింది. "ఇందులో నేను నీకు చెయ్యిగలిగిన సహాయంగాని, ఇచ్చే సలహాగాని ఏం వుంటుందమ్మా...ఇలాటి కథలు వందలు, వేలు విన్నాం...ఇది పాతకథే కదా..."

"అవును లాయరుగారూ ఇది పాత కథే. ఈ పాతకథని కొత్త మలుపు తిప్పాలని, దానికి మీరేమన్నా సహాయ పడగలరేమోనని వచ్చాను" రూప ఆశగా ఆమె మొహంలోకి చూసింది. సుమతి సందిగ్ధంగా రూప వంక చూసింది.

"నాకేం అర్థం కావడం లేదు. ఇందులో నేనేం సహాయం చెయ్యగలనమ్మా..."

"లాయర్‌గారూ నేను..నేను నెలతప్పానని అనుమానంగా వుంది" తల దించుకుని అంది. సుమతి తెల్లబోయింది.

"ఎలా...ఎలా" అంది. "అదే నాకూ అర్థం కావడం లేదు. సురేష్ జాగ్రత్త పడ్డాడు. ఒకరోజు హడావుడిలో ఏం జరిగిందో ఫేలయింది. నా కెప్పుడూ కరెక్ట్‌గా వస్తాయి పీరియడ్స్. ఈసారి పదిరోజులు దాటిపోయింది. ఇన్నాళ్ల ఎందుకో అనుకున్నాను గాని ఈరోజు ఉదయం వాంతి అయింది. అదే...అదే అనుమానం లేదింక" వణుకుతున్న గొంతుతో అంది. "ఉదయం నించి ఆలోచించాక మిమ్మల్ని కలవాలన్న ఆలోచన వచ్చింది లాయరుగారూ. ఈ పదిరోజులుగా ఒక్కక్షణం కునుకు పట్టలేదు భయంతో. కాని ఉదయం నించి ఆలోచించాక ఇపుడు ఏదో మొండి ధైర్యం, తెగింపు వచ్చేశాయి నాకు. ఏం జరిగినా ఎదుర్కోగలనన్న నిబ్బరం కల్గుతూంది. నన్నీస్థితిలో పడేసిన ఆ సురేష్‌ని వదలను లాయరుగారూ... నన్ను నలుగురి ముందు తలెత్తుకోలేకుండా దోషిగా చేసిన ఆ సురేష్‌కి ఇందులో భాగం వుందని, అతనూ దోషి అని నిరూపించి వాడూ తలెత్తుకోలేకుండా చేసే వరకు నా పగ, కసి చల్లారదు లాయర్ గారూ. దానికి మీ సహాయం కావాలి"

రూప మొహం నిండా చెమట పట్టింది. ఆమెలోని ఆవేశం, కసి మాటల్లోనే తెలుస్తూంది. సుమతి ఆమె ధైర్యాన్ని, మనో నిబ్బరాన్ని మెచ్చుకుంటున్నట్టు చూసింది. కాని ఆమెకింకా తననించి ఏం సహాయం ఆశించిందో అర్థం గాలేదు.

"లాయరుగారూ! ఆ సురేష్‌ని కోర్టుకీడ్పించి, కోర్టు ద్వారా న్యాయం పొందాలని అనుకుంటున్నాను. వాడు నన్నిలా ప్రేమించి, అవసరం తీర్చుకున్నాక వదిలాడని, వాడి ద్వారా నేను బిడ్డతల్లి నవబోతున్నందువల్ల నా బిడ్డకు తండ్రిగా కోర్టులో నిరూపించాలని నా కోరిక. దానికి మీరు నాకు సహాయపడగలరా... లాయరుగా మీ సలహా సంప్ర

దింపులకోసం వచ్చాను" రూప సూటిగా చూస్తూ అడిగింది. సుమతి ఆ ధైర్యానికి విస్తుపోయింది. సాధారణంగా యీ పరిస్థితిలో పడిన అమ్మాయిలు తమ తప్పు, పాపం బయటికి రాకుండా గుట్టుగా కడిగేసుకునే ప్రయత్నం చేస్తారు. కాని ఈ అమ్మాయి ఇలా ధైర్యంగా న్యాయం కోసం కోర్టుకెక్కి పోరాడాలనుకోడం ఏదో వింతగానే అన్పించింది. రూపని పట్టిపట్టి చూస్తూ ఆలోచించింది.

"కాని కోర్టు కెక్కితే... ముందు ఈ విషయాలన్నీ బట్టబయలు అవుతాయి. నీ పరువు, నీ తల్లితండ్రుల పరువు, మీ కుటుంబగౌరవం ఇవన్నీ ఆలోచించావా?"

"హుఁ...ఇలా పరువు కోసం పాకులాడే నాలాంటి కన్నెతల్లులందరూ ఏ నుయ్యో గొయ్యో చూసుకోడమో లేదా తమ బిడ్డని నూతిలో గోతిలో తొయ్యడమో, అదీ చేతనవపోతే ఏ అనాథ శరణాలయాల పాలుచెయ్యడమో చేశారు ఇన్నాళ్ళూ. నేను చేసిన తప్పుకి నా బిడ్డని శిక్షించను. కష్టమో, నష్టమో ఆ శిక్ష నేనే అనుభవిస్తాను. ఈ తప్పులో సురేష్‌కి భాగం వుంది కనక వాడ్ని తప్పించుకుని పోనీయను. ఆ శిక్ష వాడూ పొందాలి. నాతోపాటు వాడి పరువూ పోవాలి! స్త్రీ పురుషు లిద్దరూ చేసిన తప్పుకి యుగయుగాలుగా స్త్రీ ఒక్కతే శిక్ష అనుభవిస్తూంది. కనీసం ఈ యుగంలో ఒక్క పురుషుడైనా స్త్రీతో పాటు శిక్షార్హుడని నిరూపించడానికే కోర్టుకెక్కదలిచాను లాయరుగారూ, దానికి మీ సహాయం కావాలి. నా పరువు పోసింది. నన్నుచూసి అందరూ అసహ్యించుకోనీండి. దీనివల్ల విషమ సమస్యలు తలెత్త నీండి.

ఏ పరిణామాలన్నా ఎదుర్కోడానికి సిద్ధపడే వచ్చాను. నా తల్లితండ్రులు నన్ను తిడ్తారు. పరువు ప్రతిష్ఠ బజారు పాలు చేశానని దుఃఖించనీండి. మొదట నన్ను తిట్టిన అందరూ కోర్టులో నా ధైర్యాన్ని అభినందించక మానరు. లాయరుగారూ! ఈనాటి నా ఈ నిర్ణయం, నా లాంటి ఆడపిల్లలందరికీ మనో ధైర్యాన్నిచ్చి ముందడుగు వేయిస్తే, ఆ ప్రయత్నంలో నేనొక సమిధ నయినా నాకు సంతోషమే! ఈనాడు నే తీసిన ఈ పునాది మీద నా లాంటి అమ్మాయిలందరూ తలో ఇటిక వేస్తే రేపు అది మహా భవనమై ఎంత మంది పురుషులు ఏకమైనా ఆ తాకిడికి కూలిపోలేనంత పటిష్ఠ మవ్వాలని నా కోరిక. ఇది పురుషులకొక గుణపాఠం అవ్వాలని నా కోరిక. ఆడపిల్లల్ని ప్రేమించడానికి తప్ప పెళ్ళాడగలిగే హృదయ వైశాల్యం లేని పిరికి పందలందరికీ చేసిన తప్పునించి తాము తప్పించుకు పారిపోతే, ఈనాటి అమ్మాయిలు తెలివితక్కువవారు కారు అన్న భయం కలించడానికి నా పరువు, నా కుటుంబం పరువు పణంగా పెట్టుతున్నాను లాయర్ గారూ..." రూప ఆవేశంగా అంది.

సుమతి విప్పారిన మొహంతో రూప వంక ప్రశంసా పూర్వకంగా చూస్తూ "భేష్ రూపా భేష్! నీ ధైర్యాన్ని అభినందిస్తున్నాను. చిన్నదానివైనా ఇంత మనో నిబ్బరం నీకు కలిగినందుకు అభినందిస్తున్నాను. రూపా, నీకు...నీకు తప్పకుండా సహాయ పడతానమ్మా. నా చాతనయినంతగా నీకు సహకరిస్తాను. ఈనాడు నీకున్న ధైర్యంలో పదోవంతు నీలా ఒక్క ఆడపిల్లైనా తెగించి ధైర్యం చేయగలిగితే మన ఆడవాళ్ళ కథలు ఎప్పుడో మారే



వేమో, పరువు ప్రతిష్ఠల ప్రలోభాలకి లోబడి ఇంతమంది ఇన్ని భ్రూణహత్యలు చేసేవారు కాదేమో. మరెంతో మంది అనాథ శిశువుల్ని తయారు చేసేవారు కారేమో. ఒక్క పురుషుడినైనా చేసిన తప్పుకి నలుగురిలో నిలబెట్టి దోషిగా నిరూపిస్తే ఆడపిల్లల జీవితాలతో ఆడుకునే పురుషుల సంఖ్య తగ్గేదేమో. రూపా! చూద్దాం ఇద్దరంకల్సి ఈ అన్యాయాన్ని ఎదిరించడానికి మనం చెయ్యగల్గింది చేద్దాం. ఐ విల్ బి విత్ యూ టిల్ ద ఎండ్" రూప చెయ్యిఅందుకుని ప్రామిస్ చేస్తున్నట్టు చేతిలో చెయ్యివేసి ఆవేశంగా, ఉత్తేజితురాలైంది సుమతి.

రూప మొహం విప్పారింది. "లాయర్ గారూ సారీ మీరు నాకంటే పెద్దవారు. నాకు తల్లిలాంటి వారు. మిమ్మల్ని ఆంటీ అని పిలుస్తాను. అస్తమానూ లాయర్ గారు అనడం ఏదోలా వుంది" రూప సందిగ్ధంగా అంది.

"ష్యూర్! తప్పకుండా! అలాగే పిలమ్మా. ఇంతకీ నీవు ఈ పనికి నన్నే ఎందుకు ఎన్నుకున్నావు. నేను నీకు సహాయం చేస్తానని ఎలా అన్పించింది. నాతో పరిచయమన్నా లేదు గదా? సుమతి కుతూహలంగా అడిగింది.

"ఆంటీ! మిమ్మల్ని ఇదివరకు నాలు గైదు సార్లు చూశాను. కారులోంచి దిగుతుంటే, మీ యింటిముందు నించి వెడుతూ ఇలా చాలా సార్లు చూశాం. నేను మా ఫ్రెండ్సు మీ అందం గురించి, మీ ఫిగర్, మీ హుందాని మెచ్చుకుంటూ మాట్లాడుకునేవాళ్ళం...చక్కగా మీరు పెళ్ళి చేసుకోకుండా, హాయిగా స్వతంత్రంగా ఫ్రీగా వుండడం అదీ మాకు ఎంతో నచ్చింది...సురేష్ నన్ను మోసం చేసిన దగ్గిరనించి ఏదోచేసి కసిదీర్చుకోవాలని, వాడ్ని అంత సులువుగా వదలకూడదని అనిపించి ఏం చెయ్యాలా అని ఆలోచించాను ఇన్నాళ్ళూ. ఆఖరికి ఈ పది రోజులుగా పీరియడ్స్ ఆలస్యం అయ్యాక అనుమానం వచ్చాక, సురేష్‌ని మళ్ళీ కల్సుకున్నాను..."

"సురేష్‌ని మళ్ళీ కలిశావా! ఇలా నీకు నెలతప్పినట్లు అతనికి తెలుసన్నమాట. ఏమన్నాడు?..." ఆత్రుతగా అడిగింది సుమతి.

"హుఁ...ఏమంటాడు ఆంటీ. ఆ సమయంలో ప్రతీ మగాడు ఎలా మాట్లాడుతాడో అలాగే మాట్లాడి అవమాన పరిచాడు. ఆరోజు మా యిద్దరి మధ్య గొడవ జరిగాక అమ్మ నాన్న యింట్లో తిట్టి టైపు మానిపించేశారు. ఇల్లు వదలకుండా కట్టడి చేశారు. నాన్నగారయితే నాతో మాట్లాడడం మానేశారు. నన్ను చూసి మొహం చిట్లించి తల తిప్పుకునేవారు. అమ్మని పట్టుకు సందు దొరికినప్పుడల్లా సాధించేవారు. అమ్మ నాతో ముభావంగా వుండడం ఆరంభించింది.

ఇంట్లో అంతా నన్ను వెలేసినట్లు చూసేవారు. ఆ వాతావరణం ఆ పరిస్థితి, తప్పు చేశానన్న భావం అన్నీకల్సి నా పరిస్థితి మహా ఘోరంగా వుండేది. ఆ వాతావరణం నుంచి తప్పించుకుని పారిపోవాలనిపించేది. ఈలోగా పీరియడ్స్ రాక పోవడంతో నా పరిస్థితి వూహించండి. అమ్మకింకా అనుమానం రాలేదనుకోండి.

అయినా నా ఆరాటం వూహించండి. సురేష్‌కి సంగతి చెపితే మనసు ఏమన్నా మార్చుకుని పెళ్ళి చేసుకుంటాడో, లేక ఏదన్నా దారి చూపిస్తాడన్న ఆశతో ఒకరోజు అమ్మ చూడకుండా ఇంట్లోంచి బయటపడి టైపు ఇన్‌స్టిట్యూట్ కి వెళ్ళాను. నన్నుచూసి మొహం తిప్పేశాడు. "సురేష్ నీతో మాట్లాడాలని వచ్చానన్నాను"

"నీకు నాకు మాటలేమున్నాయింకా" అన్నాడు. "ఉంది, చాలా సీరియస్ విషయం, అర్జంటుగా మాట్లాడాలన్నాను" నా మొహంలో ఆదుర్దా చూసి ఏమనుకున్నాడో టాంక్ బండ్‌కి నాతో వచ్చాడు. కూర్చోగానే నా అనుమానం వెళ్ళడించాను భయపడూ. సురేష్ మొహం నల్లబడింది. "ఇంపాసిబుల్. ఎలా అవుతుంది. నీవబద్ధం ఆడుతున్నావు" అన్నాడు తిరస్కారంగా చూసి. కోపం ముంచుకొచ్చినా నిగ్రహించుకుని శాంతంగానే ఏ లేడీ డాక్టరు చేతన్నా పరీక్ష చేయించమన్నాను.

అఫ్‌కోర్స్ యింకా అనుమానమే అనుకో, అయినా నాకెప్పుడూ ఇలా అవలేదు. ఏం చేద్దాం సురేష్. అమ్మ నాన్నలకి తెలిస్తే నన్ను చంపేస్తారు" అన్నాను.

ప్రాధేయపూర్వకంగా చూస్తూ. "నన్నేం చెయ్యమంటావు. నేను తీసుకోవల్సిన జాగ్రత్తలు తీసుకున్నానని నీకూ తెల్సు. అది ఫేలయితే నేనేం చేస్తాను. ఇప్పుడు నన్నేం చెయ్యమంటావు. మహా అయితే ఏ డాక్టరు దగ్గిరకన్నా తీసికెళ్ళి అబార్షన్ చేయించాలి. దానికి నాదగ్గర డబ్బులేదు. నీకు తెలుసు, నేనూ స్టూడెంటని. ఓ రెండు మూడు వందలు ఖర్చుపెట్టి ఏ ప్రైవేటు డాక్టరు దగ్గిరకన్నా తీసికెళ్ళ డానికన్నా నాకు కుదరదు. గవర్నమెంటు ఆస్పత్రికెళ్ళాలి. అక్కడ అంతా పబ్లిక్. ఏ దొంగపేర్లో చెప్పాలి. ఎవరన్నా చూస్తే గొడవ. ఇదంతా నాకేమిటో గందర గోళంగావుంది. ఇంతకి దీనికి నేనే కారకుడ్ని అని నాకు నమ్మకం ఏమిటి?" అదోరకంగాచూస్తూ హేళనగా అన్నాడు.

స్థాణువయ్యాను ఒక్క నిమిషం. వాడన్నది అర్థం అయ్యాక ఆగ్రహం అవధులు దాటింది. "యూ బ్లడి బాస్టర్డ్ సిగ్గులేదూ ఆమాట అనడానికి" ఆవేశంతో వణికిపోతూ అరిచాను.

"సిగ్గు ఆడవాళ్ళకేలేనపుడు నాకెందుకు ఏం నాతో ఇంత ఫ్రీగా తిరిగినదానివి ఇంకెవడితోనన్నా ఎందుకు తిరగవు. ఇదేదో నానెత్తిన రుద్దాలని, నామీద కసి తీర్చుకోడానికి నీవే ఇదంతాచేసి నన్నిరి కించాలని చూస్తున్నావేమో" అన్నాడు.

అలాంటి వాడితో మాట్లాడానికి కూడా అసహ్యం అనిపించింది. ఇంక ఏం అనీ వాడితో ప్రయోజనంలేదని అర్థమై పోయింది. "డోన్టాక్ ఎనదర్ వర్డ్. ఐ హేట్ యు. నీవు మనిషివికావు. బీస్ట్‌వి. నీతి-సంస్కారం అటుంచి మానవత్వం కూడా లేని మృగానివని అర్థమైంది. సురేష్ ! నీవు చేసిన యీ అవమానానికి బదులు తీర్చుకుంటాను. నిన్నింత సులువుగా వదలను. బి ప్రిపేర్ ఫర్ ఇట్ అన్నాను ఎగిసిపడుతున్న గుండెలతో నిప్పులు చెరుగుతున్న కళ్ళతో. వాడి మొహాన వుమ్మేసి వచ్చేశాను. నిర్లక్ష్యంగా నవ్వాడు నావెనకాతల. ఆరోజంతా ఎలా ప్రతీకారం తీర్చుకుని వాడికి బుద్ధి చెప్పాలా అని ఆలోచించాను ఆంటీ. ఆఖరికి వీలయితే వాడిని కోర్టుకెక్కించి న్యాయం కోసం పోరాడాలని నిర్ణయించాను.

ఎవరైనా లాయరు సహాయం కావాలి. అసలు నేను వాడిమీద కేసు పెట్టగలనో లేదో ఈ విషయాలన్నీ లాయర్‌తో సంప్రదించనిదే తెలియదుగదా. నాకెవరూ తెల్సిన లాయరులేరు. హఠాత్తుగా మీరు గుర్తుకువచ్చారు. నాకు చాలా సంతోషం కల్గింది. మగలాయరుకంటె ఓ స్త్రీగా నా బాధ, ఆవేదన, నిస్సహాయస్థితి మీరు బాగా గుర్తించి సహాయపడగలరని నమ్మాను. మీకు ఫీజివ్వడానికి తగినశక్తి నాకులేదు. మీరు ఒంటరివారు, ఇంత ఆర్జించారు, ఒక ఆడపిల్లకి సహాయపడ డానికి ఫీజు తీసుకోకుండా నాతరుపున వాదించగలరు - అన్న నమ్మకంతో మిమ్మల్ని కలవాలని, నా సంగతంతా దాచకుండా చెప్పి మీ సలహా పొందాలని ఇంతకి తెగించాను. నేను ఇంట్లోంచి బయటికి కదలడానికి అమ్మ లక్ష ఆంక్షలు పెడ్తోంది. ఇంచుమించు బంధిఖానా అయింది ఇల్లు నాకు.

ఒకవేళ వెళ్ళినా తమ్ముడి తోడు లేనిదే గుమ్మం కదలకూడదని ఆజ్ఞ. ఈ పరిస్థితిలో ఇల్లు వదలడానికి రాత్రి అంతా నిద్దరపోయాక దొంగతనంగా మీ

దగ్గరకి రావల్సి వచ్చింది. ఆంటీ! అంతా మీకు చెప్పాను. ఏం చేస్తారో నన్ను నేను మీకు అప్పగించుకున్నాను. నా మీద దయతల్చి ఈ కేసు టేకప్ చేసి ఓ ఆడ పిల్లకి జరిగిన అన్యాయానికి న్యాయస్థానంలో పోరాడాలి మీరు. నేను చెయ్యబోయేది సాహసమే, దానివల్ల చాలా అనర్థాలున్నాయి. నా భవిష్యత్తుకి దారి మూసుకుపోతుందనీ తెలుసు. ఏది ఏమైనా ఫరవాలేదు. నాకు ఈనాడు జరిగిన అన్యాయం ఇక ముందు ఒక ఆడ పిల్లకి ఏ మగాడైనా చేసే ముందు పదిసార్లు ఆలోచించేలా భయపడాలి. దానికి ఇదొక్కటే దారి. మీరే నాకు దిక్కు."

రూప రెండు చేతులు జోడించింది. ఆమెకి తెలియకుండానే ఆమె కంఠం రుద్ధమయి కళ్ళు నీళ్ళతో నిండాయి.

సుమతి కళ్ళు కూడా అప్రయత్నంగా చెమర్చాయి. "ఛ! ఛ! కన్నీరు పెట్టకు నీవు చాలా ధైర్యస్తురాలివి! నీలాంటి ఆడ పిల్ల కన్నీరు పెట్టకూడదు. ఈ మనో నిబ్బరం, ఈ ధైర్యం చివరివరకు లేకపోతే నీవేం సాధించలేవు. ముందా కళ్ళు తుడుచుకో. నేను నీ కేసు టేకప్ చేస్తాను. నేను నీకు అండగా వుంటాను రూపా. నీవేం భయపడకు" సుమతి లేచి రూప తల మీద చెయ్యి వేసి నిమిరింది ప్రమాణం చేస్తున్నట్టు. ఆ ఓదార్పుకి ఆ సౌమ్యతకి, రూప కరిగిపోయింది.

ఇన్నాళ్ళూ తనలో దాచుకు కుమిలి పోయిన ఆ దుఃఖం కట్టలు తెంచుకు బయటపడింది. సుమతి చెయ్యి మీద తల ఆన్చి చిన్న పిల్లలా బావురుమంది.

"ఆంటీ నాకు మీరే దిక్కు, ఏం చేస్తారో! నీట ముంచినా, పాల ముంచినా మీదే భారం. ఈ సంగతి తెలిసి అమ్మా నాన్న ఇంటిలోంచి గెంటి వేసినా మీరే దిక్కవాలి. మీరే నాకో దారి చూపాలి. పిరికి దానిలా చచ్చిపోవాలని లేదు ఆంటీ! ఈ ప్రపంచాన్ని ఎదిరించాలని వుంది. నాకు పెళ్ళి వద్దు, సంసారం వద్దు. మగాళ్ళంటేనే అసహ్యం పుట్టింది. ఈ మగాళ్ళని ధిక్కరించి వాళ్ళ అండ దండలు లేకుండానే బతికి, నా బిడ్డని బతికించుకుని—ఆ రాస్కెల్‌కి బుద్ధి చెప్పి సగర్వంగా తలెత్తుకు తిరగాలని వుంది.

వాడు నాకు భర్త కాకపోయినా నా బిడ్డకి తండ్రని లోకానికి చెప్పాలి ఆంటీ. పెళ్ళి కాకుండా బిడ్డని కనడంలో ఓ స్త్రీ తప్పు ఎంత వుందో, దానికి ఆమె బాధ్యత ఎంత వుందో పురుషుడికీ అంతే బాధ్యత వున్నప్పుడు ఆ పురుషుడు తప్పించుకుని ఎందుకు వెళ్ళాలనే విషయంలో న్యాయం కావాలి నాకు ఆంటీ. తల్లి ఎలా కననీ బిడ్డని కన్న తల్లికి ఆ బిడ్డ మీద వుండే మమతానురాగాలు ఒకటేనని అలాంటి బిడ్డని ఆమె పెంచుకునే హక్కు కోసం నేను ఈ లోకంతో పోరాడాలి ఆంటీ. ఈ బిడ్డని నాకు చంపుకోవాలని లేదు ఆంటీ. నే సాధించదల్చింది సాధించడానికి ఈ బిడ్డ బతకాలి ... ఆంటీ. ఇదంతా జరగాలంటే మీ సహాయం కావాలి ఆంటీ" రూప ఏడుస్తూ అంది.

సుమతి ఆమెని చూసి కరగిపోయింది. స్థిర నిశ్చయానికి వచ్చిన దానిలా తల పంకించింది. "రూపా ... చూడమ్మా! నీవు ఇంక ఏడవకు. ఇదివరకు నా తెలివి తక్కువ తనం మూలాన ఒక జీవితం నాశనం అయింది. నీ మాటలతో నాకళ్ళు తెరిచావు. నాకో మార్గం చూపావు. ఇది నీకే కాదు నాకూ ఒక సవాలే! నా

చాతనయినంతగా నీకు న్యాయం జరిగేలా చూస్తాను. అలా కాకపోయినా నీకు అండగా నిలుస్తాను. నీ వాళ్ళు నిన్ను ఆదుకోలేకపోతే నేను ఆదుకుంటాను. నీవు నీ కాళ్ళ మీద నిలబడే ప్రయత్నం చేస్తాను. అంతవరకు నీ భారం నేను వహిస్తాను. నేనింత ఆర్జించాను. నా డబ్బు నాకుపయోగ పడకపోయినా నాలాంటి ఒక అమ్మాయికి వుపయోగపడితే అంత కంటె సద్వినియోగం ఏముంది. రూపా! నీ బాధ అర్థం అయింది. నీవు ధైర్యం చేసి నా దగ్గరకు రావడం చాలా మంచి పని చేశావు. మనిద్దరిమధ్య ఏ పూర్వ జన్మ బంధమో వుండి వుంటుంది. ఆ దేవుడే నిన్ను నా దగ్గరకు పంపాడేమో నీ కథ విన్నాక న్యాయస్థానంలో నేను దేనికి పోరాడాలో తెలిసింది. ఆడదానికి జరుగుతున్న అన్యాయాలని ఎదిరించి న్యాయం కోసం పోరాడుతాను. పురుష అధికారానికి, మోసానికి గురి అయి వంచించబడ్డ స్త్రీలకి న్యాయం జరిగేలా చూస్తాను. అలాంటి స్త్రీలకిపుట్టిన బిడ్డలు అక్రమ సంతానాలు కాదని వారికి సంఘంలో గుర్తింపు వుండాలని వాదిస్తాను.

రూపా! నీ బిడ్డని చంపుకోవద్దు. ఆ బిడ్డని నీకు దూరం చేసే హక్కు ఎవరికి లేదు. ఆ బాధ ఎలాంటిదో నాకు తెలుసు రూపా. నీకు, నీ బిడ్డకి నేను అండగా నిలుస్తాను రూపా" సుమతి ఆవేశంగా రూప చెయ్యి నొక్కి పట్టు కున్న గొంతుతో అంది.

రూప ఆశ్చర్యంగా చూసింది. ఆమె తడి కళ్ళు ఆనందంతో మిల మిల లాడాయి. సుమతినించి ఇంత సహాయం, సహకారం రూప ఆశించలేదు. తనకింత, సహాయపడడానికి ముందుకు వస్తుందనీ అనుకోలేదు. తన కథ విని మందలించి యింటికి పంపిస్తుందని,నీవు తప్పు చేశావు నీ తల్లి దండ్రులు నీ మేలుకోరే వారు వాళ్ళ దగ్గర దాచకుండా నిజం చెప్పు. వాళ్ళే ఏదో తోవ చూస్తారు. చేసిన తప్పు ఎలాగూ చేశావు అంతా మరిచి ఎవరినో పెళ్ళాడు అంటూ నీతులు చెప్పి పంపిస్తుందనీ అనుకుంది. కోర్టులో నీ కేసు నిలవదు. లా వప్పుకోదు, పాయింటు నిలవదు. సాక్ష్యాలు, ఆధారాలు లేవంటూ కేసు టేకప్ చెయ్యడానికి తిరస్కరిస్తుందని, ఆమెని ఎలాగైనా బతిమిలాడి ప్రార్థించి ఒప్పించాలని ఏవేవో భయాలతో, సందేహాలతో తను తల పెట్టింది జరుగుతుందన్న ఆశ లేకుండానే అపనమ్మకంతోనే వచ్చింది.

కానీ సుమతి చూపిన ఆదరం, తన పట్ల చూపిన దయ, ఏం జరిగినా తన కండగా నిలుస్తానని చేసినబాస-తనకోసం, న్యాయం కోసం పోరాడుతానని ఆవేశంగా ఇచ్చిన మాట...అంతా ఆశ్చర్యంగా అని పించింది. సుమతి ఇచ్చిన ప్రోత్సాహ ధైర్యాలతో అపుడే సగం పని సాను కూల పడినంత ఆనందం అనిపించింది. చటుక్కున వంగి ఆమె పాదాలంటి నమ స్కారం చేసిందిరూప. "ఆంటీనాకుమీరుకొత్త జీవితం ప్రసాదించాలి.నాకు మీరు అండగా వుండాలి. నాకు మీరిచ్చిన ధైర్యం, నా పట్ల మీరు చూపిన ఆదరంతో నాలో ఆత్మవిశ్వాసం పెంపొందించారు. ఇన్నాళ్లీ తప్పు చేశానని కుములుతున్న నాకు మీ ఓదార్పు కొత్త జీవితం మీద ఆశ కల్గి స్తూంది. ఇంత సహాయం మీ నించి ఆశించ



లేదు ఆంటీ. ఈనాటినించి మీరేం చెపితే అది చేస్తాను. మీరే నాకు గురువు, దైవం. నా తల్లితండ్రులు కాదంటే మిమ్మల్ని తల్లిగా భావించుకుంటాను. మీరే నాకు మార్గ దర్శకులు" అంది రూప గద్గదికంగా.

సుమతి ఆదరంగా రూపని లేవనెత్తి నిలబెట్టి... "రూపా! నిజంగా నీ ధైర్య సాహసాలు నాకు యిప్పటికీ ఆశ్చర్యం కల్గిస్తున్నాయి. ఒక్క ఆడపిల్ల, అయినా నీ అంత నిబ్బరంగా పరిస్థితిని ఎదుర్కోడానికి నిలబడి వుంటే యీనాడు యిన్ని కన్నీటి కథలు వుండేవి కావు. సరే... యింక మనం కేసు వివరాలు మాట్లాడుదాం. అన్ని విషయాలు ముందునించి వివరంగా చెప్పు. అతను రాసిన ఉత్తరాలు గాని, మిమ్మల్ని చూసిన సాక్షులుగాని ఎవరన్నా వున్నారా? ఆ వివరాలన్నీ కావాలి నాకు" అంది టేబిల్ ముందు కూర్చుని కాగితం, కలం తీసుకుని.

రూప ప్రతి సంఘటన చెప్పడం మొదలు పెట్టింది. అందులో పాయింట్స్ నోటు చేసుకోసాగింది సుమతి. మధ్యలో "ఆ అబ్బాయి పేరు సురేష్ కదూ! ఎవరబ్బాయి? తండ్రేంచేస్తున్నాడు. వాళ్ళ యిల్లు ఎక్కడ - ఆ వివరాలు చెప్పు" అంది సుమతి. రూప సురేష్ తండ్రి పేరు, యిల్లు వివరాలు చెప్పగానే సుమతి ఆశ్చర్యంగా "లాయరు రామనాధం గారబ్బాయా సురేష్!" అంది తెల్లపోతూ. ఆమె మొహం ఒక్కసారిగా వివర్ణ మయింది. రూప గాభరాగా "ఆంటీ ... ఏమయింది? ఆయన మీకు బాగా తెలుసా" అంది. సుమతి ఒక్క క్షణంలో తేరుకుని

"ఆ తెలుసు...బాగా తెలుసు...ఆయనా లాయరే గదా" అంది తడబడి. మరో లాయరు కొడుకు మీద కేసు పెట్టాలని సుమతి సందేహిస్తుందేమో, తోటి లాయరుతో విరోధం అవుతుందని కేసు అంగీకరించదేమోనని రూప గాభరా పడింది. "రామనాధంగారి కొడుకా యీ సురేష్! ఇంతవాడయ్యాడన్నమాట.... తండ్రికి తగ్గ తనయుడయ్యాడన్నమాట. వండర్ ఫుల్. బహుశ కొడుకు తరపున తండ్రే కేసు తీసుకుంటాడు. మా యిద్దరికి పోటీ అన్నమాట. భేష్! చూద్దాం గెలుపు ఎవరిదవుతుందో. రూపా! అన్నట్టు మనం కోర్టు నోటీసిచ్చేముందు ఒకసారి వెళ్ళి సురేష్ తండ్రిని కల్సుకుని మాట్లాడి పరిస్థితి వివరించి చెప్పు. ఆ తండ్రి ఏమంటాడో విను కొడుకుని మందలించి నీకు సహాయపడగలడేమో అడిగి చూడు.

మన వైపునించి మనం అన్ని ప్రయత్నాలు చేశాకే కోర్టుకెక్కినట్టుండడం మంచిదీ. రేపే వెళ్ళి ఆయన్ని కలుసుకో! ఆయన ఏమన్నదీ రేపు ఒకసారి వచ్చి చెప్పు. ఈలోగా నేను కేసు గురించి ఆలోచిస్తాను. కేసు పెట్టేముందు లాపాయింట్లు చూడాలి గదా. అబ్బ అప్పుడే పన్నెండయింది. ఒంటరిగా ఎలా వెడతావు-పద నిన్నింటి దగ్గిర దింపి వస్తాను" అంది.

వంటావిడని నిద్రలేపి ఆవిడని తోడు తీసుకుని రూపని దింపి రావడానికి బయలు దేరింది సుమతి. "ఆంటీ! నాకు యింట్లోంచి బయటికి వెళ్ళడానికి పర్మిషన్ దొరకడంలేదు. సురేష్ యింటికంటే అమ్మ అసలు ఒప్పుకోదు. ఎలా ఆంటీ? అమ్మా వాళ్ళకి యిలా మిమ్మల్ని కలుసుకున్నట్టు, కేసు పెట్ట దలిచినట్లు యిప్పటినించి చెప్పడం మంచి దంటారా ?" సాలోచనగా అడిగింది రూప తోవలో. సుమతి ఒక్కక్షణం ఆలోచించింది. "ఇప్పుడే చెపితే మీ వాళ్ళు ఒప్పుకోరు. తమ పరువు, కూతురి భవిష్యత్తు నాశనం అవడానికి ఏ తల్లితండ్రులు లిష్టపడతారు. కోర్టుకెక్కితే అంతా బయటికి వచ్చి, నీకింక యీ జన్మకి పెళ్ళి కాదన్న భయం వాళ్ళకుంటుంది. అందువల్ల నిన్ను, నీ ఆలోచనని సమర్థించిన నన్ను దుయ్యబట్టి మన ప్రయత్నానికి అడ్డు తగలచ్చు. అంచేత ఇప్పుడు చెప్పడం మంచిది కాదు. ఎలాగో ఏదో వంకన రేపు సురేష్ యింటికెళ్ళు. ఇలాగే రేపు రాత్రి పది గంటలకి మా యింటికి రా. ఆఖరిసారిగా మనం అన్నీ డిస్కస్ చేసి నేను నోటీసు తయారు చేస్తాను"

మాటల్లో యిల్లు వచ్చింది. రూపని గుమ్మందగ్గిర విడిచి చెయ్యి నొక్కి అభిమానంగా భుజం తట్టి సెలవు తీసుకు వెనక్కి తిరిగింది సుమతి. రూప చది

చప్పుడు లేకుండా తాళం తీసి లోపలి కెళ్ళింది.




ఎక్కడికే బయలుదేరావు ?" ముస్తాబయి చెప్పులు వేసుకుంటున్న రూపని తీక్షణంగా చూసింది పద్మావతి.

"అమ్మా ఒక్కసారి సురేష్ వాళ్ళింటి కెళ్ళి వాళ్ళ నాన్నగారితో మాట్లాడాలి. అరగంటలో వచ్చేస్తాను"

"ఏమిటీ ... యింకా సిగ్గులేకుండా వాళ్ళింటికి వెళ్ళి వాళ్ల నాన్నతో మాట్లాడతావా ? ఏం మాట్లాడతావే" కరకుగా అడిగింది.

"అంతా వాళ్ళ వాళ్ళకి తెలియాలి. నే వెళ్ళి మాట్లాడాలి"

"చాలు చేసిన నిర్వాకం చాలు. నీ వెళ్ళి మాట్లాడినంత మాత్రాన ఆ తండ్రి మంగళసూత్రం కట్టించడు. మీ నాన్నకి తెలిస్తే చంపుతారు. నోరు మూసుకు లోపలికెళ్ళు. ఇప్పటికే మీ నాన్న చేతిలో తిట్లు తినలేక చస్తున్నాను. ఈ సంగతి తెలిస్తే నా ప్రాణం తీస్తారు. నే పడలేని గోల. వెళ్ళాలంటే మీ నాన్నని అడిగి వెళ్ళు" పద్మావతి కోపంగా అంది.

రూప తల్లివంక ఒక్క నిమిషం చూసి "అమ్మా ! ఇది నా జీవిత సమస్య. నా సమస్యని నేనే పరిష్కరించుకుంటాను. నాకు అడ్డు చెప్పకు. నాన్న అడిగితే నేనే చెపుతాను జవాబు" తల్లి జవాబుకి ఎదురు చూడకుండా వెళ్ళిపోయింది రూప. కూతురి మొండితనానికి, ఆ ధైర్యానికి విస్తుపోయి చూస్తూ వుండిపోయింది పద్మావతి.

లాయరు రామనాధంగారిల్లు మేడ ఇల్లు. ఆయనకి లాయరుగా సంపాదించిందే కాక పిత్రార్జితం కాస్తో కూస్తో వుంది. ఇద్దరు మగపిల్లలు, ముగ్గురు ఆడపిల్లలు ఆయనకి. పెద్ద కూతురుకి మాత్రం పెళ్ళి అయింది. పెద్దకొడుకు ఇంజనీరింగు పాసయి మొన్ననే ఉద్యోగంలో చేరాడు. సురేష్‌తో పాటు ఆడపిల్లలంతా ఇంకా చదువులలో వున్నారు. పెద్ద స్థితిమంతులు కాకపోయినా దేనికి లోటులేని సంసారం వారిది.

రూప వాళ్ళింటికెళ్ళే సరికి వీధి వరండాలో రామనాధంగారు కూర్చుని కాఫీ తాగుతున్నారు అప్పుడే కోర్టునించి వచ్చి. ఆయన భార్య శారదాంబ పక్కనే మరో కుర్చీలో కూర్చుని మాట్లాడుతూంది. రామనాధంగార్ని చూడగానే సురేష్ తండ్రిని పోలాడని పోల్చింది రూప. నలభై ఏళ్ళ వయసులోనూ మంచిరంగులో వడ్డు పొడుగ్గా భారీగా వున్నాడాయన. బట్టతల అయినా మంచి వర్ఛస్సుంది ఆయన మొహంలో. ఆయన ముందు ఆయన భార్య చాలా పొట్టిగా పీలగా చామనఛాయ రంగులో అనాకారిగావుందనిపించింది రూపకి.

గేటు దాటి లోపలికొచ్చిన రూపని ఇదరూ కుతూహలంగా చూశారు. కూతురి కోసం ఎవరో స్నేహితురాలు వచ్చి వుంటుందను కున్నారు. "నమస్కారమండీ" అంది రూప జంకుగొంకు లేకుండా.

"ఎవరికోసం అమ్మాయి? మా నళిని







కోసమా?" అంది శారదాంబ.

"కాదండి నేను...సురేష్..."

"ఓహో సురేష్ క్లాస్‌మేట్‌వా? ఏం కావాలి ఏదన్నా నోట్సులు అవి..వాడింట్లో లేడే" అంది మళ్ళీ ఆవిడే రూపని కుతూహలంగా చూస్తూ.

"నేను అతనికోసం రాలేదు. మీతో మాట్లాడాలని వసుండి వచ్చాను" రామనాథంగారి వంక సూటిగా చూస్తూ అంది రూప. ఆయన ఆశ్చర్యంగా "నాతో మాట్లాడాలా!?" అన్నారు.

"అవునండీ" అంది రూప.

ఆయన, భార్య మొహాలు చూసుకున్నారు. "ఏ విషయంలో?" అన్నారాయన కాస్త గంభీరంగా "మీ సురేష్ విషయం" రూప సూటిగా అంది.

మరోసారి ఇద్దరూ మొహాలు చూసుకున్నారు.ఇద్దరి మొహాలు రంగుమారాయి.

"మా సురేష్ విషయం...ఏమిటది? ఇంతకీ నీవెవరు అమ్మాయివి?" ఆయన

ప్రశ్నలో కుతూహలంతో పాటు ఆరాటం తొంగిచూసింది.

"మీతో కాస్త రహస్యంగా ఒక విషయం చెప్పాలి. ఇక్కడే మాట్లాడవచ్చా?" ఆయన ఒక్క నిమిషం ఆలోచించి కుర్చీలోంచి లేచి "లోపలికి రా అమ్మాయి. ఒసేయ్, నా ఆఫీసు గదిలోకి తీసికెళ్ళు ఈ అమ్మాయిని" అన్నారాయన.

లోపలికెళ్ళగానే రూప తన వివరం, సురేష్‌కి, తనకి మధ్య జరిగింది అంతా సూటిగా చెప్పేసింది. అంతా వింటున్న భార్యాభర్తల మొహాలు పాలిపోయాయి. కలవరపడ్తూ ఇద్దరూ మొహాలు చూసుకున్నారు. రూప అంతా చెప్పడం పూర్తి చేయగానే రామనాధంగారు తన లాయరు తెలివితో చప్పున మొహంలో భావం మార్చేసి గంభీరంగా "అయితే ఇప్పుడు నన్నేం చేయమంటావు?" అన్నారు తెలివిగా.

ఆ గడుసుదనం చూసేసరికి రూపకి ఒళ్ళు మండింది. నిమ్మకు నీరెత్తినట్టు ఏం చెయ్యమంటావు అనడుగుతుంటే ఆ నిబ్బరానికి ఆశ్చర్యపడింది.

"మీరు న్యాయవాదులు. ఒక ఆడపిల్లకి జరిగిన అన్యాయానికి న్యాయం విచారించి న్యాయం చేకూర్చగలరేమోనన్న ఆశతో వచ్చాను. సురేష్‌ని మందలించి బుద్ధిచెప్పి పెళ్ళిచేసి నాకు సహాయపడారన్న ఆశతో వచ్చాను" అంది గంభీరంగా.

"చూడమ్మాయీ — నీ పేరేమిటన్నావు రూపా... చూడు నీవు మా సురేష్‌తో తిరిగే ముందు నాకు చెప్పి నా పర్మిషన్ తీసుకుని వాడిని ప్రేమించి వాడితో తిరిగావా?" లా పాయింటు తీసి గంభీరంగా అడిగాడాయన. శారదాంబ కొడుకింత పని ఎలా చేశాడాని విస్తుపోతూంది. ఇరవై రెండేళ్ళ సురేష్ ఆవిడకింకా స్కూల్లో చదువుకునే కుర్రాడిలాగే అనిపిస్తుంది. కొడుకింతవాడయ్యాడని ఆవిడ ఆశ్చర్యపోతూంది.

"నిజమేనండీ! ప్రేమించే ముందు తల్లితండ్రుల పర్మిషన్ తీసుకుని ప్రేమించాలని నాకు తెలియక మీ అబ్బాయి ప్రేమని నమ్మానండి. మా ప్రేమ పెళ్లిదాక దారి తీస్తుందని నమ్మానండీ" తెలివిగా ప్రశ్నించిన ఆయనమీద వ్యంగ్యంగా విసురు విసిరింది రూప. ఆయన మొహం మాడింది ఆ జవాబుతో.

"చూడమ్మాయ్! ఆడపిల్లవు నీవు ముందు జాగ్రత్త లేకుండా కుర్రాళ్ళతో తిరగడం నీ తప్పు. దానికి నన్నెలా బాధ్యుడిని చెయ్యాలనుకుంటున్నావు?"

"మిమ్మల్ని బాధ్యుడిని చెయ్యాలనుకోడంలేదు. బాధ్యతగలతండ్రిగా కొడుక్కి బుద్ధిచెప్పి బాధ్యత నేర్పగలరనివచ్చాను" అంది రూప కరుకుగా. రూప తను అనుకున్నంత తెలివితక్కువది కాదని, మాటకి మాట జవాబివ్వగలదు భయం లేకుండా అని రామనాధంగారికి అర్థమైంది.

"నీవు — సురేష్ కల్సి తిరిగినట్టు, వాడు నిన్ను పెళ్లి చేసుకుంటానన్నట్లు, నీ పుట్టబోయే బిడ్డకి వాడే తండ్రనడానికి నీ దగ్గిర ఏమన్నా సాక్ష్యాలు, ఆధారాలున్నాయా? ఉత్తరాలు గట్రా ఏమన్నా వున్నాయా?" లాయరు తెలివితో ముందు చూపుగా వివరం రాబట్టడానికి అడిగాడాయన. రూపకి ఆ సంగతి అర్థమైంది. ఒక్కసారిగా గత పదిహేను రోజులలో రూప మానసికంగా చాలా ఎదిగిపోయింది.

సురేష్ ఇచ్చిన షాక్‌తో ఆమెలో

మానసిక పరిణత ఒక్కసారిగా వచ్చింది. సినిమాలు, షికార్లు, ఫేషన్స్ పుస్తకాలు ఇవే ప్రపంచంగా తిరిగిన రూప ఒక్కసారిగా ఈ ప్రపంచంలో కళ్ళు తెరిచి చుట్టూ లోకాన్ని చూసి చాలా నేర్చుకుంది. నిన్న సుమతితో మాట్లాడాక ఆవిడడిగిన లా పాయింట్లు అవి చూసి రామనాథం గారు ఎందుకు ఆ వివరం అడుగుతున్నారో చప్పున పోల్చుకుంది.

''మేం ఇద్దరం కల్సి తిరిగినట్టు రుజువులు, సాక్ష్యాలు కావాలా? పదండి, మేము గడిపిన హోటళ్ళలో వారిచేత చెప్పిస్తాను. మమ్మల్ని చూసిన పెద్దమనుషులని పిలిపించమంటారా? చెప్పండి. నా పుట్టబోయే బిడ్డకి తండ్రి మీ అబ్బాయా కాదా అన్న దానికి సాక్ష్యం కావల్సివస్తే మీరు తిన్నగా దేముడి దగ్గరకెళ్లి అడిగి రావల్సి వుంటుంది'' రూప హేళనగా అంది.

ఆ వ్యంగ్యానికి, విసురుకి రామనాథం గారి మొహం నల్లబడింది. రూపని మింగేసేట్టు చూశాడు.

"ఇదిగో అమ్మాయీ ! చేసిన పనికి సిగ్గుపడాల్సింది పోయి ఇలా బరితెగించి మాట్లాడడం బాగులేదు. పెద్దంతరం, చిన్నంతరం లేకుండా మాట్లాడుతున్నావు. దీన్నిబట్టే తెలుస్తుంది నీ సంగతి. నీ కిష్టమయి మా వాడితో తిరిగావు. నిన్ను వాడు బలవంతపెట్టాడా ? నీ కిష్టం లేకపోతే ఏ మగాడన్నా ఇంత దూరం వెళ్ళగలడా? ప్రేమలు-పెళ్ళికి ముందు సెక్సు ఇవన్నీ చేసి ఇప్పుడు మా ఇంటిమీదకి పోట్లాటకి వస్తావా? వెళ్లు వెళ్లు నీలాంటి అమ్మాయిని పరువు ప్రతిష్ఠ కల మా యింటి కోడలిగా చేసుకుంటే కొరివితో తలగోక్కున్నట్టే. ఇంతకీ సురేష్ లేడు. నీ మాటలు నిజాలో అబద్ధాలో మాకు తెలియదు. మమ్మల్నిలా బ్లాక్ మెయిల్ చేయాలని చూస్తున్నావేమో! అసలు నిన్ను కాదు నీ తల్లిదండ్రులననాలి. ఆడపిల్లని విచ్చలవిడిగా రోడ్ల మీద వదిలి, ఇప్పుడు నెలతప్పావు కనక మా ఇంటిమీదికి తోలారా? కట్నంలేకుండా పెళ్లి చేసుకోడానికి ఇదో ఎత్తు అని ఎక్కడో చదివాలే" రూపని తిరస్కారంగా చూస్తూ హేళనగా, నిరసనగా ఎత్తి పొడిచారాయన. అవమానానికితగిన శాస్తి చేసినట్లు గర్వంగా భార్యవంక చూశాడాయన. రూపకి అది అర్థమైంది.

''అయ్యా రామనాథంగారూ! మావాళ్ళు మీరడిగిన కట్నం డబ్బులు ఇచ్చుకోలేనంత దరిద్రులు కారు. మీ కొడుక్కి కట్నమే కావాలంటే ఆ మాట డైరక్టుగా చెప్పకుండా ఈ డొంకతిరుగుళ్లెందుకండీ. ఈనాటి దానికి వంశాలు, గౌరవాలు ఎందుకు ? నేను మంచిపిల్లగా, పరువు ప్రతిష్ఠ కల కుటుంబంనించి వచ్చినదానిగా చెలామణీ కావడానికి మా వాళ్ళెంత ఇచ్చుకోవాలో చెప్పండి. మీ అబ్బాయిని కొనుక్కోగల శక్తి మాకు వుందో లేదో చూసుకుంటాం". ఆయన కొట్టిన దెబ్బకి ఎదురుదెబ్బ తగిలింది. మరోసారి ఆయన మొహం నల్లబడింది. "ఇదిగో అమ్మాయి ! ఊరుకుంటుంటే మరీ రెచ్చిపోతున్నావు. మా గుమ్మంలోంచి కదులు ఇలాంటి బజారు సరుకు అని తెలియక లోపలికి రానిచ్చాను-వెళ్లు వెళ్లు-"

''అయ్యా! ఇలాంటి బజారు సరుకు అమ్మాయి కడుపునే మీలాంటి గొప్ప వంశం నిలిపే వంశోద్ధారకుడు పుట్టబోతున్నాడు. మీ గొప్ప రక్తం అలా

బజారు పాలు చెయ్యకుండా వుండాలనే మీ యింటి కోడల్ని అయి మీ వంశ గౌరవం, మీ వంశోద్ధారకుడ్ని కాపాడా లనుకుని వచ్చాను. మాటలు చిత్తం వచ్చి నట్లు జారకండి సార్..."

"నిన్నా...కోడలిగానా..."ఛీత్కారం చేసి హేళనగా నవ్వాడు.

"ఏం- మీ కొడుకు అర్హతలకి తగ నంటారా?" రూప వ్యంగ్యంగా అడిగింది.

"తగవు. పెళ్ళికి ముందు మగాళ్ళతో తిరిగి కడుపులు చేయించుకునే రకాలు మా యింటి కోడళ్ళు ఎన్నటికీ కారు..." మొరటుగా అన్నాడాయన.

"మరి మీ అబ్బాయీ పెళ్ళికి ముందు తిరిగి, అమ్మాయిలకి కడుపులు చేసే రకమే కదండీ. ఓ మంచి యింటి అల్లు డెలా అవుతాడండీ? ఇంతకంటే గొప్ప వంశ మర్యాద కలవాళ్ళు అల్లుడిగా ఎలా చేసుకుంటారండీ?" రూప హేళనగా నవ్వింది.

"వాడు మొగాడు..."

"ఓహో! మగాడు కడుపులు చేసే తప్పులేదుగాని, ఆడది చేయించుకుంటే తప్పన్నమాట. అలాంటి ఆడది చెడిపోయిన రకం అన్నమాట. అవన్నీ పాతకాలం మాటలు సార్..."

"ఛా ... ఛా ... నీలాంటి పిల్లతో మాట్లాడం నాది బుద్ధి తక్కువ..." ఆయన కోపంగా లేచి నిల్చుని, వణికిపోతూ .... "వెళ్లు ముందు మా ఇంట్లోంచి వెళ్ళు. నీ ఆటలు నా దగ్గర సాగవు. మా వాడ్ని వెర్రివాడిని చేసి వలలో వేసుకొని పెళ్ళాడుదామని ఎత్తు వేశావు. అది సాగక పోయేసరికి, వాడొప్పుకోక పోయేసరికి యిలా బెది రించాలని వచ్చావు. నీ సంగతి అర్థమైంది వెళ్ళు వెళ్ళు." అన్నారు ఆవేశంగా.

"ఇదే మీ ఆఖరి మాటా ... మీరు పెద్దమనుషులు, న్యాయవాదులు, కొడుకు చేసిన తప్పు సరిదిద్ది ఓ ఆడపిల్లకి న్యాయం చేకూరుస్తారని ఆశపడి వచ్చాను. కాని కొడుకుని మించి, అలాంటి కొడు కుని వెనకేసుకు వచ్చి, కొడుకు తప్పు కప్పి పుచ్చుకుంటూ ఒక ఆడపిల్లని అసభ్యంగా, పరుషంగా మాటలతో రెచ్చ గొట్టేటంత నీచానికి దిగజారే పెద్ద మను షులని తెలియక వచ్చాను. ఒక్క సంగతి మాత్రం చెప్పి వెళ్లాలని వచ్చాను లాయరుగారు; మేం ఇద్దరం కల్సి చేసిన తప్పో, పొరపాటో...ఇద్దరం కల్సే చేశాం దానికి నన్నొక్కరినే బాధ్యురాలిని చేసి వేలెత్తి చూపి దోషిగా నిర్ణయించడం నేను సహించను. లోకం ముందు నాతో పాటు మీ అబ్బాయినీ దోషిగా నిలబెడ తాను. ఇద్దరూ కల్సిచేసిన పనిలో ఆడదే తరతరాలుగా నష్టపోతూంది. మగవాడె ప్పుడూ తప్పించుకుని పోతున్నాడు. కాని నేను మాత్రం అంత సుళువుగా మీ అబ్బా యిని తప్పించుకుని పోనీయను. నాతోపాటు మీ అబ్బాయీ నలుగురి ముందు దోషిగా నిలవాలి. నా కష్ట నష్టా లలో అతనూ సగభాగం పంచుకునేట్టు చేస్తాను. ఈ విషయంలో అవసరమైతే కోర్టుకి వెడతాను. అందినంతవరకు అనుభవించి, ఆకలితీరిన తరువాత విస రాకు విసిరేసినట్లు విసిరేస్తే వూరుకో డానికి నేను పాతతరం అమ్మాయిని కాదు. ఈ తరం ప్రతినిధిని. నా బిడ్డకు తండ్రి అని న్యాయస్థానంలోనే నిరూపించి న్యాయం కోరతాను. అంత దూరం వెళ్ళ కుండా మీరేమన్నా చెయ్యగలరేమోనన్న భ్రమతో వచ్చాను."

"బెదిరిస్తున్నావా? కోర్టుకెక్కుతావా?" ఆయన మొహం ఎర్రబడి పోయింది.

"తప్పకుండా. సజావుగా పరిష్కారం కాని సమస్యలకి కోర్టుకి వెళ్ళుతారన్నది లాయరైన మీకు నేను చెప్పాలా?"

"ఇదిగో అమ్మాయి విను. నేనూ లాయర్ని. కోర్టులు గురించి నీవు చెప్ప క్కర లేదు. నీ మాటలన్నీ అబద్ధాలని నేను నిరూపిసాను. జైలుకి పంపిసాను బ్లాక్‌మెయిల్ చేశావని'' బెదిరించాడు.

"సరే! మన బలాబలాలు కోర్టులోనే తేల్చుకుందాం." రూప లేచినిల్చుంది. బెదిరిస్తే భయపడుందనుకున్న రూప నిబ్బరంగా అలా మాట్లాడి వెళ్ళడానికి లేవగానే ఆయన కాస్త జంకాడు. కలవర పాటుతో భార్య వంక చూశాడు. ఆవిడ ఇంత సేపూ జరుగుతున్నది వింటూ ఆరా టంగా, భయంగా, ఆదుర్దాగా ఏం అనాలో తెలియక గాభరాగా చూస్తుంది. రూప విస విస నడిచి రోడ్డెక్కింది. భార్యాభర్తల మొహాలు కళతప్పి నల్లబడ్డాయి.

* * *

"రూపా..." విశ్వానాధంగారి కేకతో ఇల్లంతా అదిరిపోయింది.

ఆఫీసుకెళ్ళిన భర్త మరో గంటలోనే ఇంటికి ఎందుకు వచ్చారు. ఒంట్లో బాగు లేదా అనడగ బోయిన పద్మావతి ప్రశ్న నోట్లోనేవుండి పోయింది. అప్పుడు తల్లీ, కూతురు ఇద్దరూ డైనింగ్ టేబిల్ దగ్గర భోంచేస్తున్నారు. ఆ కేకతో హడలి పోయారు ఇద్దరూ. రూప తండ్రివంక బెరుగ్గా చూసింది. ఆయన మొహం ఎర్ర బడి వుంది. మనిషి చెమటలు కక్కు తున్నాడు. "నిన్న లాయర్ రామనాధం గారింటి కెళ్ళావా?" గర్జించారాయన. తండ్రి కెలాతెల్సిందా అని తెల్లపోయింది రూప. భర్తకి ఆ విషయం తెల్సిపోయి నందుకు, రూపని ఇంట్లోంచి ఎందుకు పంపావు అని తనమీద విరుచుకు పడతా డని పద్మావతికి భయంతో కాళ్ళు, వణి కాయి. రూప తలదించుకుంది.

"జవాబు చెప్పు. ఎందుకెళ్ళావు వాళ్ళ ఇంటికి? నా పరువు నడిబజార్లో పెట్ట డానికి వెళ్ళావా? నా పేరు, నీ పేరు కోర్టు కీడ్చడానికి తయారయ్యావా? నీకెంత సాహసం, ఎంత ధైర్యం. నిన్నసలు గుమ్మం కదలడానికి వీలులేదన్నాను అసలు ఇంట్లోంచి ఎందుకెళ్ళావు. ఎలా వెళ్ళావు. అసలు నీవు దాన్ని ఇంట్లోంచి ఎందుకు కదలనిచ్చావు. ఇంత జరిగినా ఇంకా నీకు బుద్ధిరాలేదా? కూతుర్ని ఆ మాత్రం అదుపులో పెట్టుకోలేని దానివి నీవేం తల్లివి. నేను అది గుమ్మం కదల డానికి వీల్లేదని మరీమరీ చెప్పినా నా మాట లక్ష్య పెట్టకుండా దాన్ని నాకు తెలియకుండా బయటి కెందుకు వెళ్ళ నిచ్చావు ?" భార్యని తీక్షణంగా చూస్తూ మండిపడ్డా రాయన. పద్మావతి తలదించు కుంది. "అసలు దాన్నికాదు నిన్ననాలి. పిల్లలని నీ చేతులారా నీవే పాడుచేస్తు న్నావు" అరిచారాయన.

"వద్దన్నా వినకుండా వాళ్ళ నాన్నతో మాట్లాడి వస్తానని వెళ్ళింది. నన్నేంచెయ్య మంటారు. ఇటు మీరు అటు అది ఇద్దరూ నా ప్రాణాలు తీస్తున్నారు. మధ్య నేను చస్తున్నాను. ఇంతకీ ఏమయింది?"

"ఏమవాలే ఇంకా? ఇంకా అవడానికి ఏం మిగిలిందే. నీ కూతురు చేసిన వెధవ పనికి సిగ్గుపడి ఏడవాల్సిందిపోయి కోర్టు కెక్కుతుందిట. ఆ కుర్రాడిని నలుగురిలో

నిలబెట్టి దానికి పుట్టబోయే బిడ్డకి తండ్రి అని నిరూపిస్తుందిట. మర్యాదగా పెళ్ళాడకపోతే వాళ్ళ పరువు కోర్టుకీడుస్తానని బెదిరించి వచ్చిందట నీ కూతురు నిన్న వాళ్ళ ఇంటికి వెళ్ళి. ఆ పెద్దమనిషి ఇవాళ మా బ్యాంక్‌కి వచ్చి నలుగురిలో నన్ను పట్టుకుని మొహం ఈడ్చాడు. కూతుర్ని



జాగ్రత్త పెట్టుకో లేక బజార్న వదిలారు. మా అబ్బాయితో మేం తిరగమన్నామా, కడుపుచేయించుకోమన్నామా? ఇప్పుడు మా ఇంటి మీదకి తోలారా, ఏం పెద్దమనిషివయ్యా. ఆడపిల్లని అదుపులో పెట్టుకోడం చేతకాక మా వాడిమీద ఏడ్చి ఇప్పుడు దమ్మిడి కట్నం ఇవ్వాక్కర లేకుండా పెళ్ళాడడానికి ఎత్తేసి మమ్మల్ని కోర్టుకీడుస్తాం అని బెదిరిస్తారా - అంటూ దుయ్యబట్టి నలుగురిలో నా మొహాన పేడ నీళ్ళు కొట్టాడు. నీ కూతుర్ని జాగ్రత్త పెట్టుకో. పరువు నష్టం దావా వేస్తాను.

అని బెదిరించాడు. నా పరువు మర్యాద ఇంకేమన్నా వుందా. రేపు పొద్దుట ఆఫీసులో మొహం ఎలా ఎత్తుకు తిరుగుతాను. ఏమిటే ఇదంతా, ఏమిటే ఈ భాగోతం." ఆయన గొంతు ఆవేశంతో వణికింది. జరిగింది విన్నాక పద్మావతికి పట్టరాని కోపం వచ్చింది. కూతుర్ని తీక్షణంగా చూసి "నిన్న నేను అడిగితే ఇదంతా నాకు ఎందుకు చెప్పలేదు. సురేష్ ఇంట్లోలేడు! అతనొచ్చాక మాట్లాడుతాం అన్నారని నాతో ఎందుకబద్ధం చెప్పావు."

"ఆ సంగతి అలావుంచు. అక్కడికెళ్ళి పుట్టబోయే బిడ్డ అంటూ వాగింది. అదేమిటి? ఉత్తి బెదిరింపా, నిజమా కనుక్కునీయీడు" కూతురివంక తిరస్కారంగా, ఏహ్యంగా చూసి ఆమెతో మాట్లాడడం ఇష్టంలేనట్టు భార్యతో అన్నారు. విశ్వనాథం. పద్మావతి మొహం తెల్లగా పాలిపోయింది. "ఏమిటే! ఇది నిజమా, అబద్ధమా? ..." అంది. రూప తల దించుకుంది ఆ మొహం చూడగానే పద్మావతికి సంగతి అర్థమై పోయింది.

ఆమె గొంతు తడారి పోయింది. "ఊరివాళ్ళ దగ్గిర చాటుకొచ్చావు. మా దగ్గిర దాపరికం ఎందుకే? చెప్పు...అది నిజమేనని చెప్పు. ఇన్నాళ్ళూ ఏదో వుత్తి తిరుగుడే ననుకున్నాను. ఇదీ జరిగిందన్న మాట. ఎంతదానివే. నా దగ్గిర ఇంత దాస్తావా? నీ కోసం ఇన్ని తిట్లు, చివాట్లు సహించాను. నా దగ్గిర దాచి నన్ను మోసం చేసావుటే. నీ మొహానికి సిగ్గెలా లేకపోయిందే. ఇలాంటి వెధవ పనిచేసి అంత నిబ్బరంగా ఎలా వున్నావే"

పద్మావతికి కోపం, దుఃఖం, ఆవేశం అన్నీ ఒక్కసారి వచ్చేశాయి. కాళ్ళు వణుకుతూంటే చప్పున కుర్చీలో కూలబడింది.

"నిబ్బరంగా వుండకేమే- దానికేం ఏడవాల్సింది మనం, ఇలాంటి కూతుర్ని కన్నందుకు లోకానికి మొహాలు చూపలేక సిగ్గుతో మొహం దాచుకోవాల్సింది మనం. దానికేం కోర్టు కెక్కుతుంది, కేసులు పెడుతుంది...పిల్లాడ్ని కంటుంది. అది సిగ్గు, బిడియం వదిలింది" తల్లి, తండ్రి ఒకరి తర్వాత ఒకరు ఈ దెబ్బలాంటి మాటలు విసురుతూంటే రూప తల దించుకుని నిలబడింది. ఏం పట్టనట్టు అంత నిబ్బరంగా వున్న కూతురిని చూసేసరికి విశ్వనాథం గారికి మరింత తిక్కరేగింది.

రూపలో పశ్చాత్తాపం, భయం, సిగ్గు, దుఃఖం ఏదయినా కనపడి తప్పు చేశానని భయంగా ఒప్పుకుని వుంటే ఆయనకి కొంత ఉపశమనంగా వుండేది. రూప అలా మొండిగా, ధైర్యంగా అరుచుకోనీ వాళ్ళని అన్నట్టు నిలబడేసరికి ఆయన ఆవేశం పట్టలేక పోయారు. ఒక్క ఉదుటున కూతురు దగ్గిర కెళ్ళి ఆమె జుత్తు పట్టుకుని లాగి తల పైకెత్తి "చెప్పు నిజం చెప్పు. చంపేస్తా ఇవాళ నిన్ను... నిజం చెప్పు...వాళ్ళింట్లో అన్న మాటలన్నీ నిజమేనా...". రూప తండ్రి వంక తిరస్కారంగా చూసింది. అది చూసేసరికి మరింత ఉద్రేకం వచ్చిందాయనకి. ఎడం చేతో జుత్తు పట్టుకుని, కుడిచేత్తో ఫెడీ ఫెడీ మని చెంపమీద కొట్టసాగారు.

"తప్పయిందను. సే సారీ తప్పుచేశానని కాళ్ళు పట్టుకో...ఊ చెప్పు". పద్మావతి చప్పున లేచి భర్త దగ్గరకి వచ్చి ఆయన చెయ్యి పట్టుకుని "ఏమిటండీ ఆ కొట్టడం

ఛస్తుందో, బతుకుతుందో తెలీకుండా అలా కొట్టుకుంటారా? వదలండి ముందు దాన్ని..." భర్తని విడిపించడానికి పెనుగులాడింది.

"వదలను. దీని అంతు చూస్తానివాళ.. చేసిన వెధవ పని చాలక ఊరూ వాడా వెళ్లి చాటి వస్తుందా. వాళ్ళ దగ్గర కూసిన కూతలు రేపటికి ఎన్నినోళ్లు మారుతాయో తెలుసా? ఇంక మనం ఎలా మొహం ఎతుకుంటామే? తప్పు చేసింది ఏదో మన దగ్గిర ఏడిస్తే కన్న పాపానికి ఏదో చేసే వాళ్ళం. కడుపు చించుకుంటే కాళ్ళమీద పడుందని కడుపులో ఆ పాపం దాచుకునే వాళ్ళం. ఇప్పుడిలా ఊరు వాడ చాటాక ఇంక మనం ఎలా మొహం ఎత్తుకుం టామే. ఈ చెడ్డినదాన్నిఎవడు పెళ్ళాడు తాడే...జన్మంతా దీన్ని గుండెల మీద కుంపటిలా భరించాల్సిందేనా ?" రూప విసురుగా తల విదిల్చి "మీ భయం అదా...అక్కరలేదు, నా బతుకు నేను బతకగలను. మీకు అంత భారంగా వుంటే ఈ క్షణమే ఇంట్లోంచి పోతాను"

విశ్వనాథంగారు మరోసారి చెంపలు ఛెళ్ళు మనిపించారు. "నోర్మూయ్..ముండా నోట్లోంచి మరోమాట వస్తే చంపేసాను. పౌరుషానికి లోటు లేదు. ఇంట్లోంచి పోతుందిట. దాని బతుకు అది బతుకు తుందిట. నీ బోడి బి.ఏ. చూసి ఉద్యో గాలు ఒళ్ళో వాలుతాయి. నోరు మూసు కుని పడివుండు చచ్చినట్టు. నోరు మెది పావా జాగ్రత్త..." ఆయన కూతుర్ని వదిలి కుర్చీలో కూర్చున్నారు. పద్మావతి తల పట్టుకుంది. "భగవంతుడా... ఏం దారి? నా కాళ్ళు చేతులు ఆడడం లేదు. ఇప్పుడేం చెయ్యడం...రూపా ఏం పని చేశావే" పద్మావతి మొహం ఎర్రబడి ఒళ్ళంతా చెమట పట్టింది. రూప రెండు చెంపలూ కందిపోయి వాతలు తేలాయి. బలవంతంగా, మొండిగా కన్నీళ్ళు ఆపు కుంది. ఆమె గుండెలు ఎగిసి పడు తున్నాయి.

"ఏం చేస్తావు? కన్న పాపానికి దాన్ని తీసికెళ్ళు ఏ డాక్టరు దగ్గరికో"

"వీల్లేదు. అది నేను ఒప్పుకోను" రూప నిష్కర్షగా అంది.

ఇద్దరూ తెల్లపోయి కూతుర్ని చూశారు.

"ఏదీ ఒప్పుకోవు" పద్మావతి అర్థం కాక తెల్లపోతూ అడిగింది.

"నేను డాక్టరు దగ్గరకి రాను. ఎబార్షన్ చేయించుకోను. ఆ సురేష్‌కి బుద్ధి చెప్పాలంటే నేనీ బిడ్డను కనాలి..." రూప తెగేసి అంది. తల్లి, తండ్రి ఇద్దరూ కూతురికి పిచ్చి పట్టలేదు కదా అన్నట్టు చూశారు. "వాణ్ని కోర్టు కీడ్పించి వాడి పరువు బట్టబయలు చెయ్యాలి. వాడు జన్మంతా మరిచిపోలేని శాస్తి జరిగేవరకు నేనూరుకోను" కసిగా అంది రూప. విశ్వనాథంగారు, పద్మావతి కూతురి మొండి మాటలు చూసి విస్తుపోయారు. వాళ్ళిద్దరి నోటెంట కొద్దిసేపు మాటలు రాలేదు.

"దీనికి నిజంగా పిచ్చి పట్టిందే... ఏమిటే దాని ఉద్దేశం. పెళ్ళి కాకుండా బిడ్డను కంటుందా ? వాణ్ని కోర్టు కెక్కి స్తుందా? ఏమిటే దీని మాటలు ఇలా తయారైందేమిటి?" విశ్వనాథం గారు కోపంగా వగరుస్తూ అన్నారు.

కూతురి వరస చూసి పిచ్చి రూపకి పట్టిందో ఆయనకే పట్టిందో అర్థంగాలే దాయనకి. "మీరూరుకోండి. దానికి మతి చెడింది. దాని పిచ్చివాగుడు చూసి మీరూ



దాంతో సమంగా చిందులు వేస్తున్నారేమిటి. దానికి ఏంకావాలో, మంచేమిటో చెడేమిటో తెలిస్తే ఇలా ఎందుకు చేస్తుంది. ఇరవై యేళ్లు వచ్చినా వయసుకి తగ్గ బుద్ధి రాకుండా గొప్పగా వెర్రివాగుడు వాగుతుంది. బిడ్డని కంటుందిట. మతివుండే మాటలా అవి. అడ్డమైన చెత్తాచదివి ఏదో తెలివితేటలుగా మాట్లాడుతున్నాననుకుంటోంది. బైటికెడితే దాని మొహాన అందరూ ఉమ్మేస్తారన్న జ్ఞానం వుంటే ఇలా మాట్లాడుతుందా?" పద్మావతి తీవ్రంగా అంది. "ఆడది గుట్టుగా ఇంట్లో వున్నంతసేపే మర్యాద. వీధినపడితే రోడ్డుమీద కుక్కకి కూడా తక్కువే. దానికా సంగతి తెలియకుండా వుంది"

"ఆ. ఇలాంటి పిరికి మాటలుచెప్పే ఆడపిల్లల్ని ఇలా తయారుచేశారు ఇన్నాళ్ళూ.

పుట్టిందగ్గిర నించి ఆడపిల్ల - ఆడపిల్ల అంటూ భయపెట్టి; నీతి, శీలం గీలం అంటూ ఆడపిల్ల నెత్తినమొట్టి మగాడు వాడికేం మహారాజు, ఏం చేసినా చెల్లు తుంది అంటూ అందలం ఎక్కించి; ముందు నించీ వాడికి కొమ్ములిచ్చారు. ఆడపిల్లని అణగదొక్కారు. అమ్మా! నీవు ఆడదానివై వుండీ అలా మాట్లాడకు దయచేసి, ఆడదానికి ఆడదే శత్రువవుతూంది" రూప తిరస్కారంగాఅంది. "నేననేదేమిటే, ప్రకృతే స్త్రీని మానసికంగా, శారీరకంగా బలహీనురాలిని చేసింది. ఎంత సమానత్వం కబుర్లు చెప్పినా ఆడది ఆడదే, మగాడు మగాడే. నీ విషయంచూడు. ఆ సురేష్‌ని ఎవరూ ఏమి అనరు రేపు. ఆడపిల్ల జాగ్రత్తగా వుండద్దా అని నీ మొహాన్నే వుమ్మేస్తారు. సురేష్ తప్పించుకున్నాడు చేసిన పాపం నించి.. కాని ఆ పాపం ముద్ర నీమీద నిలిచి పోయింది. ఆ పాప ఫలం నీవు మోస్తున్నావుగాని సురేష్ మొయ్యడు. నీ భవిష్యత్తు నాశనం అవుతుంది. వాడు మహారాజులా మరో దాని పెళ్ళాడుతాడు. ఈ సంఘంలో పెళ్ళి కాకుండా బిడ్డని కని పెంచడం ఇవన్నీ పుస్తకాల్లో మాటలు. నిజంలో జరుగుతా యనుకుంటున్నావా?" ఆవేశంగా అంది పద్మావతి.

"ఎందుకు జరగదో చేసి చూపిస్తాను. ఆ పాతకాలం మాటలన్నీ ఇంకచెల్లవని, ఈనాటి అమ్మాయిలు అబ్బాయిల కంటే దేన్లో తక్కువకాదని, నీతి శీలాలు ఆడదానికే కాదు మగాళ్ళకీ వుండాలని, తప్పుచేసి ఆడదాన్ని దోషిగా నిలబెట్టి తప్పించుకు పోయే మగాళ్ళకి పాఠం నేర్పుతాను. పాపమో, తప్పో, వాప్పో, ఇద్దరం కల్సి చేశాం. నాకు యీ సంఘం, లోకులు భవిష్యత్తు లేకుండాచేస్తే ఆ సురేష్‌కి లేకుండా చెయ్యాలి. మీ పరువు నాపరువు అన్నీ పోయినా సరే ఆ సురేష్‌ని వదలను వాడికి పాఠం చెప్తాను. ఈనాడు సురేష్‌కి నేర్పిన పాఠం మగాళ్ళందరికీ గుణపాఠం అవాలి. దాని కోసం నా జీవితం ఏమయి పోయినా నాకు లెక్కలేదు. నాలాంటి మోసపోయిన ఆడపిల్లలందరూ పిరికి వాళ్ళలాచేతులు ముడుచుకు కూర్చోకుండా వాళ్ళకి ధైర్యం, ప్రోత్సాహం ఇస్తాను. నేను నడిచిన బాటగుండా ఈనాడు కాక పోయినా రేపయినా ఆడపిల్లలు నడిచేట్లు చూస్తాను. ఈ నీతి సూత్రాలు, న్యాయ సూత్రాలు మార్చాలని న్యాయస్థానంలోనే చెప్తాను" రూప ఉద్రేకంగా అంది.

పద్మావతి, విశ్వనాధంగార్లు మొహాలు చూసుకున్నారు. మొన్నటిదాకా చిన్న పిల్లలా సినిమాలు, చీరలు, పుస్తకాలు అంటు వేధించి ప్రాణాలు తీసిన తమ కూతురేనా ఇలా మాట్లాడేది. ఈ రూపలో ఇన్ని భావాలు, ఇంత ధైర్యం ఎలా వచ్చాయి. ఈ ఆవేశం, ఈ ఉద్రేకం ఏమిటి? ఇంత ఆలోచన ఇన్ని మాటలు ఇదెప్పుడు నేర్చింది! పద్మావతికి రూప ధోరణి నమ్మశక్యంకాని విషయంలా అనిపిస్తూంది. కూతురి మూర్ఖత్వం, మొండి ధోరణి, ఆ మాటలు విశ్వనాధంగార్కి కోపం తెప్పిస్తున్నా, కోపం కంటె ఆశ్చర్యం ఎక్కువైంది ఆయనకి. రూప ఏం చేస్తుందో, ఎలా సాధిస్తుందో, ఏ ధైర్యంతో ఇన్నిమాటలుమాట్లాడుతూందో, ఏ అండతో ఇదంతా సాధిస్తానంటుందో ఆయనకేం అంతుపట్టలేదు. ఇంత మొండిగా ఎందుకు మాట్లాడుతూందో, ఆఖరికిదంతా ఎలా తయారవుతుందో అని ఆయన బుర్ర పాడయింది "పద్మా!

దీనికేదో పిచ్చి పట్టింది. కాళ్లు చేతులు కట్టి గదిలోపారేయి ఆపిచ్చి వదిలేవరకు. గదిలో తిండి పెట్టకుండా పడుకోబెట్టు. నాల్గురోజులలో దారికి వస్తుంది. వూరు కుంటున్న కొద్దీ రెచ్చిపోతూంది. కాళ్ళు చేతులు విరగ్గొడ్తాను గుమ్మం కదిలితే. యీసారి. చేసిన నిర్వాకంచాలు.మమ్మల్ని ఇలానైనా బతకనీ. మాపరువు ఇప్పటికే నడిబజారెక్కింది.ఇంక కోర్టులు, పేపర్లలో కూడాఎక్కాలా?పిచ్చివేషాలు ఆలోచనలు మాని ఇంట్లో పడుండు. ఆ తర్వాత నీ రాత ఎలా వుంటే అలా అవుతుంది. ఎంత చేద్దామనుకున్నాను. ఎన్ని సంభంధాలు చూస్తున్నాను. మంచి మొగుడ్ని తేవాలనుకున్నాను, మంచి ఇంట్లో పడేయాలనుకున్నాను. హుఁ మనచేతిలో ఏముంది. నీ ఖర్మ ఇలా కాలి యీ పెడ బుద్ధులు పుట్టాయి" కూతురి భవిష్యత్తు తలచుకుంటూంటే ఆయనకి బాధ, ఆవేదన దాంతోపాటు ఆ కలలన్నీ కల్లలు చేసిన రూపమీద కోపం, అసహ్యం ఏవేవో భావాలు కలగసాగాయి. "నన్నెవరూ ఏం చెయ్యలేరు. ఆపలేరు. నేను అనుకున్నది సాధిస్తాను. నేనేం చిన్న పిల్లని కాను. ఇది నా జీవిత సమస్య. నా సమస్యను నేనే పరిష్కరించుకుంటాను. దయచేసి నా దారికి అడ్డురాకండి. నా ఖర్మానికి నన్ను వదలండి. మీకిదంతా యిష్టంలేదంటే ఇంట్లోంచి పోతాను. అంతేగాని నన్ను కట్టడి చేయడానికి ప్రయత్నించకండి" రూప మొండిగా అంది.

"ఎక్కడికే పోతావు. అడుక్కు తింటావు రోడ్లంట. నీ బతుక్కి, నీ చదువుకి పిలిచి ఉద్యోగాలు యిచ్చేస్తారనుకుంటున్నావు. ఏం చూసుకునే ఆ మిడిసిపాటు. పోతా పోతా అని బెదిరిస్తున్నావు, ఇల్లు దాటితే నీ గతి కుక్కలకి కూడా పట్టదు. ఏమనుకుంటున్నావో ... బజారు పాలవ్వాలి....అదొక్కటే నీకు దారి. ఏం చూసుకుని మమ్మల్ని ఎదిరిస్తున్నావు. నీ మేలుకోరే వాళ్ళమీదే తిరగబడుతున్నావా. ఇంత జరిగినా నీకు బుద్ధిరాదేమే? పాపిష్టిదానా, నీరాత ఇలా తగలబడబట్టే నీకి ఆలోచనలన్నీ వస్తున్నాయి..."పద్మావతి కోపం పట్టలేక పోయింది.

"పద్మా! దీంతో ఇంక లాభంలేదు. దీనివరస చూస్తే ఏదో చేసేట్టే వుంది. లాక్కెళ్ళి ఆ గదిలో పడేయి ... దాని బతుకు కుక్కలు చింపిన విస్తరి చేసుకుని, మనల్ని ఈ మాత్రం శాంతిగా కూడ బతకనీయదు దీన్ని వదిలితే. తరువాత సంగతి తరువాత. ముందు గదిలో పడేసి గొళ్ళెం పెట్టు.ఊ...పద"

విశ్వనాధంగారు,పద్మ చెరో రెక్క పట్టి లాగి గదిలోకి లాక్కెళ్ళారు. "వదలండి నన్ను. నేను ఇంట్లోంచి పోతా, నన్ను వదలండి. నన్ను మీరు బంధించలేరు... నేను అనుకున్నది చేసి తీర్తాను. నన్ను వదలండి..." రూప గింజుకుంటూ పిచ్చి పట్టిన దానిలా అరిచింది....ఆ దెబ్బతో నిజంగా కూతురికి మతి స్థిమితం తప్పిందేమోనన్న అనుమానం వచ్చింది పద్మావతికి. భర్త మొహంలోకి అదుర్దాగా చూసింది . ఆయన ఓర్మి ఆఖరిమెట్టుకు చేరింది. పట్టరాని ఆవేశంతో రూప జుత్తు పట్టుకు యీడ్చుకెళ్ళి గదిలోకి తోసి...

"నీకిదే మందు. నీ పిచ్చి కుదిరేవరకు నీ కిదే శాస్తి" అంటూ బయట గొళ్ళెం

పెట్టేశారు. లోపల్నించి రూప తలుపులు బాదింది. అరిచింది. గోల చేసింది. ఆ రభసకి యిద్దరూ బయట తలలు పట్టుకు కూర్చున్నారు. హఠాత్తుగా మీద పడిన యీ విపత్తు వాళ్లిద్దరి మతులు పోగొట్టింది. అసలే రూప చేసిన పనికి మనసులు పాడయిన వాళ్ళకి రూప యీ మొండితనం, వితండవాదం చూసి కర్తవ్యం తోచక తలలు పట్టుకున్నారు.

మామూలుగా అయితే రూపని నాలుగు తిట్టి ఏ లేడీ డాక్టరు దగ్గరకో తీసికెళ్ళి ఏదో చేసేవారు. రూప ఇలా మొండిపట్టు పట్టడం, రామనాధంగారింటికెళ్లి బెదిరించి రావడం, కోర్టు కెక్కుతాననడం, పసే మిరా ఎబార్షన్ చేయించుకోననడం... ఇదంతా వాళ్ళకి మరింతమతి పోగొట్టింది.

"దానికేదో పిచ్చిపట్టింది. ఆ కుర్రాదలా నమ్మించి మోసం చేశాడని షాక్ తగిలినట్లుంది. ఆ కోపంలో, ఆ ఆవేశంలో ఏదో చేసి కసితీర్చుకోవాలని పిచ్చి పిచ్చిగా ఆలోచిస్తూంది. నాలుగురోజులు పోతే ఆవేశం చల్లారితే అదే దారికి వస్తుందిలేండి. నెమ్మదిగా దానికి మంచి, చెడ్డా రోజూ బోధపరుస్తాను. రెండు రోజులాగి ఏ డాక్టరు దగ్గరకేనా తీసుకు వెళతాను" నిస్పృహగా, నీరసంగా కూలబడిన భర్తకి ధైర్యం చెపుతూ అంది పద్మావతి. విశ్వనాధంగారు శూన్యంలోకి చేతులాడించి "ఏమో. ఏం చేసావో? నాకు మతి పోతూంది తలుచుకుంటే" అంటూ తల పట్టుకుని పడకగదిలోకి వెళ్ళి పోయారు.

* * *

"నీవు తొందరపడలేదు గదా. బాగా ఆలోచించావా రూపా. ఎంతయినా వాళ్ళు నీ తల్లిదండ్రులు, నీ మేలుకోరే వాళ్ళు ఇలా చెప్పకుండా చెయ్యకుండా ఇంట్లోంచి మాయం అయితే, వాళ్ళు కంగారుపడి బాధపడ్తారేమో... నీ ఆచూకీ తెలియక గాభరాపడ్తారేమో. పోనీ, యిలా నా దగ్గిరకి వెళ్తున్నానని చెప్పవలసిందేమో..." సుమతి కొంచెం బాధగా, సందేహంగా అంది.

"మీకు తెలియదు ఆంటీ! చెపితే మావాళ్ళు ఒప్పుకుంటారా? అక్కడికీ చెప్పాను. చితక్కొట్టి గదిలో పడేసి తాళం పెట్టారు. ఎంతసేపూ తప్పు దాచి కప్పెట్టి కడిగేసుకుని చేతులు దులుపుకుంటామన్న ఆలోచన తప్ప, నేనిలా ధైర్యంగా కోర్టుకెక్కి న్యాయం కోసం పోరాడడానికి ఒప్పుకుంటారా? వాళ్లకి పరువు ముఖ్యం. వాళ్ళకే కాదు సగటు తల్లిదండ్రులందరికీ సంఘంలో చెడ్డపేరు వస్తుందన్న భయం. మీ దగ్గరికి వెళ్తున్నానని చెప్పి వస్తే నా వెనకాతలే వచ్చి సన్ను, నాకు ఇదంతా మీరు నేర్పి పెట్టారని మిమ్మల్ని తిట్టి గోల చేసారు. వాళ్ళకి తెలిస్తే చచ్చినా కేసు వేయనీయరు. కోర్టులో కేసు ప్రారంభమయ్యేవరకు నా ఉనికి వాళ్ళకి తెలిస్తే మన పని జరగదు ఆంటీ! అందుకే పారిపోయి వచ్చేశాను" అంది రూప. అర్ధరాత్రి పదకొండుగంటలు దాటాకా-ఒక సూటుకేసులో తన బట్టలు పడేసుకుని అవతలివైపు గుమ్మం గొళ్ళెం వెయ్యాలన్న ఆలోచన వాళ్ళకి రాకపోవడంతో అటువైపు తలుపు తీసుకుని తిన్నగా సుమతి ఇంటికి వచ్చేసింది రూప.

"ఆంటీ! మీరున్నారు. మీరు భరోసా ఇచ్చారన్న నిబ్బరం లేకపోతే ఇల్లు వదిలి ఎలా రాగలిగేదాన్ని. డిగ్రీ అన్నా చేతిలోకి రాకుండా బయటికి వచ్చి ఏం

చెయ్యగలిగేదాన్ని. నా అదృష్టం కొద్దీ మీరు దొరికారు. నా సమస్యలకి జవాబుగా మీరు నా తరుపున నిలబడ్డారు.

కనక ఇంత సాహసం చెయ్యగలిగాను లేకపోతే అమ్మ, నాన్న ఏ డాక్టరు దగ్గరకో యీడ్చుకెళ్లి ఎబార్షన్ చేయించేవారు. నన్నింట్లో బంధించి అడగడుగునా మాటలతో హింసిస్తూ, నన్ను శపిస్తూ, చిన్న పుచ్చుతూ, ఈ సంగతి నలురికి తెలిసి పెళ్లి కాకపోతే మాటలతో మరింత కుళ్లబొడిచే వారు. చేసిన తప్పుకంటే ఆ హ్యూమిలేషన్ భరించలేక, అవమానంతో ఏడుస్తూ వాళ్లెంత హీనంగా చూసినా గత్యంతరం లేక, ఎదిరించే ధైర్యం లేక కుక్కలా పడుండే అవసనించి మీరు నన్ను కాపాడారు. అంటీ! నేనిలా దొంగతనంగా వచ్చానని కోపంగా వుందా మీకు?"

"లేదమ్మా! ఎటొచ్చి మీ వాళ్ల బాధ తల్చుకుంటే బాధగావుంది. సరే, కాలమే అన్ని గాయాలు మాన్పుతుంది. చూద్దాం, నీ యీ ధైర్యాన్ని కొన్నాళ్లు పోయాకైనా హర్షిస్తారేమో. నీవన్నట్టు కోర్టులో కేసు ఆరంభం అయ్యేవరకు నీ ఉనికి వాళ్లకి తెలియకపోవడం మంచిది. నీ ప్రయత్నం నిర్విఘ్నంగా కొనసాగాలంటే తప్పదు. వాళ్లని బాధ పెట్టాలి" సుమతి భారంగా అంది. "రూపా! రేపే సురేష్‌కి లాయరు నోటీసు పంపిసాను. మనకి కేసులో వున్న స్ట్రాంగ్ పాయింటు నీ వింకా మైనరువి అవడం. పద్దెనిమిది నిండడానికింకా రెండు నెలలు టైముండడం మన అదృష్టం. లేకపోతే కేసువేసే పాయింట్ లేకపోయేది మనకు. నీవు మేజర్‌వి అయివుంటే సురేష్ మోసం చేసినా కోర్టులో అది నేరంగా నిలిచేది కాదు. బలవంతంగా రేప్ చేస్తే తప్ప యిద్దరూ కల్సి చేసిందానికి కోర్టు శిక్షించ లేదు"

"కోర్టు సురేష్‌ని శిక్షించినా మానినా నాకేం పరవాలేదు. ఇది నలుగురికి తెలియాలి. అందరి ముందు సురేష్‌ని దోషిగా నిరూపించడానికే ఇలా కోర్టు కెక్కుతున్నాను అంటీ."

"అదే అనుకో! అయినా కోర్టుకెక్కినయీ ఒక్కపాయింటైనా మనకుండకపోతే కేసు ఫైల్ చెయ్యలేక పోయేదాన్ని. అందులో ఉత్తరాలులాంటి సాక్ష్యం లేదేమో మన కేసు అసలు నిలబడేది కాదు. సరే రేపు నోటీసు పంపిస్తున్నాను. చూద్దాం ఏం జరుగుతుందో. పద ఆ గదిలో పడుకో నీవు. ఇదిగో మా పాప-సరోజ గది యిది. ఇవాళనించి నీవు మా పాపకి అక్కవి. దానికి తోచడం లేదని గోల చేస్తుంది. సరోజ కూడా చలాకీ పిల్ల నీకు మంచి ఫ్రెండు అవుతుంది" అంటూ పాప గదిలోకి తీసి కెళ్లింది. పక్కమీద నైట్ గౌను లో పద్దెనిమిది పంథొమ్మిదేళ్ల అమ్మాయి నిద్రపోతూంది. "ఈ అమ్మాయి ఎవరు? మీ చెల్లెలా?" అంది రూప కుతూహలంగా ఆశ్చర్యంగా. సుమతి నవ్వి "కాదు నా కూతురు!" అంది. రూప తెల్లబోయి "అదేమిటి మీకు పెళ్లవలేదు అంటారంతా" అంది తడబడి. సుమతి అదోలా నవ్వుతూ. "పెళ్ళైవుండాలా కూతురు వుండేందుకు? చూశావా నీకు తెలియకుండానే నీవూ యీ సమాజంలో ఒక మనిషివని నిరూపించావు ఈ ప్రశ్న అడిగి" అంది భుజం చరిచి. రూప మొహం

నల్లబడింది. "ఛా...ఛా... రూపా! నిన్ను ఇన్సల్ట్ చెయ్యడాని కనలేదమ్మా! మన రక్తంలో జీర్ణించుకు పోయిన -ఈ పెళ్ళి, పిల్లలు సాంప్రదాయాలు, ఆచారాలు ఒక్కరోజులో పొమ్మన్నా పోవు. అందుకే పాప నా కూతురనగానే అప్రయత్నంగానే పెళ్లవలేదుగా అన్నావు. అది సహజం. మనం యివన్నీ అధిగమించడానికి చాలా రోజులు, ఏళ్లు పడుంది. కొన్ని తరాలు పట్టచ్చు. మంచో చెడో మార్పు అన్నది రావడానికి కొన్ని తరాలుపడుంది. స్త్రీలుబాల్యవివాహాలస్థాయి నించిఆడదీచదువుకుని గుమ్మందాటి ఉద్యోగాలు చేసే స్థాయికి చేరడానికి ఎన్నేళ్లు పట్టిందో చూశావా. వీరేశలింగం లాంటి మహాను భావులు ఎంతచేసినా, ఎన్ని ఉపన్యాసాలిచ్చినా యిప్పటికీ వితంతు వివాహాలు ఎన్ని జరుగుతున్నాయి. వితంతు వివాహాల స్థాయే దాటని మన సమాజం అవివాహితల మాతృత్వాన్ని ఆమోదిస్తుందా? రూపా! ఈనాడు నీవు వేసిన ఈ పునాది మీద భవంతి లేవడానికి కొన్నేళ్ళు పడుంది. అంతా తలోరాయివేసి కూలతోద్దాంఅన్నవారేతప్ప అంతా తలో చెయ్యివేసి లేవనెతుదాం అనుకోరు.

ఈ ఇక్కట్లన్నీ అధిగమించేందుకు చాలా ఓర్పు, ధైర్యం, సాహసం వుండాలి. ఏమిటో! ఒక దాన్లోంచి ఒక దాన్లోకి వెళ్ళిపోతున్నాను. సరోజ నా కూతురు. పెంపుడు కూతురనుకో. ఇంక పడుకో ఉదయం మాట్లాడుదాం" అంది రూప భుజం తట్టి.

* * *

మూడు రోజుల తర్వాత సురేష్‌కి లాయరు నోటీసు పంపింది సుమతి.

"నా క్లయింట్ కుమారి రూప (మైనర్)తో ప్రేమ కలాపాలు జరిపి ఆ తరువాత ఆమె పెళ్లి చేసుకోవల్సిందిగా కోరగానే పెళ్లి చేసుకోనని ఖచ్చితంగా మీ అభిప్రాయం చెప్పి ఆమెని మాటలతో అవమాన పరిచినందుకు, మీ కారణంగా ఆమె యిప్పుడు గర్భవతి అయినందువ, ఆ పుట్టబోయే బిడ్డకి తండ్రి మీ రయినందున వెంటనే పెళ్లాడాలని ఆమె కోరింది. అప్పుడూ అవమానం చేసి చేతులు దులుపుకుని వెళ్లిపోయారు.

నా క్లయింట్ అనేకవిధాల బతిమాలి, ఆశచావక మీ తల్లి తండ్రుల దగ్గరకి వెళ్ళి పరిస్థితి వివరించి తనని,తన కుటుంబాన్ని అవమానాన్నుంచి రక్షించడానికి వెంటనే పెళ్లాడాలని కోరితే, మీ తండ్రి కూడా హీనంగా, నీచంగా మాట్లాడి పొమ్మన్నాడు. నా క్లయింట్ కోర్టు ఎక్కి న్యాయంకోసం పోరాడుతానని బెదిరించినా లొంగలేదు. ఇప్పుడు నా క్లయింటు మీ కారణంగా అవమానాల పాలయి, ఆమె పరువు తల్లి తండ్రుల పరువు పోయి, అక్రమ సంతానానికి తల్లి అయే తరుణంలో న్యాయం కోసం కోర్టు కెక్కుతూంది అని, యిందు మూలంగా తెలియచేయడం అయింది. మూడు రోజుల లోగా దీనికి మీ నించి జవాబు రాకపోతే ఆమె తరఫున లాయరుగా కోర్టులో కేసు నమోదు చేయించగలనని యిందు మూలంగా తెలిపరచు చున్నాను. ఎడ్వకేట్ సుమతి. బి.ఎ.బి.యల్.

లాయరు నోటీసు చదవగానే సురేష్‌కి ముచ్చెమటలు పట్టాయి. రూప ఎంత పని చేసింది. ఏదో బెదిరింపు అనుకున్నాడు గాని రూప యిలా పరువు, మర్యాదలని కూడా లెక్కచెయ్యకుండా





కోర్టు కెక్కుతుందని అతను ఎన్నడూ అనుకోలేదు. ఒక్కక్షణం అతని మెదడు పని చెయ్యడం మానేసింది. కాగితం పట్టుకున్న చేతులు గజగజ వణికాయి. కోర్టు! కేసు! తను చేసిన పని ఊరంతా తెలుస్తుంది. పేపర్లలో పడ్తుంది. ప్రతివాళ్ళు తనని దోషిగా చూస్తారు. తన ఫ్రెండ్సులో తన పరపతి ఏమవుతుంది! అన్నింటి కంటె ముందు తండ్రి ఏమంటాడో!

ఆ రోజు...రూప వచ్చి వెళ్ళిన రోజున సురేష్ ఇంటికి రాగానే తలవాచేట్లు చివాట్లు పెట్టాడాయన కొడుకుని. "చదువు సంధ్య లేకుండా ప్రేమలు ఆడపిల్లలు కావల్సి వచ్చారా. ఆ పిల్ల వచ్చి నానా మాటలు అని పెళ్ళి చేసుకోకపోతే కోర్టుకెక్కుతానని బెదిరించింది. అప్రాచ్యుడా! నీ కిదేం తెగులు? వెధవ్వేషాలు వేస్తావా? పట్టుమని నాలుగురూపాయలు సంపాదించగలవా? నీకు పెళ్ళి కావల్సి వచ్చిందా ఇప్పటినించి"





అంటూ కొడుకుని చెడామడా తిట్టారు.

ఆవేశం కాస్త చల్లారాక కొడుకు నించి అన్ని వివరాలు అడిగి రూప కోర్టు కెక్కితే సురేష్‌ని దోషిగా నిలబెట్టేందుకు ఉత్తరాలు లాంటి సాక్ష్యాలు ఏమీలేవని సంతోషించారు. కొడుకుని తిట్టినా ప్లీడరు, వ్యవహార దక్షత గలవాడు గనక ముందు చూపుతో ముందరి కాళ్ళకు బంధంలా రూప తండ్రిని కల్సి నలుగురిలో నానామాటలు అని వచ్చాడు. దాంతో ఆ తండ్రి రూపని కట్టడిలో పెట్టి కోర్టు

కెక్కితే పోయేది వాళ్ళ పరువేనని కూతురిని కోప్పడుతాడని ఆశించాడు. తల్లి కూడా చాటుగా కొడుకుని నానామాటలు అంది.

అసలే రూపతో ఈ వ్యవహారం ఎందుకు నడిపానా అని పశ్చాత్తాపపడిన సురేష్, తల్లితండ్రులు తిట్టడంతో బుద్ధి తక్కువయి దీన్లోకి దిగానని మనసులో లెంపలు వేసుకుని, జరిగింది పీడకల అనుకుని మరిచి పోవాలనుకున్నాడు. తీరాచేసి రూప అన్నంతపనిచేసి లాయరు నోటీసు పంపేసరికి నీళ్లుగారిపోయాడు. భయంగా తండ్రికి చూపించాడు అది.

నోటీసుచూసి రామనాథంగారూ భయ పడ్డారు. ఆడపిల్ల ఇంత ధైర్యంగా చేసిన పనికి సిగ్గుపడడంపోయి కోర్టుకెక్కుతుం దని ఆయన ఎన్నడూ ఎదురు చూడలేదు. ఏదో కసితో, ఆవేశంతో వచ్చి బెదిరిం చిందని అనుకున్నాడాయన. ఆ నోటీసు లాయరు సుమతి ద్వారా రావడం ఆయనకి మరింత అవమానం అన్పించింది.

కోర్టులో ఎప్పుడూ రామనాథంగారు సుమతి ప్రత్యర్థులే. ఇద్దరూ సమబలా లతో తలపడ్తారు కేసులో. రామనాథం గారిని లాయరుగా పెట్టుకున్నవాళ్ళ ప్రత్యర్థులు సుమతిని తమ లాయరుగా ఎన్నుకుంటారు. రామనాథంగారి ఎదురుగా సుమతి కేస్ డిఫెండ్‌చేస్తే ఆ కేసు మంచి పవర్‌ఫుల్‌గా ఇంటరెస్టింగ్‌గా వుంటుందని జడ్జీలుకూడా అనుకుంటారు. లాయర్లకి, క్లయింట్లకందరికి వారిద్దరి సంగతి తెల్సి పోయింది. సుమతితో కేసువస్తే అవతలి లాయరు రామనాథంగారని, రామనాథం గారితో కేసువస్తే అవతల పార్టీవాళ్లు సుమతిదగ్గిరికి వెళ్తారని అందరికీ తెలుసు.

ఈ రోజు ఈనోటీసు తన కొడుక్కి... లాయరు సుమతి ద్వారా రావడం తల కొట్టేసినట్లుంది ఆయనకి. పర్సనల్‌గా తనని అవమానించే అవకాశం సుమతికి వచ్చినట్లు ఆయన మనసులో ఉడికి పోయాడు. ఆనోటీసుకి జవాబివ్వడం- రూపతో రాజీకి వచ్చి కోర్టు కేసు లేకుండా చేసుకోవడం, సుమతి ముందు తలవొగ్గి తప్పు వప్పుకోవడం, మరింత చిన్నతనంగా, నామోషిగా అనిపించింది ఆయనకి. ఆ కోపం అంతా సురేష్ మీద చూపించి నానాతిట్లు తిట్టారాయన. ఎంత తిట్టినా కన్నకొడుకు. వాడిని కోర్టు కీడ్పించడం అంటే వాడి పరువుగాదు ముందు తమ పరువు ప్రతిష్ఠలే పోతాయని, ఎంత దులిపేసుకుందామన్నా ఇది తమ కుటుంబానికి సంబంధించినదని ఆయనకి తెలుసు. సురేష్‌ని తిట్టినంత మాత్రాన ఈ సమస్య పరిష్కారం కాదని ఆయనకి తెలుసు. రూపతో రాజీపడడం అంటే సుమతి ముందు తల ఒగ్గడం అన్నమాట. ఆయన ఆత్మాభిమానం, పౌరుషం అడ్డొచ్చింది.

ప్రతి కేసులో తనకి అడ్డు తగులూ మూడొంతులు కేసులు గెలుస్తూ తనకి ప్రతి విషయంలో ప్రత్యర్థిగా వున్న సుమతి ముందు తల ఒగ్గడమా! ఊహుఁ ఇది సురేష్ మీద కోపంకాదు! ఇన్నాళ్ళకి తనమీద కసితీర్చుకునే అవకాశం వచ్చింది. ఆ అమ్మాయి సుమతి దగ్గిర కెలా వెళ్ళిందో. ఇంత మంది లాయర్లు వుండగా రూప సుమతి దగ్గిరకే ఎందు కెళ్లాలి! ఈ నోటీసు ఇప్పించడంలో సుమతి పాత్ర చాలా వుండే వుంటుంది. ఆ పిల్లకి ధైర్యం చెప్పి, ప్రోత్సహించి

కేసు గెలిపించే పూచీ నాదని హామీ యిచ్చి మరింత పు్రరెక్కించి నోటీసు ఇచ్చి వుంటుంది తనమీద వున్న కోపం, కసి తీర్చుకునే అవకాశం వచ్చినందుకు ఆమెకు చాలా ఆనందంగా, గర్వంగా వుండి వుంటుంది. ఊహిస్తుంటే రామనాధం గారి ఒంటిని తేళ్ళు, జ్జెరులు పాకాయి.

ఊహుఁ ఏమయినా సరే రాజీకి రాకూడదు. మైనర్ అన్న పాయింటు తప్ప రూప దగ్గిర సాక్ష్యాలు ఏమీలేవు. ఆ పాయింటుతో యీ కేసు గెల్చి తనని అడుగడుగునా అవమానిస్తున్న సుమతికి బుద్ధి చెప్పాలి. ఆయనలో పంతం పెరిగింది. పట్టుదలగా కోర్టు కెక్కడానికే నిర్ణయించారాయన. శారదాంబ పరువు ప్రతిష్ఠ అంటూ గోల పెట్టింది.

సురేష్‌కి ఇంత చేసిన రూపమీద కసి పెరిగి లొంగిపోయి రాజీకి రావాలనిలేదు. రాజీ అంటే పెళ్ళాడాలి. తనమీద ఇంత కక్ష కట్టిన రూపని...ఇంపాసిబుల్ అనుకున్నాడు కోపంగా. తను చేసినపని నలుగురిలో బైటికి వస్తుందని చిన్నతనంగా వున్నా, తండ్రి తగ్గిపోవడానికి ఇష్టపడకపోవడంతో చేసేదేంలేక వూరుకున్నాడు.

ఇంత గొడవవుతుందని తెలిసే యీ గొడవలో ఇరుక్కోకపోదును అని పదే పదే పశ్చాత్తాప పడ్డాడు. గుడ్డిలో మెల్ల అన్నట్లు తను రూపకి ఉత్తరాలు అవీ రాయలేదు. పెళ్ళాడుతానని మాటివ్వ లేదు కనక కేసు బలంగా నిలవదు. తండ్రి పంతం పట్టి కేసు గెలిపించొచ్చు అని ఓదార్చుకున్నాడు. కేసు గెల్చినా ఓడినా ఇదంతా అనవసరంగా నలుగురి నోళ్ళల్లో పడ్డందుకు మాత్రం సురేష్‌కి బాధగా వుంది.




రూప కేసు నెలా పదిహేను రోజుల్లోనే హియరింగ్‌కి వచ్చింది. జస్టిస్ సుబ్రహ్మణ్యం సుమతికి బాగా సన్నిహితులు. ఆ కేసు ఆయన కిందకి రావడంతో సుమతి ప్రత్యేకంగా ఆయనతో మాట్లాడి తొందరగా ఆ కేసు హియరింగ్‌కి వచ్చేట్టు చూసింది.

మూడు రోజుల తర్వాత రామనాధం నించి జవాబు రాకపోవడంతో కోర్టులో కేసు ఫైల్ చేసింది. ఈ నెలా పదిహేను రోజులలో రూప, సురేష్ కలిసి తిరగడం చూసిన వాళ్ళందరి సాక్ష్యాలు సంపాదించింది. టైప్ ఇన్‌స్టిట్యూట్‌లో, వాళు గడిపిన హోటల్ బాయస్, వాళ్ళిద్దరిని చూసిన విశ్వనాధం గారి స్నేహితులు, రూప స్నేహితురాళ్ళిద్దరు - ఇలా ఒక అరడజను మందిని కలిసి అవసరమైతే వాళు రూప తరఫున కోర్టులో సాక్ష్యం ఇచ్చేట్లు ఒప్పించింది.

రూప కోర్టులో సురేష్ మీద కేసు వేసిన సంగతి విశ్వనాధంగార్కి స్నేహితుల ద్వారా తెలిసేసరికి కేసు కోర్టులో హియరింగ్‌కి వచ్చేసింది.

రూప ఇంట్లోంచి వెళ్ళిపోయిన ఆ నెల్లాళ్ళలో విశ్వనాధం గారికి హఠాత్తుగా ముసలితనం వచ్చేసినట్లు జుట్టు సగం

నెరిసి, కళ్ళు లోతుకుపోయాయి. దవడలు పీక్కుపోయాయి. ఆ నెల రోజులుగా పద్మావతి ఆవేదనకి అంతులేకుండా పోయింది.

ఆ మర్నాడు ఉదయం రూప ఇంట్లో లేదని గుర్తించగానే ఆమె స్థాణువైంది. రూప అంత సాహసం చెయ్యగలదని ఎన్నడూ అనుకోలేదు ఆమె. ఏదో పొగరుగా మాట్లాడడం తప్ప అంత ధైర్యంగా ఏ ఆధారమూ లేకుండా ఇల్లొదలగలదని కలలో కూడా అనుకోలేదు పద్మావతి.

తను సాధించదలచినదానికి పీళ్ళు అడ్డు వస్తున్న కారణంగా తను అనుకున్నది సాధించడానికి ఇల్లొదలడం తప్ప గత్యంతరం లేదని, తను పిరికిదానిలా ఏ ఆత్మహత్య చేసుకోదని తను చేరవలసిన గమ్యం చేరాక తన ఉనికి తెలియపరుస్తానని, అంతవరకు తన గురించి ఆందోళన పడనవసరం లేదని రూప రాసి పెట్టిన ఉత్తరం చూశాక కాస్త మనస్తిమితం చిక్కింది.

ఏ అఘాయిత్యం చెయ్యలేదని మనసు నిబ్బరపడినా ఎక్కడికెళ్ళిందో, ఏమైందో ఎలా బతుకుతూందో, ఒంటరిగా ఎక్కడ ఏం అవస్థలు పడుతుందోనని హడలిపోయింది.

ఆ ఉత్తరం తీసికెళ్ళి భర్త మీద విసిరికొట్టి, రూప ఇంట్లోంచి వెళ్ళడానికి ఆయనే కారణం అని విరుచుకుపడింది.

విశ్వనాథం గారు రూప అంత పని చెయ్యగలదని ఎన్నడూ అనుకోలేదేమో నిర్ఘాంతపోయారు. ఉత్తరం చదివి ఆ దైన్యానికి విస్తుపోయారు.

ఆయన, పద్మావతి ఆ నెల రోజులలో మానసిక వ్యధతో చిక్కి సగమయ్యారు. రూప ఏదని అడిగిన వారికి శలవులు కనక అమ్మమ్మగారి వూరు వెళ్ళిందని చెప్పుకున్నారు.

మళ్ళీ రూప నించి ఏ ఉత్తరమన్నా వస్తుందేమోనని ఇద్దరూ ఆరాటంగా చూశారు.

నెల రోజుల తర్వాత ఆయన కొలీగ్-లాయరు సుమతి తనని కలిసి రూప కేసులో సాక్ష్యం చెప్పవలసిందని కోరిందని వినగానే ఆయన నిర్ఘాంతపోయారు. ఆయన మొహం నల్లబడింది. రూప కోర్టుకెక్కుతుందని వినగానే అన్నాళ్ళుగా ఆయన రూప కోసం పడిన ఆరాటం, బాధ, తాను తొందరపడ్డానన్న భావం అన్నీ పోయి మళ్ళీ రూప మీద కోపం ముంచుకు వచ్చింది.

ఈ దెబ్బతో తమ పరువు నడి వీధికెక్కుతుందని ఆయన కోపం పట్టలేకపోయారు. లాయరు దగ్గిర కెళ్ళడం, కేసు పెట్టించడం ఎలా చేసిందో ఆయనకేమి అంతుబట్టలేదు. ఎక్కడ ఉందో, ఏ ధైర్యంతో ఇదంతా చేస్తుందోనని ఆలోచించారు. ఆఖరికి లాయరు సుమతిని కలిస్తే రూప విషయం తెలుస్తుందేమోనని ఆమెని కలిశారు ఒక రోజు.

సుమతి - రూప, విశ్వనాథం గారి స్నేహితులని కలిశాక ఈ విషయం వాళ్ళు విశ్వనాథం గారికి చేరవేసారని విశ్వనాథం గారు తన దగ్గిరకు వస్తారని ఎదురు చూస్తూనే వుంది. కేసు విషయం చెప్పాలని, రూప తన దగ్గిర వున్న విషయం చెప్పడమా? మానడమా? అని ఆలోచించింది.

కాని రూప ధైర్యంగా "చెప్తాను ఆంటీ! నేనెలాగూ కోర్టుకి రావడం అదీ అందరికీ

తెలుస్తుంది. ఆ తర్వాత నేనెటు వెళ్ళిందీ తెలుసుకోవాలంటే పెద్ద కష్టం కాదు. ఎలాగూ తెలుస్తుంది అబద్ధం ఎందుకు ఆడడం. నేనిష్టమై ఇల్లు వదిలాను. నన్ను బలవంతగా ఇంటికెవరూ తీసికెళ్ళ లేరు" అంది రూప.

విశ్వనాథంగారు, పద్మావతి వచ్చే వేళకి సుమతి, రూప డ్రాయింగు రూము లోనే కూర్చున్నారు. రూపని అక్కడ చూడగానే విశ్వనాథం మొహం ఎర్ర బడింది. కూతురు వంక కసిగా చూసి పళ్ళుకొరికి

"నీవింట్లోంచి లేచిపోయిననాడు నా కూతురు చచ్చిందని ఒక ఏడుపు ఏడ్చు కున్నాం. నీవింకా ఇలా మమ్మల్ని, మా పరువుని నడిబజారులో కెక్కించడానికి బతికే వున్నావన్న మాట. నీ కేం అపకారం చేశామని మా మీద ఇలా కత్తి కట్టావే? నిన్ను కనడమే నా తప్పయితే దానికి తగిన శిక్ష ఇప్పటికే అనుభవిస్తు న్నాను. మమ్మల్ని ఇంకా ఈ మాత్రంగా నైనా బతకనీయ దల్చుకోలేదా? కోర్టు కెక్కి అందరిలో మమ్మల్ని మొహం ఎత్తుకోనీయకుండా చేసేంత అపకారం నీకేం చేశామే...నిన్ను కన్నాం. మొదటి పిల్లవని అల్లారుముద్దుగా పెంచాం. కోరిన వన్నీ కాదనకుండా చేశాం...ఇందుకా మాకీ శిక్ష?"

ఆయన గొంతు రుద్ధమయింది. పద్మావతి కళ్ళ నిండా నీరు తిరిగింది. రూప తల దించుకొంది.

సుమతి లేచి నిల్చుని "విశ్వనాథం గారూ! ముందు మీరిలా కూర్చోండి. దయచేసి ఆవేశపడకండి...అమ్మా మీరూ కూర్చోండి. మనం ప్రశాంతంగా మాట్లాడుకుందాం" సుమతి వినయంగా అంది.

ఆయన కోపం ఈసారి సుమతి మీదకి తిరిగింది. ఆమె వంక కోపంగా చూస్తూ "అమ్మా! మీరు చదువుకున్నవారు న్యాయవాదులు. ఒక ఆడపిల్ల ఇలా ఇంట్లోంచి లేచి వెళ్ళి తెలివి తక్కువగా ముందాలోచన లేకుండా కోర్టు కెక్కు తూంటే దానికి బుద్ధి చెప్పి, నచ్చచెప్పి తప్పు తెలియ పరచాల్సిందిపోయి, కేసు కోసం, డబ్బుకోసం ఇలా దానిచేత కేసు ఫైల్ చేయిస్తారా? మీరూ ఆడవారు. ఒక ఆడపిల్లని కన్న తల్లిదండ్రులు వ్యథ మీ కర్థం కాదా? చిన్నపిల్ల తెలియక తప్ప టడుగు వేస్తున్నప్పుడేనా మాకు తెలియ పర్చాల్సిన బాధ్యత మీకు లేదా? మా దగ్గర ఇలా దాచి, దాన్ని మీరు ప్రోత్స హించడం ఏమన్నా బాగుందా?" ఆవేశంగా కడిగేశారు.

సుమతి మొహం అరక్షణం రంగు మారింది. అంతలో నిలదొక్కుకుని చిరు నవ్వుతో ప్రశాంతంగా "ముందు మీరలా కూర్చుంటే ఎందుకిలా చెయ్యాల్సి వచ్చిందో అన్నీ వివరంగా చెబుతాను" అంది.

"నాన్నా... ఇందులో మీరు ఆమెని అనడానికి ఏమీ లేదు. నా కోరిక మీద, నా పట్టుదల వల్ల ఆవిడ ఈ కేసు ఫైల్ చేశారు. దయచేసి ఏమన్నా అనదలిస్తే నన్ననండి. కాని ఆమెని ఏమీ అనకండి" రూప కాస్త కరకుగా అంది.

"ఎవర్నని ఏం లాభం. జరగాల్సిం దంతా మా ప్రమేయం లేకుండానే జరిగి పోయింది. కన్న తల్లి తండ్రులన్న గౌరవం, అభిమానం వుంటే ఇలా ఇంటి లోంచి లేచిపోయి మాకు తలవంపులు తెచ్చి పైగా కోర్టు కెక్కుతావా? ఏం

చూసుకునే నీకింత గర్వం. తప్పుడు పని చేసి పిల్లాడిని కనడం చాలా ఘన కార్యంలా లోకానికి నీవే చాటుకుంటున్నావు. నీది అతితెలివో, తెలివి తక్కువతనమో తెలియడం లేదు. ఇంకెవరన్నా అయితే ఈ పాటికి ఉరేసుకునేవారు..." విశ్వనాథం తిరస్కారంగా అన్నారు.

"సార్ ! యుగయుగాలుగా జరిగిన కథ అది. అది నిన్నటి కథ. ఆ కథని ఈనాడు కొత్త మలుపు తిప్పాలనే మా ఆరాటం. చేసిన తప్పులో ఇద్దరూ భాగస్వాములయినపుడు ఆడపిల్లే వురేసుకోడం, మగవాడు ఛాతీ విరుచుకు తిరగడం అన్యాయమని లోకానికి నిరూపించాలనే మా ప్రయత్నం" సుమతి కల్పించుకుంటూ అంది.

"అమ్మా ! కబుర్లకి కార్యాచరణకి చాలా తేడా వుందమ్మా. ఉపన్యాసాలు ఇవ్వడం తేలిక తల్లీ. రేపు ఇంక దీనికి భవిష్యత్తు ఏమి వుంటుందండీ. పెళ్ళి ఇల్లు, సంసారం ఇంక ఈ జన్మకి వుంటాయా ? పెద్ద సంఘ సంస్కర్త బయలు దేరింది. ఈవిడ ఒక్కతి తిరగబడి న్యాయసూత్రాలు మార్చేస్తుందా ?" సుమతి వంక హేళనగా చూశారాయన.

"ఒక్కొక్క రాయి చొప్పున వేస్తే మహా వారథి తయారైంది సార్. రూప లాంటి ధైర్యసాహసాలుగల అమ్మాయిలు నూటికి ఒక్కరు చొప్పున అయినా ఒక్కొక్క రాయి పునాదిలో వేస్తే కొన్నాళ్ళకి, కొన్నేళ్ళకి కొన్ని శకాలకి ఈ ఉద్యమం ఎవరూ భేదించలేని పటిష్టమైన, మహాశక్తివంతమైన చైతన్యంగా మారుతుంది సార్. మీరు కాస్త నిదానంగా మీ అమ్మాయిని అర్థం చేసుకోడానికి ప్రయత్నించండి. మా ఆలోచనలు వినండి. ఇవాళ కాకపోయినా రేపయినా మా అభిప్రాయాలతో ఏకీభవించి మాతో సహకరిస్తారని నా విశ్వాసం..." సుమతి మృదువుగా అంది.

పద్మావతి అప్పటివరకు శ్రోతలా మెదిలింది. "మీరు చెప్పేది నిజమే అవచ్చు. కాని కన్న తల్లిదండ్రులం. బిడ్డ భవిష్యత్తు చేతులారా నాశనం చేసుకుంటుంటే భరించగలమా ? చీకటి పారదోలడానికి అది వత్తి అయి కాలిపోవడం ఏ తల్లిదండ్రుల కిష్టం వుంటుంది సుమతి గారూ !" బాధగా అంది పద్మావతి.

"అమ్మా ! చాటుగా ఈ పాపం కడిగేసుకుని, ఎవడినో మోసం చేసి పుస్తె ముడేయించుకుని అడుగడుగునా ఏ క్షణంలో ఈ నిజం పైకి వస్తుందోదని ప్రాణాలు అరచేతిలో వుంచుకుని భయపడూ బతికే బతుకుమీద నా కాసక్తి లేదమ్మా. తప్పు చేసినా నేను చేసింది తప్పని,ఆ తప్పుని సరిదిద్దుకుని ధైర్యంగా పరిస్థితులకి ఎదురీది బతకాలనుందమ్మా నాకు. నాకు పెళ్ళి, మగాళ్ళు అంటేనే విరక్తి పుట్టింది.

లోకం కోసం, పరువు కోసం ఆత్మ వంచన చేసుకుని బతకలేనమ్మా. నా మార్గం నేను ఎంచుకున్నాను. దయచేసి నా మానాన నన్ను పోనీండి. దారిలో ఎన్ని ఆటంకాలు, ఎన్ని కంటకాలు, ఎన్ని క్రూర జంతువులు ఎదురవనీ అన్నీ అధిగమించడానికి ప్రయత్నిస్తాను. అలాకాని పక్షంలో అపుడే ఆత్మహత్య చేసుకుంటాను. జీవితం నేర్పేపాఠం నేర్చుకుంటాను. నాకు అడ్డు రాకండమ్మా" రూప చేతులు జోడించి స్థిరంగా అంది.

ఇంకేమనాలో తోచలేదు యిద్దరికీ. సుమతి తరువాత ఒక గంట వాళ్లిద్దరిని కూర్చోపెట్టి శాంతంగా అంతా బోధపరిచింది. రూప చెయ్యబోయేది సాహసమే అయినా ఒక మంచి పని అని నమ్మించడానికి ప్రయత్నించింది.

"సరే పో నీ కోర్టు కెక్కినంత మాత్రాన సురేష్ దీన్ని పెళ్లాడతాడని గ్యారంటీ ఏముంది. చేసుకోనంటే అప్పుడింక ఏం చేస్తుంది? కోర్టు వాళ్లు పెళ్లంటే చేసుకోమంటారు గాని బలవంతంగా కాపురం చేయించలేరుగదా! దీని మీద కసితో పెళ్లయ్యాక హింసిస్తే ఏం చేస్తుంది?" ఆఖరికి విశ్వనాధంగారు అయిష్టంగానే అంగీకరించి సందేహాలు బయటపెట్టారు.

కొంత దారిలో పడ్డారని సంతోషించింది సుమతి.

"అవన్నీ ప్రశ్నలు...సమాధానాలకి మనం వేచి చూడాలి" నవ్వుతూ అంది "ఏది ఏమయినా రూప అన్నింటికి సిద్ధపడే వుంది. వుయ్ ఆర్ ప్రిపేర్డ్ ఫర్ ది వరస్ట్."

"పెళ్లి కాకపోతే బతకలేనా! ఓ డిగ్రీ వుంది. ఏదో ఉద్యోగం చేసుకుంటూ ఆ మాత్రం బతకగలను" రూప ధీమాగా అంది.

రూప స్థిర నిశ్చయం చూశాక విశ్వనాధంగారు తనేమి చెప్పినా లాభంలేదని, రూప నిశ్చయం మారదని గ్రహించి నిట్టూర్చి పద్మావతి వంక చూశారు.

"మరి మమ్మల్ని యిప్పుడు ఏం చెయ్యమంటారు. రూపని యింటికి తీసికెళ్తాం" అంది పద్మావతి.

రూప చప్పున తల ఆడించి "వద్దమ్మా ఈ గొడవలన్నీ తేలేవరకు నేనిక్కడ యిలా అజ్ఞాతంలో వుండడమే మంచిది. వాళ్ల వీళ్ల ప్రశ్నలు, ఆరాలు అన్నీ మీరు తట్టుకోలేరు. నాకిక్కడ ఏ లోటూలేదు. ఆంటీ కన్నబిడ్డకంటే ఎక్కువగా చూస్తున్నారు. మీ రియ్యలేని ప్రోత్సాహం, ధైర్యం ఆవిడ యిస్తున్నారు. నేనిక్కడే వుంటాను" రూప స్థిర నిశ్చయంగా అంది.

"ఇన్నాళ్లు అంటే ఎక్కడున్నావో ఏ సంగతి తెలియక దిగులు పడ్డాము. యిప్పుడు తెల్సితెల్సి ఎలా నిన్నిక్కడా వదిలి వెళ్లగలనే" పద్మావతి బాధగా అంది.

"తెల్సిందికనక నిశ్చింతగా వుండచ్చు. రూప గురించి మీకు బెంగ వద్దు, మేం అనుకున్నది సాధించే వరకు ఆమె ఇక్కడ వుండడమే మంచిది. వుండనీండి. మీరు నిశ్చింతగా వెళ్లండి" అంది సుమతి.

"అదే మంచిదిలే. వుండనీ" గొణిగారు విశ్వనాధంగారు.

కన్న ప్రాణం కనక పద్మావతి దిగులుగా, బాధగా రూప వంక దీనంగా చూసింది. భర్త వంక ప్రాధేయపూర్వకంగా చూసింది. విశ్వనాధంగారు ఆ చూపుని తప్పించుకుంటూ లేచినిల్చుని "పద వెడదాం" అన్నారు పద్మావతితో.

పద్మావతి పట్టుకున్న గొంతుతో సుమతి చెయ్యిపట్టుకుని, "దానికి మీరే ఇంకదిక్కు" అంటూ కళ్ళలో తిరిగిన నీరు ఎవరికీ చూపడం యిష్టంలేనట్టు చకచక బయటికి వెళ్లిపోయింది.

విశ్వనాధంగారు మౌనంగా సుమతికి నమస్కారం చేసి గబగబ బయటికి వెళ్లారు. రూప, సుమతి మొహాలు చూసుకున్నారు.





రూప కేసు కోర్టులో హియరింగ్‌కి వచ్చింది. మొదటి రోజు లాయరు సుమతి తన గంభీర కంఠంతో కేసు ప్రెజెంట్ చేస్తూంటే కొత్త రకం కేసు అని తోటి లాయర్లు, జడ్జి, అందరూ చాలా కుతూహలంగా విన్నారు.

"యువర్ ఆనర్! ఈనాటి ఈ కేసు ఒక ఆడపిల్లకి జరిగిన అన్యాయం గురించి. నా క్లయింట్ కుమారి రూప, పద్దెనిమిది సంవత్సరాల కాలేజీ అమ్మాయి.



మంచి కుటుంబంలో పుట్టి, చదువు, సంస్కారం కలిన అయినింటి ఆడపిల్ల. ఆరు నెలల క్రితం ఆమె శలవులలో ఖాళీగా వున్నానని టైపు ఇన్‌స్టిట్యూట్‌కి టైపు నేర్చుకోడానికి వెళ్లింది. అక్కడ ప్రతిహాది సురేష్‌ని కలిసింది. సురేష్‌తో నాక్లయింట్‌కి కాలేజీలో ముఖ పరిచయం మాత్రం వుండేది. కాలేజీలో అతను నా క్లయింట్‌కి సీనియర్ అయినా అతను కాలేజీ నాటకాలలో నటించి అనేక బహు

ఖ్యాతులు పొందిన వాడవడం వల్ల కాలేజీలో అతన్ని చాలామంది ఎరుగుదురు. ఆకర్షణీయంగా వుండి, చలాకీగా మాటలాడే స్వభావం కలవాడు కనక ఆడపిల్లలకి అతను హీరోగా చలామణి అయ్యేవాడు. అయినా అప్పుడు నా క్లయింట్ కి, అతనికి పరిచయంలేదు. ఈత నేర్చుకోడానికి వెళ్లినపుడు అంత మంది కొత్త వారి మధ్య ముఖ పరిచయస్థుడు సురేష్ కనిపించగానే నా క్లయింట్ సంబర పడింది. ఇద్దరూ పలకరించుకున్నారు. మాట్లాడుకున్నారు.

"ఆరోజునించి యిద్దరిమధ్య క్రమంగా పరిచయం పెరిగింది. ఇద్దరూ కల్సి టాంక్ బండ్ మీదకి షికారు వెళ్లేవారు. తరువాత పబ్లిక్‌గార్డెన్స్, ఆ తరువాత సినిమాలకి, హోటళ్ళకి టిఫిన్లకి...ఇలా మూడు నెలలకి యిద్దరిమధ్య ఆకర్షణ, ప్రేమ, ఆరంభమయింది. నా క్లయింట్ రూప సురేష్ అందానికి, అతని మాటల చాతుర్యానికి, అతని పొగడ్తలకి లోబడి పోయింది. అతను చూపే ప్రేమ అంతా నిజమని నమ్మింది. గుడ్డిగా అతని మాటలు నమ్మింది. సురేష్‌కి తనపట్ల నిజంగా ప్రేమ వుందని నమ్మి మొదట్లో అతను చేసే చిన్న చిన్న ప్రేమ కలాపాలకి అడ్డు చెప్పలేదు. ఒకసారి ముందు చెయ్యి పట్టుకోడంతో ఆరంభించి ముద్దుల వరకు వెళ్లినా అతని ప్రేమలో, ఆ ఆకర్షణలో పడిపోయిన నా క్లయింట్ అభ్యంతరం చెప్పలేదు. నా క్లయింట్ నించి అభ్యంతరం లేకపోవటంతో ఆ చిన్న చిన్న ప్రేమ కలాపాలతో సంతృప్తి పడక యింకా ముందుకు వెళ్లాలనిపించింది.

ఒకరోజు ముందు చెప్పకుండా మంచి సర్ప్రైజ్ చూపిస్తానని హోటల్‌ద్వారకాకి ఆహ్వానించాడు. ఏ పుట్టినరోజు పార్టీ ఇస్తాడు గాబోలని నా క్లయింట్ నిరభ్యంతరంగా వెళ్ళింది. ఆరోజు నా క్లయింట్‌ని హోటల్ రూమ్‌లోకి ఆహ్వానించి మోహావేశంతో దగ్గరికి లాక్కోగానే నా క్లయింట్ భయపడింది. అతనిలో ఆవేశం చూడగానే అతను ఏం కోరుతున్నదీ అర్థం కాగానే భయపడింది. పెళ్ళికి ముందు సెక్స్ ఇష్టం లేదని అతన్ని వారించింది. మోహావేశంలో వున్న సురేష్‌కి ఆ మాటలు నిరాశ, కోపం కల్గించాయి.

"ఇన్నాళ్లు కల్సి తిరిగాం,ఇప్పుడుదీనికి మాత్రం ఏం తప్పు, సెక్సులేని ప్రేమ నిలవదన్నాడు. నీకేం భయంలేదు, ఫామిలీ ప్లానింగ్ సాధనం ఉపయోగిస్తానన్నాడు. నా క్లయింట్ అతని మాటలకి, ఆ ఆకర్షణకి లొంగిపోతున్నావద్దని, భయమని, ఏదన్నా అయితే ఇంట్లో ప్రాణం తీస్తారని భయపడ్తూ ఆరాటంగా అతన్ని వారించింది. నా క్లయింట్ సురేష్ ప్రేమని నమ్మింది. మనసారా అతన్ని ప్రేమించింది. అతనిలో ఆకర్షణకి పిచ్చిగా లోబడింది. అతను ఆవేశంలో మైకంతో ఆమెని ఆక్రమించుకుంటూంటే ఆ ఆకర్షణకి లోబడి వారిస్తుంటే అతనికి కోపం వస్తుందని, సురేష్‌ని ఏ పరిస్థితుల్లోనూ దూరం చేసుకోడం ఇష్టంలేని నా క్లయింట్ క్రమంగా వారించే శక్తి కోల్పోయి అతనికి లొంగిపోయింది.

"అలా హోటలులో ఐదారుసార్లు వారిద్దరూ కలిశారు. ఈలోగా వారిద్దరూ కల్సి తిరగడం అనేకసార్లు చూసిన నా క్లయింట్ తండ్రికి ఆయన స్నేహితులు చెప్పారు.

అంతవరకు రూప ఇంట్లో ఆలస్యంగా రావడానికి చెప్పే కారణాలు నిజమని నమ్మారు తల్లిదండ్రులు. సంగతి తెలియగానే ఆ రోజు నా క్లయింట్ తండ్రి కూతురు ప్రవర్తన సంగతి విని ఇంట్లో భార్యని కూతురిని అదుపులో పెట్టలేదని నానా తిట్లు తిట్టారు. నా క్లయింట్ ఇంటికి రాగానే తల్లిదండ్రులు తలవాచేట్టు చివాట్లు పెట్టారు. పరువు ప్రతిష్ఠ మంటగలిపావని తిట్టారు. ఇన్నాళ్ళు తిరిగావు అతను నిన్ను పెళ్ళి చేసుకుంటాడా అని నిలేశారు.

"అప్పటివరకు నా క్లయింట్ అమాయకంగా అతని ఆకర్షణలో పడిపోయింది తప్ప పెళ్ళి విషయం అడగాలని కూడా ఆలోచించలేదు. తల్లిదండ్రుల మాటలతో తెలివి తెచ్చుకుని మర్నాడు సురేష్‌తో జరిగింది చెప్పి తల్లిదండ్రులు పెళ్ళి చేసుకోమంటున్నారు అని చెప్పింది. సురేష్ మొహంలో పెళ్ళిప్రస్తావన రాగానే రంగులు మారాయి. చదువవలేదు. ఉద్యోగం లేదు. ఇప్పటినించి పెళ్ళేమిటని, ఉద్యోగం వచ్చాక, ఐదారేళ్ళ తరువాతే పెళ్ళి అంటూ ఆ ప్రస్తావన అంగీకరించలేదు. పైగా రూపతో నీ తల్లిదండ్రులు తెచ్చిన సంబంధం చేసుకోమనగానే నా క్లయింట్ నిర్ఘాంతపోయింది. అతని చదువయి, ఉద్యోగం వచ్చేవరకు తను వేచి వుంటానని ప్రాధేయపడినా అతను ఖచ్చితంగా పెళ్ళికి ఒప్పుకోలేదు. ఇన్నాళ్లూ ఏదో ఇద్దరం సరదాగాఎంజాయ్ చేశాం దీనికి పెళ్ళికి ముడిపెట్టకు. నీకు నచ్చినవాడిని చేసుకుని లైఫ్‌లో సెటిల్ అయిపో అని సలహా ఇచ్చాడు. నా క్లయింట్ ఆ మోసానికి బాధపడి ఏడ్చింది. కోపంగా తిట్టింది. ఎలాచేసుకోవో చూస్తానని బెదిరించింది. సురేష్ ఆ కోపానికి బెదరలేదు. నిర్లక్ష్యంగా వెళ్ళిపోయాడు. సురేష్ పెళ్ళి చేసుకోనని తిట్టిన సంగతి ఇంట్లో తెల్సి తల్లిదండ్రులు చివాట్లు పెట్టి, జరిగింది జరిగింది. ఇంక ఇల్లు కదలడానికి వీల్లేదని కట్టడి చేశారు. కూతురు ఏదో అమాయకంగా ఆకర్షింపబడి ప్రేమ అనుకుంది అనుకున్నారు తప్ప సెక్స్ సంబంధం వుందని తెలియలేదు వారికి.

దురదృష్టవశాత్తూ సురేష్ జాగ్రత్త తీసుకున్నా నా క్లయింట్ నెల తప్పింది. నా క్లయింట్‌కి భయంతో దిక్కు తోచలేదు. మళ్ళీ సురేష్‌ని కల్సి బతిమాలి ఎలాగైనా వివాహానికి ఒప్పించాలని చూసింది. సురేష్ తన తప్పేమీ లేదని, తను జాగ్రత్త తీసుకున్నానని, ఇంకెవరితోనో తిరిగి ఆ నేరం నామీద మోపి పెళ్ళి చేసుకోవాలని నాటకం ఆడుతున్నావని నీచంగా అవమానించాడు. కనీసం డాక్టరు దగ్గిరకి తీసికెళ్ళడానికి కూడా ప్రయత్నించలేదు. తనకేం పట్టనట్టు చేతులు దులుపుకున్నాడు. అతను చేసిన అవమానం నా క్లయింట్‌లో ప్రతీకార జ్వాలలు రేపింది. ఇద్దరూ కల్సి చేసిన తప్పులో తనొక్కర్తే ఎందుకు శిక్షించబడాలన్న ఆవేశం వచ్చింది. తన జీవితాన్ని పణంగా పెట్టయినా ఈ అన్యాయం కోసం పోరాడాలని, సురేష్‌కి బుద్ధి చెప్పాలని, మగాళ్ళకి ఒక గుణపాఠం నేర్పాలన్న కసి, పట్టుదల పెరిగింది.

"తన భవిష్యత్తు, తమ కుటుంబం పరువు ప్రతిష్ఠలని కూడా లెక్క చెయ్యకుండా కోర్టుకెక్కి న్యాయం కోసం పోరాడాలని నిర్ణయించుకుంది. అప్పుడు ఒక

రాత్రి నన్ను రహస్యంగా కల్సి నా సహాయం కోరింది. ఆమె కథ విని ఆమె ధైర్యానికి ఆశ్చర్యపడ్డాను. చేసిన పని తప్పని తెలుసుకుని తప్పుని సరిదిద్దుకుని న్యాయం కోసం పోరాడుతున్న ఆమెకి అన్ని విధాల సహాయపడాలని నిర్ణయిం చాను. ఆమెకి అండగా నేనుంటానని మాటి చ్చాను. కోర్టు కెక్కడానికి తల్లితండ్రులు అంగీకరించని పక్షంలో ఆమెకి అండగా వుండి ఆశ్రయం ఇస్తానని అభయం ఇచ్చాను. కోర్టు కెక్కేముందు అతని తండ్రిని కల్సి పరిస్థితి వివరించి ఆయన సహాయం కోరమని సలహా ఇచ్చాను. అతని తండ్రి కూడా ఒక న్యాయవాది అయివుండి, ఆడపిల్లకి జరిగిన అన్యా యానికి బాధపడి సహాయపడడం అటుంచి హీనంగా అవమానకరంగా మాట్లాడి పంపించాడు.

"సురేష్ తండ్రి నా క్లయింట్ తండ్రి ఆఫీసుకెళ్లి కూతుర్ని బజారులో వదిలి పెళ్లి చేసుకోమని మా వాడి మీదకి తోల్తారా అంటూ అందరి ఎదుట అవ మాన పరిచాడు. దాంతో నా క్లయింట్ తండ్రి అవమానం భరించలేక, పైగా కూతురు నెల తప్పిందని గుర్తించి నా క్లయింట్ కోర్టుకెక్కుతుందని విని తిట్టి కూతురిని గదిలో బంధించారు. దాంతో నా క్లయింట్ ఇంట్లోంచి తప్పించుకుని నా ఆశ్రయం కోరింది. ఆ అమ్మాయికి అండగా వుండి, ఏమయినాసరే, ఎంత ఖర్చయినా ఆమెకి న్యాయం జరిగేటట్టు చూడాలని నిర్ణయించుకుని ఈ కేసు ఫైల్ చేశాను.

"యువర్ ఆనర్! ఇది నా కేసు పౌండే షన్. నా క్లయింట్ ఇంకా మైనరే. నా క్లయింట్ మొదట్లోనే ప్రతివాదిని పెళ్లి చేసుకుంటావా అని అడగకపోవడం తెలివితక్కువతనాన్ని చాటుతుంది. అతని ప్రేమని నమ్మి ఆ ప్రేమ పెళ్ళివరకు వెళ్తుందని ఆశించి అతనితో సంబంధం పెట్టుకుంది. ఇప్పుడు అతని బిడ్డకి తల్లి అవబోతున్న తరుణంలో ఆమెకి న్యాయం జరిగేట్టు చూడమని కోర్టువారికి విన్న వించుకుంటున్నాను"

కోర్టులో కలకలం బయలుదేరింది. ఈ కొత్తరకం కేసు అందరినీ ఆకర్షిం చింది. ప్రెస్ రిపోర్టర్లు వివరాలు రాసు కున్నారు. ప్రెస్ ఫొటోగ్రాఫర్ల ఫ్లాష్ బల్బులు వెలిగాయి. జడ్జిగారు కుతూహ లంగా విన్నారు కేసు.

"యు కెన్ ప్రొసీడ్ విత్ ది కేస్" అన్నారు.

"యువర్ ఆనర్ నా క్లయింట్ రూప, ప్రతివాది సురేష్ కల్సి తిరగడం చూసిన నలుగురయిదుగురు సాక్షులని ప్రవేశ పెట్టడానికి అనుమతి కోరుతున్నాను" అంది సుమతి.

"గ్రాంటెడ్" అన్నారు జడ్జి, "డిఫెన్స్ లాయర్? ఆర్ యూ రెడీ!"

"సురేష్ తరఫున రామనాథంగారు లేచి నిల్చుని "ఎస్ సర్" అన్నారు. ఆయన మొహం కళ తప్పి వుంది. ముద్దాయి ఆయన కొడుకని తెల్సి రిపో ర్టర్లు ఉత్సాహంగా న్యూస్ రాసుకుంటు న్నారు. తోటి లాయర్లు ఈ కేసులో జయాపజయాలు ఎవరివైపు వుంటాయాని ఆలోచిస్తున్నారు.

లాయరు సుమతి తన సాక్షులని ఒక్కొక్కరిని పిల్చింది. టైప్ ఇన్స్టి ట్యూట్ యజమాని, హోటలు బాయిస్,

హోటలు మేనేజర్, విశ్వనాథంగారి స్నేహితులు అందరిచేతా రూప, సురేష్ కల్సి తిరగడం చూసినట్లు సాక్ష్యాలు చెప్పించింది. వారందరినీ రామనాథంగారు క్రాస్ ఎగ్జామ్ చేశారు. ఆయన సాక్ష్యాలని ఎంత తికమకపెట్టే ప్రశ్నలు వేసినా సాక్షులంతా రూప, సురేష్ కల్సి తిరగడం ధృవపరిచారు. విశ్వనాథంగారిని క్రాస్ ఎగ్జామ్ చేస్తూ ఆడపిల్లని కట్టడిచేసి జాగ్రత్త పెట్టుకోకుండా బాధ్యతా రహితంగా వదిలి ముద్దాయి మీద నేరం మోపటం బ్లాక్‌మెయిలింగ్ చెయ్యడంకాదా అంటూ ప్రశ్నించారు. విశ్వనాథంగారు

అబ్బాయిలు రోడ్డుమీద తిరిగి ఆడపిల్లలకి కడుపులు చెయ్యడంలో వారి తల్లిదండ్రుల బాధ్యత ఎంతవుందో అలాగే అమ్మాయిలని కట్టడి చెయ్యడంలోనూ అమ్మాయి తల్లితండ్రుల బాధ్యత అంతే వుంటుందని జవాబిచ్చారు. మోసగాళ్ళు ఎవరో, మర్యాదస్తులు ఎవరో ముందే తెలుసుకోలేని ఆడపిల్లలు గోతిలోకి దిగితే ఆ నేరం తల్లితండ్రులది మాత్రమే కాదు, అలాంటి మోసగాళ్ళని కనడమే కాక, కొడుకు చేసిన తప్పుని ప్రోత్సహించే తండ్రులూ నేరస్థులే అన్నారు విశ్వనాథం

విశ్వనాథంగారిని క్రాస్ ఎగ్జామ్ చేస్తూ వారి పిల్లదే తప్పు అని నిరూపించాలని చాలా తాపత్రయ పడ్డారు రామనాథం గారు. విశ్వనాథంగారు చాలా తెలివిగా జవాబులు యివ్వడంతో ఆ ఎత్తు పారలేదు.

సుమతి తరువాత సురేష్‌ని ఎగ్జామ్ చేసింది. రూపతో కల్సి తిరిగినట్టు, రూపతో కొన్నాళ్ళ వట్టి ప్రేమకలాపాలు, తరువాత సెక్స్ సంబంధం కలిగినట్టు, రూప వివాహం ఆడమని కోరితే నిరాకరించినట్టు అన్నీ తెలివిగా సురేష్ ఒప్పుకునేట్టు చేసి ఫాక్ట్స్ ఎస్టాబ్లిష్ చేసింది కోర్టులో.

క్రాస్ ఎగ్జామ్‌లో రామనాథంగారు సురేష్ పెళ్ళాడుతానని ఎన్నడూ చెప్పలేదని, రూప చివరివరకు అసలు ఆ ప్రశ్న అడగలేదని, తన చదువు అవని కారణంగా, ఉద్యోగం వచ్చి స్వతంత్రంగా తన కాళ్ళ మీద నిలబడే వరకు పెళ్ళి ప్రయత్నం లేదన్నట్లు జవాబులు చెప్పించి సురేష్ పొరపాటు కాదని, రూపదే పొరపాటన్న పాయింట్ ఎస్టాబ్లిష్ చెయ్యడానికి ప్రయత్నించారు ఆయన.

రూపని క్రాస్ ఎగ్జామ్ చేస్తూ రకరకాల తికమక ప్రశ్నలడిగి ఆమెదే తప్పని నిరూపించడానికి ప్రయత్నించారుగాని, రూప కుండబద్దలు కొట్టినట్టు జరిగిందంతా అక్షరం పొల్లు పోకుండా చెప్పింది. ఆమె ధైర్యానికి కోర్టులో అంతా ఆశ్చర్యపడ్డారు.

సుమతి తన ఆఖరు సాక్షిగా రామనాథంగార్ని బోను ఎక్కించింది.

"ప్రతి వాది సురేష్‌కి, మీకు బంధుత్వం వుందా?" ఆ ప్రశ్నకి రామనాథం గారు ఏమిటీ వెర్రివెధవ ప్రశ్న అన్నట్టు హేళనగా "వుంది!" అన్నాడు గడుసుగా ఆన్సర్ టు ది పాయింట్ అన్నది అక్షరాలా అమలు పరుస్తూ.

"ఆ బంధుత్వం ఎలాంటిది?"

"ప్రతి వాదికి తండ్రిని నేను"

"సురేష్‌కి ముందు యింకా ఎవరన్నా పిల్లలున్నారా మీకు?"

"మరొక కొడుకున్నాడు" జవాబిస్తున్నా సుమతి ఈ ప్రశ్నలడగడంలో అంతరార్థం ఏమిటా అని ఆయన లాయరు బుర్ర చురుకుగా ఆలోచిస్తూంది.

"మీకు వివాహం అయి ఎన్ని సంవత్స రాలయింది ?"

"ఇరవై ఏడు సంవత్సరాలు"

"వివాహానికి పూర్వం మీరే స్త్రీ నన్నా ప్రేమించారా ?"

"అబ్జక్షన్ యువర్ ఆనర్. నా క్లయింట్ కేసుకి నా ప్రేమకి ఏం సంబంధం లేదు. ఐ అబ్జక్ట్ టు ఆన్సర్..."

రామనాథంగారు మొహం ఎర్రబడగా అన్నారు. జడ్జిగారు సుమతి వంక చూశారు. "సంబంధం వుంది. ఆ సంగతి తరువాత నిరూపిస్తాను" అంది. జడ్జిగారు ఒక్కక్షణం ఆలోచించి "అబ్జక్షన్ ఓవర్ రూల్డ్" అన్నారు.

"చెప్పండి వివాహానికి పూర్వం మీరెవరినన్నా ప్రేమించారా ?" సూటిగా చూస్తూ అడిగింది.

"లేదు" మొహం గంటు పెట్టుకుని అన్నారాయన.

"పోనీ వివాహానికి తరువాత ఏ స్త్రీతో నన్నా సంబంధం పెట్టుకున్నారా ?"

ఈసారి రామనాథంగారి మొహం మరింత ఎర్రబడింది.

"అది నా పర్సనల్ మాటర్. కేసుతో సంబంధం లేదు''

"ఆన్సర్ టు ది పాయింట్" సుమతి గంభీరంగా అంది.

"లేదు" తిరస్కారంగా సుమతి వంక చూస్తూ అన్నారు.

"నిజం చెపుతానని ప్రమాణం చేశారని మరిచిపోయారా ? పాతికేళ్ళ క్రితం వివాహం అయి యిద్దరు బిడ్డలు కలిగాక కూడా ఒక స్త్రీని ప్రేమించినట్టు నమ్మించి ఆమెతో శారీరక సంబంధం కొనసాగించి, తీరా ఆమె గర్భవతి అయ్యాక ఆమె పెళ్ళాడమని కోరగానే మీరు వివాహితులని చెప్పి తప్పుకుని ఆమె ఖర్మానికి ఆమెని వదిలి మీరు మోసం చెయ్యలేదూ. ఇది నిజమా అబద్ధమా?'' తీవ్రంగా అడిగింది సుమతి.

రామనాథంగారు ఎర్రబడ్డ మొహం దించుకున్నారు.

"ఆన్సర్ టు ది పాయింట్ మిస్టర్ రామనాథం" జడ్జి హెచ్చరించారు.

"నిజమే" గొంతు పెగుల్చుకుని ఎలాగో అన్నారు.

"యువర్ ఆనర్! ఈనాడు ముద్దాయి సురేష్ చేసిన నేరమే ఇరవై ఏళ్ళ క్రితం తండ్రి చేసి శిక్షింపబడకుండా తప్పించుకో గలిగారు. ఆనాటి ఆ స్త్రీకి ఈనాటి నా క్లయింట్‌కి వున్న ధైర్యసాహసాలు లేక పోబట్టి చేసిన తప్పు బయటికి రాకుండా సమాజంలో పెద్ద మనిషిగా చలామణి అయ్యారు ఇన్నేళ్లు. ఆనాడు తండ్రి, ఈనాడు కొడుకు...ఇలా స్త్రీల జీవితాలతో ఆటలాడుకోడం ఈ వంశంలో వారికి అలవాటని, తను చేసిన తప్పే కొడుకూ చేస్తే కనీసం గతం గుర్తు తెచ్చుకుని తను వివాహితుడు కనక ఆనాటి స్త్రీకి న్యాయం చేకూర్చ లేకపోయినా ఈనాడు కొడుకు చేసిన తప్పుని సరిదిద్ది ఆమెని వివాహం ఆడమని పెద్దమనిషిగా సలహా యిచ్చి ఔదార్యం, హృదయ వైశాల్యం చాటు కోవల్సింది పోయి కొడుకు తరపున వకాలా తీసుకుని కొడుకు చేసిన నేరం కప్పి పుచ్చాలని చూడడం క్షమార్హం కాదని తెలియ పరచడానికి ఆ ప్రశ్న అడిగాను

"యువర్ ఆనర్! నా క్లయింట్ రూప, ముద్దాయి సురేష్ కలిసి తిరిగినట్లు, హోటల్లో గడిపినట్లు ఈ సాక్ష్యాలవల్ల

ఋజువు చెయ్యడానికి ప్రయత్నించాను. నా క్లయింట్ "తెలివి తక్కువ తనం వల్ల, పెళ్ళి చేసుకోవాలన్న షరతు పెట్టలేదు. అతని ప్రేమ నిజమని, ఆ ప్రేమ పెళ్ళిదాక వెడుతుందని నమ్మింది. పెళ్ళికి ముందు సెక్స్ సంబంధం పెట్టుకోడం నా క్లయింట్ పొరపాటే-ఆ విషయంలో ఆమెది తొందరపాటే.

"యువర్ ఆనర్! యుగయుగాలుగా పురుషుని తీపి మాటలు నమ్మి స్త్రీ మోసపోతూనే వుంది. వయసుకి సహజమైన, ప్రకృతిసిద్ధమైన ఆకర్షణలకి, వ్యామోహానికి లొంగి తప్పటడుగు వేస్తూనేవుంది. పురుషునిలో బలహీనతలు వున్నట్టే స్త్రీ మనిషే కనక సహజ వాంఛలకి లొంగిపోయే బలహీనత వుంటుంది. కాని మన సమాజం పురుషుని బలహీనతలని క్షమిస్తుంది. అది నేరంగా పరిగణించదు. పురుషుడు ఏం చేసినా అది ప్రకృతి సిద్ధంగా, సహజంగా భావించి పట్టించుకోదు. అదే బలహీనతలకి స్త్రీ లోనయితే ఆ స్త్రీ మీద చెడిపోయిన ముద్రవేస్తుంది సమాజం. ఆస్త్రీకి మరి సంఘంలో భవిష్యత్తు వుండదు. పవిత్రత శీలం అన్నీ స్త్రీలకే పరిమితి చేసి స్త్రీని అణగదొక్కుతూనే వుంది ఈనాటికీ సమాజం.

"పురుషుడు వివాహానికి పూర్వం ఎన్ని ప్రేమకలాపాలు జరిపినా తప్పు లేదు. ప్రేమించానని కల్లబొల్లి కబుర్లు చెప్పి, స్త్రీని విలాసవస్తువుగా అనుభవించి, అవసరం తీరాక వదిలి తను మహారాజులా పెళ్ళి చేసుకొంటాడు. ప్రేమించడానికి; అనుభవించడానికి ఏ అభ్యంతరాలు, ఏ పెద్దలు, ఏ వంశ గౌరవాలు, కులాలు, మతాలు ఏవీ అడ్డురావు. పెళ్ళి వేళకి వచ్చేసరికి బాధ్యతలు, పెద్దల ఆంక్షలు, వంశ ప్రతిష్టలు అడ్డు వస్తాయి.

"ఒకసారి ప్రేమ కలాపాలు జరిపిన స్త్రీని వివాహం ఆడడానికి ఏ పురుషుడూ ముందుకు రాడు. ఖర్మం కాలి ఆ స్త్రీ సంతానవతి అయితే ఆమె భవిష్యత్తుకి పూర్తిగా దారి మూసుకుపోతుంది. ఆ సంతానం అక్రమ సంతానంగా పరిగణింపబడి సమాజంలో స్థానం కోల్పోతుంది. మంచిదే! వివాహానికి పూర్వం సంతానం పొందే అర్హత లేదని మన సమాజం నిర్ణయించడం మంచిదే! అక్రమంగా సంతానం పొందడం తప్పని నిర్ణయించి అలాంటి స్త్రీని శిక్షించినపుడు ఆ సంతానం పొందడానికి కారణమైన పురుషుడు ఎందుకు శిక్షార్హుడు కాడు!?

దొంగతనం నేరం, హత్య శిక్షార్హం, ఫోర్జరీ నేరం, వ్యభిచారం నేరం, మరొకరి భార్యతో పొందు నేరం...ఇవన్నీ నేరాలయి శిక్షార్హమైనపుడు, ఒక స్త్రీని వివాహం ఆడకుండా సంతానవతిని చేయడమూ నేరమని అలాంటి అక్రమ సంతానాన్ని కలిగించిన పురుషుని ఎందుకు శిక్షించదు మన సమాజం?"

"వెల్ సెడ్" కోర్టులో చప్పట్లు మారుమోగాయి. అందరూ ఆమె వాదనని ప్రశంసించారు.

"ఆర్డర్ ... ఆర్డర్" జడ్జీగారు అన్నారు. సుమతి ఆ ప్రోత్సాహంతో మరింత ఆవేశం పుంజుకుంది.

"యువర్ ఆనర్! ఇద్దరూ కలిసి చేసిన నేరంలో స్త్రీ ఒకతే శిక్షించబడడం అనాదిగా వస్తున్న ఆచారం. ఆ ఆచారం ఈ నవీన యుగంలో, ఈ అణుయుగంలో కూడా ఇంకా అమలుపరచడం ప్రగతి శీలతకి చిహ్నమా? మన సమాజంలో వస్తున్న మార్పులు, మనం సాధించిన

అభ్యుదయం అంతా వేష భాషలకే పరిమితమా? యుగాలనాటి ఈ ద్వంద్వ నైతిక, నీతి ప్రమాణాలు సవరించాల్సిన బాధ్యత మన చట్టాలకి లేదా?



"యువర్ ఆనర్! ఏ స్త్రీకి అయినా అక్రమంగా కన్నా, సక్రమంగా కన్నా బిడ్డ మీద తల్లికి ఎప్పుడూ ప్రేమ వుంటుంది. మాతృత్వంలోని మహిమ





అదే! సంఘానికి భయపడి ఎంత మంది తల్లులు భ్రూణ హత్యలు చెయ్యలేదు! తమ బిడ్డలని చెత్త కుండీలు, శరణాలయాల పాలు చెయ్యలేదు. నిర్దయగా బిడ్డని దూరం చేసుకున్న ఆ తల్లి మనస్తాపం ఎవరైనా గుర్తించి జాలి పడతారా? ఏ స్త్రీ ఎలా కన్నా బిడ్డకి దూరమయి అనుభవించే రంపపు కోతకి గురిచెయ్యడం సభ్య ప్రపంచం చెయ్యాల్సిన పని కాదు. తల్లిదండ్రులు చేసిన తప్పుకి ఆ బిడ్డని అనాథగా చేసి శిక్షించడం అన్యాయం, అక్రమం. ఏ నేరానికి ఆ బిడ్డ అనాథగా నరకం అనుభవించాలి.

"యువర్ ఆనర్! రేపు నా క్లయింట్‌కి బిడ్డ పుడితే ఆ బిడ్డ భవిష్యత్తు ఏమిటి? అక్రమ సంతానంగా ఆ బిడ్డకి సంఘంలో స్థానం వుంటుందా? తండ్రి లేకుండా పుట్టిన బిడ్డని సమాజం ఎందుకాదరించదు? తల్లి, తండ్రి బతికి వుండి ఆ బిడ్డ దిక్కు మొక్కులేని అనాథగా ఎందుకు బతకాలి? అందుకే నా క్లయింట్ రూప తను చేసిన తప్పుకి బిడ్డని శిక్షించ దలచలేదు. తన బిడ్డకి తండ్రి ఫలానా అని లోకానికి తెలియచెప్పడానికే ఆమె కోర్టు కెక్కింది.

"యువర్ ఆనర్! నా క్లయింట్ ఈ తరం ప్రతినిధి. యుగాలనాటి స్త్రీల మాదిరి పిరికిది కాదు. తను చేసిన పని నలుగురిలో తెలిసే సిగ్గుతో ఆత్మహత్య చేసుకోడమో, చేసిన పాపాన్ని చాటుగా కడుక్కుని చేతులు దులుపుకోవాలనే పిరికిది కాదు. ధైర్యంగా అన్యాయాన్ని ఎదుర్కొనడానికి నిలబడింది. తను చేసిన పని సమాజంలో శిక్షార్హమైనదైతే తనతో పాటు తప్పు చేసిన సురేష్ కూడా శిక్షార్హుడేనని న్యాయస్థానంలో న్యాయం కోరుతోంది. యువర్ ఆనర్! ఎట్టి పరిస్థితిల్లోనూ నా క్లయింట్ బిడ్డని దూరంచేసుకోడానికి ఇష్టపడడం లేదు. సంఘాన్ని ఎదిరించి ఎలా కన్నా ఏ తల్లి నించి బిడ్డని వేరు చేసే హక్కు ఎవరికీ లేదని ఆ బిడ్డని పెంచుకుని నిరూపించ దల్చింది. విత్తనం ఎవరు నాటినా ఏ భూమిలో పండితే ఆ భూమి ఎవరిదైతే ఆ పంట ఫలం వారనుభవించటం ఆచారం. అలాగే విత్తనం ఎవరిదైనా స్త్రీ గర్భంలో బిడ్డ పెరిగి, ఆ స్త్రీ ద్వారా ఆ బిడ్డ యీ లోకంలోకి వచ్చినపుడు, ఆ బిడ్డ ఆ స్త్రీకే చెందాలి గాని ఆ బిడ్డ మీద హక్కు పురుషునికి చెందడంలో ఎంత న్యాయం వుంది. తోటమాలి విత్తు నాటినంత మాత్రాన ఆ పంట అతనిది కాదు. ఆ తోట ఎవరిదైతే ఆ పంట వారికి చెందడం రివాజు. ఆ సూత్రం బిడ్డల విషయంలో ఎందుకు అమలు జరగడం లేదు?

"యువర్ ఆనర్! మన సమాజం, మన దేశమేకాదు ఏ దేశంలోనైనా బిడ్డ మీద హక్కు పురుషునికిచ్చింది చట్టం. న్యాయం ఆలోచిస్తే యిది చాలా అన్యాయం. నవమాసాలు మోసి, నరక యాతన పడి కని, అష్టకష్టాలకు ఓర్చి పెంచిన తల్లికి హక్కు ఈయకుండా తండ్రికి బిడ్డమీద హక్కు ఈయడంలో ఉద్దేశం–ఆ విధంగా స్త్రీలని తమ గుప్పిటలో వుంచుకుని ఆమె బలహీనతని తమ చేతిలో వుంచుకుని ఆమెని తమ చెప్పు చేతల్లో వుంచుకోడానికి పురుష ప్రపంచం ఏర్పరచిన ఈ చట్టం ఎంతవరకు సమంజసం? ఆలోచించి సవరించాల్సిన అవసరం మన రాజ్యాంగానికి లేదా?

"స్త్రీలో యీ బలహీనతని ఆధారం చేసుకుని యుగాలుగా పురుషుడు స్త్రీని బానిసగా చేసుకుని తన ఆధిక్యత నిరూపించుకుంటున్నాడు. భర్తతో ఎంత నరకం అనుభవిస్తున్నా బిడ్డలకోసం ఆ నరకం సహిస్తూ, ఎందరు స్త్రీలు కాపురం చేయడం మనం చూడడం లేదు? అటు భర్త నిరాదరణని, దుర్మార్గాన్ని సహించలేక యిటు బిడ్డలని వదలలేక తరుణోపాయం లేక వారి ఓర్మి ఆఖరి మెట్టుకు వచ్చాక, ఎందరు స్త్రీలు ఆత్మహత్యలు చేసుకోడం లేదు. పిల్లల కోసమే సగంమంది స్త్రీలు

భర్తల దౌర్జన్యాన్ని సహిస్తున్నారు. పిల్లలని వదలలేక, పిల్లలని ఈయరన్న భయంతోనే స్త్రీ పురుషుని ఆధిక్యానికి తల ఒగ్గి బతుకుతూంది! పురుషునికంటే ఏ విషయంలోనూ తీసిపోని స్త్రీకి మాతృత్వం ఒక వరం కాదు. శాపమై పురుషునికి లొంగి వుండాల్సి వస్తుంది. బిడ్డని కని పెంచిన తల్లికే బిడ్డపై హక్కు యిస్తే పురుషుని ఆట ఎప్పుడో కట్టేది.

"భర్త క్రూరుడు, దుర్మార్గుడు అయి హింసిస్తే అతనికి తల ఒగ్గి బతకనవసరం లేకుండా బిడ్డలని తీసుకెళ్ళి ఏ కూలి నాలి అయినా చేసి ఆమె బిడ్డలని పోషించుకోగలదు. తను హింసిస్తే స్త్రీ యిక సహించదని పురుషుల కర్థమైతే అపుడు స్త్రీని, భార్యని, తమ కష్ట సుఖాలలో పాలు పంచుకునే అర్థాంగిని గౌరవంగా చూడగలుగుతారు. తను హింసిస్తే భార్య బిడ్డలతో యిల్లు వదులుతుందన్న భయం వున్ననాడు తన ఆధిక్యత అడుగడుగునా చూపకుండా సమానస్థాయి ఇస్తాడు స్త్రీకి."

"యువర్ ఆనర్! ఈ సమాజంలో బిడ్డపై తల్లికి హక్కు యిచ్చిన రోజు ప్రతీ స్త్రీ యిల్లు వదిలితే కుటుంబ వ్యవస్థ దెబ్బ తింటుందని కొందరనవచ్చు-కాని ఏ స్త్రీ కూడా కావాలని భర్తకి,సంసారానికి దూరమవడానికి కోరుకోదు. ఆ యిల్లు ఎంతో నరకమైతే తప్ప ఆ యిల్లు వీడి రోడ్డున పడదు. ఆ భర్త ఎంతో క్రూరుడయితే తప్ప ఆ సెక్యూరిటీ వదులుకోదు. అంచేత యువర్ ఆనర్! స్త్రీకి బిడ్డల మీద హక్కు యిచ్చి-తండ్రి ప్రసక్తి లేకుండా బిడ్డ తల్లికి చెందినపుడు యిన్ని భ్రూణ హత్యలు, ఇంతమంది అనాథలు, యింతమంది స్త్రీల ఆత్మహత్యలు, ఇంత మంది పతితలు మన సమాజంలో వుండరు..."

మరోసారి చప్పట్లు మోగాయి కోర్టులో. ఆవేశంగా ఏకధాటిగా పదిహేను నిమిషాలు వాదించిన సుమతి వూపిరి తీసుకుంది. జడ్జిగారు కూడా ఆమె వాదాన్ని మెచ్చుకుంటున్నట్టు చూశారు.

"యువర్ ఆనర్! ఇప్పుడు మన కేసుతో డైరెక్ట్‌గా సంబంధం లేకపోయినా ఒక పురుషుని చేత మోసగింపబడి, యీ సమాజం కట్టుబాట్లకి లోబడి అసహాయురాలై ఒక తల్లి తన బిడ్డని శరణాలయం పాలుచేసిన అమ్మాయిని కోర్టులో ప్రవేశ పెట్టటానికి అనుమతి కోరుతున్నాను" అంది అభ్యర్థిస్తూ.

జడ్జిగారు సాలోచనగా చూసి. "ఎగ్జాక్టిలీ. వాట్ డు యూ వాంట్ టూ టెల్?" అనడిగారు.

"చెప్తాను యువర్ ఆనర్! తల్లితండ్రి ఎవరి బతుకులు వారు హాయిగా బతుకుతూండగా వారి పాప ఫలం అయిన అమ్మాయి అనాథగా ఎంత నికృష్ట జీవితం గడిపిందో మీ అందరూ ఒక్కసారి వింటే, మానవత్వం వున్న మనుషులు కరిగిపోతారు. సరోజా. ఇలా రామ్మా..." కోర్టులో బెంచీలో కూర్చున్న సరోజనిని బోనులో నిలబెట్టింది.

అందరూ సుమతి ఏం చెప్పదలచిందా అని ఆరాటంగా చూశారు. సరోజని బోనెక్కించగానే రామనాథంగార్కి ఏదో అర్థమైనట్టు ఆయన మొహం నల్లబడింది.

"ఐ అబ్జక్ట్ యువర్ ఆనర్. కేసుకి సంబంధించని విషయాలతో కేసుని పక్కదారులకి పట్టించాలని చూస్తున్నందున అబ్జక్షన్ చెప్తున్నాను" అన్నారు రామనాథం ఆవేశంగా లేచి. జడ్జిగారు ప్రశ్నార్థకంగా సుమతి వంక చూశారు.

"యువర్ ఆనర్ ! కేసుతో సంబంధించని మాట నిజమే, కాని మానవతతో సంబంధం వుంది సార్. ఒక స్త్రీ ఒక పురుషుడు చేసిన తప్పుకి కారణంగా ఆ తండ్రి మోసానికి, ఆ తల్లి పిరికితనానికి సాక్ష్యంగా అన్నెం పున్నెం ఎరుగని ఆ పసిబిడ్డ పదిహేనేళ్ల పాటు అనాథగాఅనాథాశ్రమంలో అడుగడుగునా ఈ సడింపుల మధ్య, తిరస్కారాల, చివాట్లు, చెప్పుదెబ్బలు, హేళనల మధ్య, ఆకలితో ఎలా అలమటించిందో, బతుకు పట్ల ఆ పసిబిడ్డకి ఏర్పడిన విరక్తి, భయంతో అనుక్షణం ప్రతి దానికి బెదిరిపోతూ జీవచ్ఛవంలా బతకడానికి ఈ బిడ్డ చేసిన నేరం ఏమిటని న్యాయస్థానాన్ని అడగడం కోసం ఈ అమ్మాయిని బోనెక్కించాను యువర్ ఆనర్."

"యువర్ ఆనర్ ! మూడేళ్ల క్రితం అనాథ శరణాలయంనించి ఈ పాపని తీసుకొచ్చిన రోజున-కంచంలో కూర, చారు, పచ్చడితో వున్న మామూలు భోజనం ముందు కూర్చోపెట్టగానే ఈ అమ్మాయి కళ్లల్లో మెరిసిన మెరుపు, ఆనందం, ఆశగా, ఆరాటంగా, అంతా ఒక్కసారి తినేయాలన్నంత ఆరాటం యువర్ ఆనర్ ఆ క్షణంలో ఆ పిల్ల మొహం చూసిన ఎవరికన్నా అన్నాళ్లూ ఆమె గడిపిన అనాథ జీవితం ఎంత నికృష్టమైనదో ఎవరూచెప్పనక్కర లేకుండానే గుర్తించేవారు. అడుగు వేసి తీయడానికి భయం, ఎక్కడ కూర్చుంటే ఏం తప్పో అనే బెదురు చూపులు, ఆఖరికి మంచి నీళ్లు మంచుకు తాగడానికి కూడా బెదురుతూ ఆత్మ విశ్వాసం కోల్పోయిన ఆ పదిహేనేళ్ల బాలిక ఏ నేరానికి ఈ శిక్ష అనుభవించాలి!!

మంచి బట్టలు కొనిచ్చిన మొదటి రోజు అవి చూసిన ఆమె కళ్లల్లో ఆనందం, కృతజ్ఞత, మెత్తటి పక్క మీద పడుకుని ఆ అనుభూతిని అనందించే ఆమె పారవశ్యం,యింతటి సుఖం ఈ తృప్తి ఆనందం అంతా నిజమేనా అన్న అపనమ్మకం, ఈ సుఖం శాశ్వతం కాదేమో అన్నదిగులు, జరిగింది కలా నిజమా అన్న అనుమానం, ఈ కల చెదిరి, ఈసుఖానికి దూరమై మళ్లీ ఆ నరకంలో పడిపోతానేమోనన్న ఆవేదన... పట్టుమని పదిహేనేళ్లు లేని ఈ పాప మొహంలో ఈ భావాలన్నీ కదలాడుతూంటే చూసిన మానవత్వం వున్న మనుషులెవరు చలించకుండా వుండలేరు. ఆ నరకం నించి తప్పించి తీసుకొచ్చిన నన్ను కౌగిలించుకుని హృదయ విదారకంగా... ఏడ్చిన ఏడ్పు ఏ కసాయి గుండెనన్నా కరిగిస్తుంది. అక్రమ సంతానంగా జన్మించి అనాథ శరణాలయం పాలైన వందలు వేలు అనాథలలో ఈ పాప ఒకర్తి-!

ఈనాడు నా క్లయింట్ కివున్న ధైర్య సాహసాలు ఈమె తల్లికి ఆనాడు వుండి వుంటే ఈ బిడ్డ అనాథగా నరకంలో మగ్గేదికాదు. ఎన్ని కష్టాలు, నష్టాలు ఎదురయినా బిడ్డని పెంచుకుంటాను అనే నా క్లయింట్ ఆత్మ, విశ్వాసం ఆనాడు ఆ తల్లికి వుంటే ఈ పాప అనాథగా పెరగవల్సిన అవసరం వుండేది కాదు. ఈనాడు నా క్లయింట్ కి అండగా నేను నిల్చినట్టు ఆ తల్లికి సాటి స్త్రీ ఒకరన్నా అండగా నిల్చుని వుంటే ఈనాడు ఆ తల్లి బిడ్డని అనాథగా వదిలి నందుకు కుమిలిపోయే అవసరం వుండేది కాదు.

"యువర్ ఆనర్! ఈ అనాథ బిడ్డ తల్లి ఎవరో కాదు 'నే నే' యువర్ ఆనర్. ఇర వై ఏళ్ళక్రితం ఒక పురుషుని ప్రేమ నిజమని మోసపోయిన ఫలితం యీ పాప! ఆ మోసం చేసిన పురుషుడు ఎవరోకాదు. ఈనాడు కొడుకు చేసింది తప్పని తెలిసీ, తప్పు కాదని న్యాయ స్థానంలో వాదిస్తున్న తండ్రి లాయర్ రామనాథంగారు. ఈనాడు కొ డు కు, ఆనాడు తండ్రి యిద్దరి స్త్రీల జీవితాలతో ఆటలాడుకున్నారు"

కోర్టులో కలకలం. అంతా ఒక్కసారిగా ఆశ్చర్య చకితులయి గోల గోలగా మాట్లాడసాగారు. జడ్జి కూడా ఆశ్చర్య పోయారు.

రామనాథంగారు అవమానంతో తలెత్తుకోలేక నల్లబడ్డ మొహాన్ని దించుకున్నారు. రూప, సు రే ష్ కూడా విభ్రాంతులయ్యారు. తెల్సిన అందరూ వింతగా చెప్పుకుంటున్నారు. రెండు నిమిషాలు కోర్టంతా రణగొణ ధ్వని.

జడ్జిగారు చప్పున తేరుకుని "ఆర్డర్. ఆర్డర్" అంటూ కేక పెట్టారు.

సు మ తి గొం తు సవరించుకుని "యువర్ ఆనర్! కన్నతల్లిని బతికుండగా నా కడుపున పుట్టిన బిడ్డ కడుపు నిండా తిండికైనా నోచుకోక అనాథగా బతకాల్సిన దుస్థితికి కారణం ఏమిటి? మన సమాజపు కట్టుబాట్లు. సమాజంలో బతుకుతూ సమాజపు కట్టుబాట్లు దాట లేని మన పిరికితనం. ఇద్దరం కల్సి చేసిన తప్పులో శిక్ష నాకు, నా బిడ్డకి లభించింది. వివాహానికి,కాపురానికి దూరమై మోడులా ఏకాకిగా బతుకుతూ నేను, అనాథగా దుర్భర జీవితం గడుపుతూ నా బిడ్డ శిక్షించబడ్డాం సమాజం చేత.కానీమమ్మల్నీ దుస్థితిపాలు చేసిన పురుషుడు మాత్రం హాయిగా సంఘంలో పెద్దమనిషిగా చలామణి అవుతూ భార్యాబిడ్డలతో సుఖంగా వున్నారు.

"యువర్ ఆనర్! ఇదేం న్యాయం? పురుషునికో నీతి, స్త్రీకో నీతి ధర్మశాస్త్రంలో ఎందుకు రాయబడి వుంది. ఈ ద్వంద్వనైతిక నీతి సూత్రాలు యిప్పటికైనా సవరించి స్త్రీకి న్యాయం చేకూర్చ వలసిన అవసరం మన సమాజానికి, మన రాజ్యాంగానికి, మన చట్టాలకి లేదా- యువర్ ఆనర్! ఈనాడు నాక్లయింట్ కి వున్న ధైర్యం ఆనాడు నాకుంటే, నా బిడ్డ యిన్నేళ్లు అనాథగా బతికేదికాదు. ఆమెకున్న ఆత్మ విశ్వాసంలో పదో వంతన్నా నాకు వుండివుంటే కన్నబిడ్డని అనాథ శరణాలయంనించి తెచ్చుకుని పెంపుడు కూతురని అబద్ధాలు చెప్పుకునే దాన్నికాదు. తమబిడ్డ భవిష్యత్తు కోసం నా తల్లి తండ్రులు నా బిడ్డ భవిష్యత్తు అంధకారం చేస్తుంటే ఎదుట ని లి చి ధైర్యంగా పోరాడ గలగడానికి ఆనాడు ఏ సుమతులూ నాకు అండగా లేక పోయారు.

"అందుకే యువర్ ఆనర్!నాక్లయింట్ నా దగ్గిరకి వచ్చి తన కథ చెప్పి న్యాయ స్థానంలో తనకోసం నన్ను పోరాడమని కోరగానే ఆమె ధైర్యాన్ని అభినందించాను. బిడ్డకి దూరమైన బాధ ఎలాంటిదో తెలుసు కనక ఏమ యినా ఆమె తరఫున నిలబడి తల్లీ బిడ్డలని ఎవరూ వేరు చెయ్యకుండా చూడాలని నిర్ణయించుకున్నాను.

"ఒక పురుషుని చేత మోసగింపబడితే ఆ అవమానం, కసి, బాధ ఎలాంటిదో తెల్సు కనకే ఆ పురుషునికి ఆనాడు బుద్ధి చెప్పలేకపోయినా ఈనాడు బుద్ధి చెప్పా

లని కంకణం కట్టుకున్నాను. నాలాంటి ఒక ఆడపిల్లని నా అవస్థలో పడకుండా కాపాడాలని నిర్ణయించి ఆమెకి అండగా నిలిచి ఆమెకి న్యాయం చేకూర్చడానికి నా శాయశక్తులా పోరాడాలని నిర్ణయించాను. చిన్నదైనా ఆమె మనో నిబ్బరం చూసిన తరువాతే పదిమందిలో సరోజని నా కూతురని చెప్పుకునే మనస్థైర్యం చిక్కింది నాకు!

"యువర్ ఆనర్! ఈనాడు నా క్లయింటికి జరిగిన అన్యాయం ఇదివరకు వేలు, లక్షల మంది స్త్రీలకి జరిగింది. ఈ పాత కథని కొత్త మలుపు తిప్పి, మోసగించబడుతున్న స్త్రీలకి ఓ దారి చూపాలని కోర్టువారికి విన్నవిస్తున్నాను. పెళ్లి చేసుకునే ఉద్దేశం లేని అమ్మాయిలతో ప్రేమ కలాపాలు జరపడం శిక్షార్హం అన్నది పురుషులకర్థమైతే ఆడదాన్ని వాడుకుని వదిలేసే ఈ పాత కథకి స్వస్తి చెప్పడం జరుగుతుంది.

అక్రమ సంతానాన్ని కన్న స్త్రీకి, అక్రమ సంతానానికి ఈ సమాజంలో ఎలా స్థానం లేదో అలాగే ఆ పురుషునికి వివాహ యోగ్యత వుండకూడదు. న్యాయం, చట్టం, నీతి సూత్రాలు స్త్రీ పురుషులకి ఒక్కలాగే అమలు జరిపిన నాడు ఇన్ని మోసాలకి తావుండదు. ఇంత మంది కన్నె తల్లులుండరు. ఇంతమంది అనాథలుండరు. ఒక స్త్రీతో ప్రేమ వివాహానికి దారి తీయనినాడు ఆ పురుషుడు శిక్షార్హుడని న్యాయస్థానాలు నిరూపిస్తే ఆ పని చేసేముందు పదిసార్లు ఆలోచిస్తాడు.

"యువర్ ఆనర్! ఈ ప్రతివాది సురేష్ చేత మోసగింపబడిన నా క్లయింట్‌కి న్యాయం జరిగేట్టు చూడమని కోర్టువారికి విన్నవించుకుంటున్నాను. ఆమెకి పుట్టిన బిడ్డకి సమాజంలో స్థానంవుండేట్టున్యాయం చేకూర్చమని కోర్టువారిని అభ్యర్థిస్తూ ఇంతటితో నా వాదన ముగిస్తున్నాను."

ఏకధాటిగా ముప్పావుగంట మాట్లాడి సుమతి చమాలుతో నుదుటి చెమట అద్దుకుని కుర్చీలో కూర్చుంది.

కోర్టులో చప్పట్లు మోగాయి. రామనాథం మొహం గుర్తుపట్టలేనంతగా మారిపోయింది. కోర్టులో ప్రేక్షకులు గోలగోలగా కేసులో అంతిమ విజయం సుమతినే వరిస్తుందని నమ్మకంగావాదించుకుంటున్నారు.

జడ్జిగారు "కేసు తీర్పు ఇరవై మూడో తారీఖుకి వాయిదా వేయబడింది" అని కుర్చీలోంచి లేచి ఛాంబర్‌లోకి వెళ్ళిపోయారు.

ప్రెస్ ఫొటోగ్రాఫర్ల కెమేరాల ఫ్లాష్‌లు వెలిగాయి. సుమతి, రూప, సురేష్, రామనాథంల ఫొటోలు తీసుకుంటున్నారు రిపోర్టర్లు.

రూప కేసు ఆరంభించి కేసు నడిచిన యీ పదిహేను ఇరవై రోజులలో రూప కేసు వార్త హైదరాబాదులో సంచలనం సృష్టించింది. మొదటి రోజు పేపర్లలో ఈ వార్త చూసి విశ్వనాథంగారిని, రామనాథంగారిని తెల్సిన అందరూ ఆశ్చర్యపోయారు.

"అయ్యో... ఇదేమిటి విశ్వనాథంగారూ! ఈ కేసేమిటి, కోర్టు ఎక్కడం ఏమిటి–అయ్యయ్యో ఇంక రూపకి పెళ్ళెలా అవుతుందండీ" అంటూ ఆయన ఆప్తమిత్రులు ఆరాటంగా అన్నారు.

ఓ మాదిరి ఖరిచయస్థులు ఎదురుగా అడగడానికి మొహమాటపడి చెవులు

కోరుకున్నారు. ప్రతీవాళ్లు ఎన్నడూ కనీ విని ఎరగని వింతలా మాట్లాడుకోడం మొదలుపెట్టారు. రూప ధైర్యసాహసాలకి విస్తుపోయారు. విశ్వనాథంగారి పరువు ఈ విధంగా కోర్టుకెక్కినందుకు సాను భూతి కురిపించారు.

విశ్వనాథం, పద్మావతి లోకానికి మొహం చూపలేం అన్నట్టు ఇల్లు దాటి బయటకు వెళ్ళడం మానుకున్నారు. విశ్వనాథం ఆఫీసుకి నెల రోజులు శలవుపెట్టేశారు ప్రతివాళ్ళ ప్రశ్నలకి, సందేహాలకి సమాధానం చెప్పలేక. అటు రామనాథం, సురేష్‌లు లోకుల దృష్టిలో దోషుల య్యారు. విశ్వనాథంగారి మీద అందరికీ కనీసం సానుభూతి ఏర్పడింది గాని రామనాథంగారిని అందరూ దుయ్యపట్టారు.

"ఇంతదాకా ఎందుకు రానిచ్చావయ్యా ఏదో గుట్టుచప్పుడు కాకుండా ముడిపెట్టిం చేయాల్సింది" అన్నారు ఆయన హితైషులు.

మొదటిరోజే ఈ కేసు పేపర్లవారిని ఆకర్షించింది. ఫ్రంట్ పేజీలో బ్లాకు కట్టి మరీ ఇలా ఓ ఆడపిల్ల ధైర్యంగా కోర్టు కెక్కిందంటూ న్యూస్ ప్రచురించారు. ఆ రోజు మొదలు ప్రెస్ రిపోర్టర్లతో కోర్టు నిండింది.

రూప స్నేహితులకి, కాలేజి అమ్మాయిలకి ఈ వార్త చాలా ఉత్తేజాన్నిచ్చింది. "హుర్రే...రూపా...బ్రేవో... సురేష్ డౌన్...వుయ్ వాంట్ జస్టిస్... వుయ్ వాంట్ ఈక్వాలిటీ విత్ మెన్ రూపా వాంట్ జస్టిస్. వుయ్ ఆర్ ఆల్ విత్ యూ రూపా..." అంటూ కోర్టు ఆవరణలో గుంపులు గుంపులుగా వచ్చి కేకలు పెట్టారు.

రూపని అందరూ స్వయంగా అభినందించారు. ఆమె ధైర్యసాహసాలని మెచ్చుకున్నారు. ప్రోత్సహించారు. జడ్జిగారిని ఆయన ఛాంబర్‌లో కల్సుకుని ఈ కేసు రూపదే కాదు తమ ఆడపిల్లలందరికీ చెందినదని, కేసుకి న్యాయం చేకూర్చాలని రాసిన మెమొరాండం అందించారు. పత్రికా విలేఖరులు రూపని రకరకాల ప్రశ్నలడిగి ఇంటర్వ్యూ చేశారు.

మొత్తానికి ఆ కేసు నగరంలో సంచలనమే తెచ్చింది. మొదట్లో అయ్యయ్యో కోర్టు కెక్కడమా?పరువేమిటి మర్యాదేమిటి, అన్నవారుకూడ పేపర్లలో వార్తలు, అందరి దగ్గరనించి రూపకి లభించిన ప్రోత్సాహము చూసి రూప చేసిన పని మంచిదేనేమో, ఎవరో ఒకరు ఇలా ధైర్యం చెయ్యకపోతే యీ కుర్రాళ్లకి బుద్ధిరాదు, మంచి పనే చేసింది అనుకోసాగారు ఆడపిల్లల తల్లిదండ్రులు.

తన భవిష్యత్తు నాశనం చేసుకునైనా తన లాంటి ఆడ పిల్లలకి న్యాయం జరగాలని పోరాడుతున్న రూప మీద అందరికీ సానుభూతి కలిగింది. రూప చేసిన పని మొదట అసహ్యించుకున్న వారు, మొదట బరితెగించి ఇప్పుడు సిగ్గులేకుండ కోర్టుకెక్కడమా అని యీసడించిన వారుకూడా నిజమే ఇద్దరూ తప్పు చేశారు. ఆ పిల్ల ఒక్కర్తే ఎందుకు బాధ పడాలి అనసాగారు. నిజమే ఈ నీతి సూత్రాలు మార్చాలి. ఆడదానికో నీతి, మగాడికో నీతి ఏమిటి అని రూపని సమర్థించడం మొదలు పెట్టారు.

విశ్వనాథం, పద్మావతి కూడా—రూప కోర్టు కెక్కి అంతా బట్టబయలు కాగానే యింకా భయపడి దాచుకోడానికి ఏమి లేకపోగానే ఏదో మొండి ధైర్యం వచ్చింది



వాళ్ళకీ-పరువు ప్రతిష్ఠ అంటూ పాకులాడిన వాళ్ళూ, రూపని అంతా ప్రోత్సహించడం చూసి రూప ఇలా కోర్టుకెక్కడం వల్ల తమకి పోయిన 'పరువు ఏం లేదనిపించింది, రూప యిలా ధైర్యంగా తాడోపేడో తేల్చుకోవాలనుకోడం ఒక విధంగా మంచిదేనేమోనన్న నమ్మకం కలిగింది. తాము రహస్యంగా దాచితే ఆ రహస్యం ఏ క్షణాన బయటికి పోతుందోనని ప్రాణాలు గుప్పిట్లో పెట్టుకోడం, ఆఖరికి ఒకరినించి ఒకరికి ఆ రహస్యం





ఎలాగో బయటికి రావడం—ఈ గొడవంతటి కంటే రూపే ధైర్యంగా చేసిన తప్పు నలుగురిముందు ఒప్పుకోడంతో ఆమె నిజాయితీని నలుగురూ మెచ్చుకున్నందుకు ఏదో బరువుదించుకున్న తృప్తి కల్గింది.

మొత్తానికి ఆ పదిహేను రోజులలో ఊరు ఊరంతా రూప, విశ్వనాథం, పద్మావతుల పక్షమే మాట్లాడారు. దాంతో విశ్వనాథంగారు ధైర్యంగా నలుగురిలోకి రావడం ఆరంభించారు. రూప ప్రసక్తి రాగానే ... "కానీండి యిదీ ఒకందుకు మంచిదే. రేపు ఓ ఆడపిల్ల జీవితంతో ఆటలాడుకునే ముందు కాస ఆలోచిస్తాడు మగాడు. కనీసం కొన్నాళ్ళ వరకయినా ప్రతి కుర్రాడూ కాస్త హద్దులో వుంటాడు...పోనీండి పెళ్ళికాక పోతే చచ్చిపోతుందా? ఏ ఉద్యోగమో చూసుకుని దాని బతుకు అది బతుకుతుంది. అది చేసిన తప్పు దాచుకోలేదని, దాని నిజాయితీని గుర్తించిన ఏ మంచి మనసున్నవాడన్నా పెళ్ళి చేసుకోడానికి వస్తాడేమో...దాని భవిష్యత్తు ఎలావుంటే అలా జరుగుతుంది..." అనడం మొదలు పెట్టారాయన. మొత్తానికి అంతా పరిస్థితితో రాజీ పడిపోయారు.

అటు రామనాథంగారి పరిస్థితి వర్ణనాతీతం. అసలే కేసు గొడవ, పరువు నడిరోడ్డు కెక్కి తను, తన కొడుకు దోషులయినందుకు ఒక బాధ, మరో పక్క సుమతి యిరవై ఏళ్ళ క్రితం సంగతి పైకి లాగి నలుగురి ముందు తలెత్తుకోలేనంతగా అవమానం చేసినందుకు సిగ్గుతో చితికిపోయాడాయన. భార్యా

బిడ్డలముందు మొహం చూపించలేక పోయాడు. అపుడు తన తొందరపాటు తననిపుడు యిలా శిక్షిస్తుందని ఆయన ఎన్నడూ అనుకోలేదు.

ఆరేళ్ళ క్రితం సుమతిని మొదటిసారి హైకోర్టులో చూసినపుడు ఆయన గాభరాపడి పోయాడు. ఆమెని ప్రలోభ పెట్టి, ప్రేమమాటలు చెప్పి, వాడుకుని, ఆమె గర్భవతి అయ్యాక పరిస్థితిని ఎదుర్కోలేక పిరికివాడులా పారిపోయిన ఆయన, ఆనాడు సుమతి కన్పించి ఎక్కడ నిలేస్తుందోనని మొదట్లో చాలా భయపడే వాడాయన. కాని సుమతి మొదటిసారి ఆయన్ని చూసి ఒక్కక్షణం మాత్రమే తడబడింది. తరువాత చప్పున సర్దుకుని ఆయన ఒక పురుగన్నంత హేయంగా ఒక్కక్షణం సూటిగా చూసి, పిరికిపందా భయపడకు అన్నట్టు అదోలా నవ్వి వెళ్ళి పోయింది చరచరా. ఆ రోజు తర్వాత ఆయన ఎప్పుడు ఎదుటపడ్డా ఒక్కచూపు విసిరితే ఆయన కుచించుకు పోయేవాడు. అంతేకాక ప్రతీ కేసులో సుమతి ఆయనకి ప్రత్యర్థి అయ్యేది. కోర్టులో యిద్దరు బద్ధ శత్రువులయ్యారు.

ఇప్పుడు యిన్నాళ్ళకి కూతురని చెప్పి తనని చావుదెబ్బ తీసిందని, తన పేరు మంట గలిపించని ఆయన అవమానంతో, కోపంతో కుతకుతలాడి పోయాడు. దీనికంతటికీ కారణమైన సురేష్‌ని తిట్టని తిట్టు లేదాయన. సురేష్ పరిస్థితి అంతకంటే ఘోరంగా వుంది. ప్రతివాళ్ళూ వెధవా అన్నట్టు చూస్తున్న ట్లనిపించేది. అఖరికి స్నేహితుల దగ్గిర నుంచి అందరి సానుభూతి రూపమీదే వుంది.

"ఎందుకురా బాబూ యింత దూరం వెళ్ళావు. మూడుముళ్ళూ వేసేయ వల్సింది" అంటూ అంతా సురేష్‌దే తప్పని తేల్చారు.

"ఒరేయ్ ఈ ఆడపిల్లలు తెలివి మీరారురా! ఇది వరకులా కాదు. మంచిగా పరిష్కారం చేసుకుంటే బాగుండేది. నీ మూలాన మేమందరమూ దోషులం అయ్యాం అందరి దృష్టిలో. ప్రతీవాళ్ళూ "బాగా అయింది. యిలా ఒకడికన్నా శాస్తి జరిగితే ముందు ముందు వెర్రి వేషాలు వేయరు. ఆడపిల్లలతో ఆటలాడరు' అంటూ గడ్డి పెడుతున్నారు ఎక్కడికి కెళ్ళినా" 'అంటూ స్నేహితులంతా సురేష్‌ని దుయ్యబట్టారు.

రామనాధంగారి యింట్లో అంతా ఎవరికి వారు యింట్లోంచి ఏదో శవం. వెళ్ళినట్లు నిశబ్దంగా అవమానాలు దిగమింగుకుంటూ కూర్చున్నారు. రామనాధంగారి భార్య శారదాంబ భర్త పాత కథ తెల్సి మొగుడితో మాట్లాడకుండా సత్యాగ్రహం చేస్తూంది.

"ఎక్కడనించి వస్తాయి. ఆ తండ్రి బుద్ధులే నీకూ వచ్చాయి" అని సురేష్‌ని తిట్టేది ఆవిడ. ఆ యింటి వాతావరణమే మారిపోయింది ఈ దెబ్బతో.

ప్రతీవాళ్ళూ ఆరాటంగా కేసు తీర్పు కోసం ఎదురు చూశారు.

* * *

"ఆంటీ... మీరు నా కేసు ఎందుకు టేకప్ చేశారో, నామీద యింత దయ, శ్రద్ధ ఎందుకు చూపారో, తల్లిదండ్రుల కంటే మిన్నగా నన్నాదుకోడానికి ఎందుకు ముందుకు వచ్చారో ఈనాడర్థం అయింది ఆంటీ. ఎప్పుడూ చిరునవ్వుతో వుండే మీ చిరునవ్వు వెనకాతల మీ

గుండెల్లో ఇంత బడబాగ్ని వుందని ఎన్నడూ గుర్తించలేకపోయాను. సరోజ మీ కూతురని నాకెందుకు చెప్పలేదుఆంటీ" ఆఖరిరోజు కోర్టునించి వచ్చాక రాత్రి అడిగింది రూప సుమతిని సానుభూతిగా చూస్తూ.

సుమతి అదోలా నవ్వింది. "నిన్ను చూశాక ధైర్యం తెచ్చుకుని ఇన్నాళ్ళకి ఆ నిజం చెప్పగలిగాను.రూపా నీ ధైర్యం నీ మనో నిబ్బరంలో పదోవంతన్నా ఆనాడు నాకు వుండి వుంటే సరోజ ఇలా అనాథగా పదిహేనేళ్ల నరకంలో మగ్గేది కాదు. ఆ మాట తల్చుకుంటే నా గుండె చెరువవుతూంది. అది గడిపిన నికృష్ట జీవితం గురించి జ్ఞాపకం వచ్చినపుడల్లా కడుపు తరుక్కుపోతుంది నాకు" పట్టు కున్న గొంతుతో అంది సుమతి.

"ఆ రామనాధం బండారం బయట పెట్టి మంచిపని చేశారు ఆంటీ. ఇలాంటి వెధవలంతా సంఘంలో పెద్ద మనుష్యులుగా చలామణీ అవుతున్నారు. వాడికి శాస్తి జరిగింది. ఇంతకంటే అవమానం ఏం కావాలి ఆ పెద్దమనిషికి" కసిగా అంది రూప. "ఆంటీ! సరోజ అలా అనాథ శరణాలయంలో పెరుగుతూందని తెలిసి ఇన్నాళ్ళూ ఎలా ఊరుకోగలిగారు ఆంటీ. మీరు స్వతంత్రంగా బతుకుతున్నారు. అమ్మ, నాన్న పర్మిషన్ ఎందుకు? మీ అమ్మాయిని మీరు కూతురుగా చెప్పుకోక పోయినా కనీసం పెంచుకుంటున్నట్టు చెప్పి తీసుకొచ్చి పెంచుకోవాల్సింది"

"సరోజ అలా అనాథ శరణాలయంలో పెరుగుతున్నట్టు మూడేళ్ళ క్రితంవరకు నాకు తెలియదు రూపా. నా భవిష్యత్తు నాశనం అవుతుందని, బిడ్డ బతికివున్నట్టు తెలిస్తే తల్లిగా నేను శాంతిగా బతకలేనని బిడ్డ పుట్టగానే చచ్చిపోయిందని అమ్మ, నాన్న అబద్ధం చెప్పారు. కూతురు చేసిన పాపం దూరంగా తీసికెళ్ళి ఎవరికీ తెలియకుండా కడిగేసి పెళ్ళి చేసెయ్యాలనుకున్నారు అమ్మా నాన్నా. ఏ భవిష్యత్తు ఆశించి వాళ్ళు నా బిడ్డని అనాథ శరణాలయానికి వప్పగించారో ఆ భవిష్యత్తు మీద నాకు ఇచ్ఛే లేకపోయింది. ఆ అనుభవం తర్వాత ప్రేమించి, నమ్మి సర్వసం అర్పించిన పురుషుడు చేసిన మోసం తెలిశాక ఆ షాక్‌కి తట్టుకోలేకపోయాను. పెళ్ళి, మగాళ్ళు అంటేనే అసహ్యం పుట్టి పెళ్ళి చేసుకోకుండా నా బతుకు నేను బతకాలని నిర్ణయించుకున్నాను.

నేను ఇలా మోడులా మిగిలిపోతానని వాళ్ళానాడు ఎదురు చూడలేదు. భవిష్యత్తులో నా పెళ్ళికి, నా సంసారానికి ఈ పాప అడ్డు వస్తుందని ఆ పని చేశారు. అంతేకాదు నా మిగతా ముగ్గురు చెల్లెళ్ళ పెళ్ళిళ్ళు అవవన్న భయంతో ఆ స్వార్థంతో ఇన్నాళ్ళూ నా నించి ఆ నిజం దాచిపెట్టారు. ఆఖరి చెల్లెలు పెళ్ళి అయ్యాక, ఇంక నేనెలాగూ పెళ్ళి సంసారానికి నోచుకోలేదని అర్థం అయ్యాక నాన్నగారు చనిపోయేముందు ఈరహస్యం చెప్పి ప్రాణం వదిలారు. ఆ తర్వాత అమ్మని ఎంత నిందించానో-ఏం అనుకుంటే ఏం లాభం. ఒక్క రోజన్నా ఆలస్యం చెయ్యకుండా అనాథ శరణాలయం వెళ్ళాను. పాపని దత్తు తీసుకుంటున్నట్టు కాగితాలు, పర్మిషన్లు అన్ని రూల్సు ప్రకారం జరిగి పాప నా దగ్గరికి రావడానికి అర్నెల్లు పట్టింది. ఆ అర్నెల్లలో సరోజ గడిపిన, గడుపుతున్న నికృష్ట జీవితం చూసి ఎంత బాధపడ్డానో

ఎలా చెప్పగలను రూపా" సుమతి గొంతు వణికింది.

"ఆంటీ! అసలు ఇదంతా ఎలా..ఎందుకు జరిగింది. రామనాధంగారు మిమ్మల్ని ఎందుకు పెళ్ళాడనన్నారు?" కుతూహలంగా అడిగింది రూప.

"ఆడదాన్ని అనుభవించడానికి ఏం రూల్సు లేవుగాని, ఒక పెళ్ళికంటెఎక్కువ పెళ్ళిళ్ళు చేసుకోడానికి వీలు లేదుగా" హేళనగా అంది సుమతి.

"అంటే రామనాధంగారప్పటికే వివాహితులా" రూప ఆశ్చర్యంగా అంది.

"పెళ్ళేం ఖర్మ ఇద్దరు పిల్లలు కూడా వున్నారప్పటికి.

"మరి మీకెలా తెలియలేదు?" ఆశ్చర్యంగా అడిగింది రూప. "ఆయన చెప్పలేదా? అంతా చెప్పండి ఆంటీ" ఆరాటంగా అడిగింది రూప.

"చెప్పడానికి ఏముంది రూపా! మోసపోయిన ఆడవాళ్ళ కథలన్నీ ఒక్కలాగే వుంటాయి. నేనూ నీలాగే బి.ఎ చదువుతూ వుండేదాన్ని. మా నాన్నగారు లాయరు. ఆయనకి నలుగురం ఆడపిల్లలమే. పెద్దదాన్ని నేను. మా ఇంట్లో మా నాన్నగారి దగ్గర జూనియర్‌గా వుండేవాడు రామనాధం. ఇప్పుడు సురేష్ ఎలా అందంగా చలాకీగా వున్నాడో అచ్చు రామనాధం అదే వయసులో అలాగే వుండేవాడు.

"అతను మా ఇంట్లో కారు షెడ్డులో రూములోనే వుండేవాడు. మా ఇంట్లోనే భోజనం అదీ. ఇద్దరు వయసులో వున్న స్త్రీ పురుషులు ఒకచోట చనువుగా కల్సి మెల్సి తిరుగుతూంటే ఆ చనువు స్నేహం, ఆకర్షణ, ప్రేమగా మారడానికి ఎన్నాళ్ళో పట్టదు. ఇరవై మూడేళ్ళున్న రామనాధం అప్పటికే వివాహితుడని ఇద్దరు పిల్లల తండ్రిని ఎలా అనుకుంటారు ఎవరన్నా? అతను చెప్పలేదు. మేం అడగలేదు. అతని పట్ల సులువుగానే ఆకర్షితురాలినయ్యాను. ఆ అవకాశం అతను వృధా పోనివ్వలేదు. ఫలితం-ఏది జరగకూడదో అది జరిగింది. అది తెలిశాక భయపడి చెప్పకుండా ఉడాయించాడు రామనాధం.

నేను ఎంత దాచినా దాగనిది ఈ వ్యవహారం. అమ్మ, నాన్నలకి తెలిసే వేళకి పరిస్థితి చెయ్యి దాటింది. నాన్నగారు నెత్తీ నోరు బాదుకుని రామనాధం ఊరు పరిగెట్టారు. తిరిగివచ్చిన ఆయన చెప్పిన కబురు విని మేం అందరం నిశ్చేష్టులయ్యాం. రామనాధంకి అప్పటికే పెళ్ళయిందట. ఇద్దరు పిల్లలట. మేనరికమే చేసుకున్నాడట, అతని బామ్మగారు చచ్చిపోతూ మనవడి పెళ్ళి చూడాలని గోల పెట్టి బలవంతంగా మనవరాలినిచ్చి పెళ్ళి చేయించిందిట బి. ఏ. చదివేటప్పుడే - ఆ పిల్ల అనాకారిట.భార్య కనక సంసారం చేసి ఇద్దరు పిల్లలని కన్నాడట అప్పటికే.

ఆ వార్తవిని అమ్మ నాన్న నెత్తి బాదుకున్నారు. నన్ను తిట్టారు. ఏంచేస్తే ఏం లాభం. అప్పటికి ఎబార్షన్ టైము కూడా దాటింది. రామనాధం చేసిన మోసానికి తట్టుకోలేకపోయాను. పెళ్ళయి అదిదాచి పెళ్ళాంకంటే అందకత్తెను కనక అనాయాసంగా వచ్చినదాన్ని అనుభవించి వెళ్ళాడన్నమాట తలుచుకుంటుంటే ఒళ్ళు భగ్గున మండేది. అమ్మ నాన్న వున్న వూర్లో అందరికి తెలుస్తుందని దూరంగా పిన్నిగారి వూరు తీసికెళ్ళి ఆ బరువు దించారు. పిల్ల పోయిందని చెప్పారు తెలివి వచ్చాక నాకు. నిజమనుకున్నాను. ఆ

సంఘటనతో అదోరకం విరక్తిలోపడి పెళ్ళికి ఎంత చెప్పినా ఒప్పుకోలేదు. బి.ఎల్ చదివి నాన్నగారి ప్రాక్టీసు అందుకున్నాను. మిగతా చెల్లెళ్ళ పెళ్ళిళ్ళు అయ్యేవరకు అమ్మ నాన్న ఆఖరివరకు పెళ్ళి చేసుకోమని పోరారు. ఆఖరికి విసుగెత్తి వూరుకున్నారు.

నాన్న పోయేటప్పుడు పశ్చాత్తాపంతో తను నా మంచికోసం చేసినపని చెప్పారు. అపుడు వెళ్ళి సరోజని తెచ్చుకున్నాను. ఇదీ కథ...రూపా! నీవు వచ్చిన మొదటి రోజున నీ కథ వినగానే నా కథ గుర్తుకు వచ్చింది. నీ ధైర్యానికి చాలా ఆనందం కల్గింది. నీకందుకే సహాయపడాలని, ఏమైనా నిన్ను ఆదుకోవాలని, నా సరోజ పడిన కష్టం మరో బిడ్డ పడకూడదని నీ తరుఫున నిలబడ్డాను" అంది సుమతి నిట్టూర్చి.




రూప కేసుకి తీర్పు ఆనాడే. కోర్టంతా కిటకిటలాడుతూంది. ప్రెస్ రిపోర్టర్లు జడ్జిమెంటు కోసం ఆరాటంగా ఎదురు చూస్తున్నారు. సుమతి,రూప, విశ్వనాధం, పద్మావతి ఆరాటంగా కాకపోయినా కుతూహలంగా ఎదురు చూడసాగారు. సురేష్, రామనాధంగార్ల మొహాలు కళ తప్పి వున్నాయి. పదిన్నరకి జడ్జిగారు వచ్చి సీటులో కూర్చున్నారు. మరొక కేసు ఏదో జడ్జిమెంటు చదివాక రూప కేసు జడ్జిమెంటు చదివారు. "ఈ కేసులో వాది కుమారి రూప, ప్రతివాది సురేష్ కుమార్ల తరఫున ప్రాసిక్యూషన్ లాయర్ శ్రీమతి సుమతి, డిఫెన్స్ లాయరు శ్రీ రామనాధం గార్ల ఆర్గ్యుమెంటు, వాది, ప్రతివాదుల తరుఫు సాక్ష్యాలు పరిశీలించడం జరిగింది. ప్రతివాది సురేష్‌కుమార్, కుమారి రూప ఇద్దరూ కల్సి తిరిగినట్లు ప్రేమకలాపాలు జరిపినట్టుసాక్షులసాక్ష్యాలవల్లతెలుస్తూంది. ప్రతివాది కుమారి రూపని పెళ్ళాడుతానని ముందు చెప్పలేదు, అలా రుజువు పరచడానికి కుమారి రూప దగ్గిర సాక్ష్యాలు ఏమీలేవు. అయినా సురేష్‌కుమారే కోర్టులో ఆమెతో కలిసి ప్రేమకలాపాలు జరిపినట్లు అంగీకరించాడు. కుమారి రూపతో అతను పూర్తిగా బలవంతంమీదకాక ఆమె కూడా ఇష్టపూర్వకంగానే కొంతవరకు అంగీకరించినందువల్ల ప్రేమ కలాపాలు జరిపాడు. సెక్స్ సంబంధం మాత్రం వాది భయిపడి అంగీకరించనందువల్ల అది మాత్రం కొంత బలవంతం మీద జరిగినట్లు, కుమారి రూపని వివశురాలిని చేసి వశపరుచుకున్నట్టు కుమారి రూప సాక్ష్యం వల్ల తెలుస్తూంది.

"కుమారి రూప ఇంకా మైనర్ అయినందువల్లసురేష్‌కుమార్ ఆమెతో అక్రమ సంబంధం కల్గి వుండడం సెక్షన్... ప్రకారం నేరం జరిగినదానిలో ఇద్దరూ బాధ్యులయినా కుమారి రూప నెలతప్పి అతన్ని పెళ్ళి చేసుకోమని కోరినా అతను నిరాకరించకుండా పెళ్ళి చేసుకుని వుంటే యీ సమస్య కోర్టువరకు రాకుండానే పరిష్కారం అయివుండేది. ప్రాసిక్యూషన్ లాయర్ శ్రీమతి సుమతి అన్నట్టు ఇద్దరూ

చేసిననేరంలో స్త్రీ ఒకతే శిక్షింప పడడం అనాది ఆచారం. కాని ఈనాడు ఆ ఆచారం మారాలనే శ్రీమతి సుమతిగారి వాదనలో సబబువుంది. కాని ముందు ఒక స్త్రీ ఇష్టపడి పురుషునితో ప్రేమకలాపాలు జరిపి ఆ పిమ్మట పురుషుడు మోసంచేస్తే బలహీనతకి లోబడడం స్త్రీ తప్పు కనక ఏ న్యాయస్థానానికీ ఆ పురుషుని శిక్షించే హక్కులేదు. బలవంతాన మానభంగం చేస్తేనే అది 'లా'కి విరుద్ధమయి ఆ పురుషుడు శిక్షార్హుడు అవుతాడు! కాని ఈ కేసులో కుమారి రూప మైనర్ అయినందున సురేష్‌కుమార్ మైనరయిన ఆడపిల్లతో అక్రమ సంబంధం కల్గినందువల్ల అతను శిక్షార్హుడు. కోర్టు కేసు అంతా పరిశీలించాక ప్రతివాది సురేష్ వాది కుమారి రూపని వెంటనే పెళ్ళాడాలని కోరుతూ అతను చేసిన పనిని అదే శిక్షగా నిర్ణయించింది. ప్రతివాది సురేష్ కుమారి రూపని 'పెళ్ళాడడానికిష్టపడని పక్షంలో అతనికి ఆరు నెలలు జైలుశిక్ష విధిస్తూంది కోర్టు. ఈ రెండింటిలో ఏ శిక్ష కావాలో ప్రతివాది నిర్ణయించుకోవచ్చు.

"ప్రాసిక్యూషన్ లాయర్ శ్రీమతి సుమతి తన క్లయింట్ కుమారి రూపకి పుట్టబోయే బిడ్డని అక్రమ సంతానంగా కాక సంఘంలో స్థానం కల్పించి ఆ బిడ్డకి న్యాయం జరిగేట్టు చూడాలని కోరారు. మానవతా దృష్ట్యా కోర్టువారి సానుభూతి అలాంటిబిడ్డ మీదవున్నా వివాహంకాకుండా పుట్టినబిడ్డనిఅక్రమ సంతానంగానేసమాజం గుర్తిస్తుంది. వివాహం కాకుండా పుట్టిన బిడ్డకి తండ్రి ఆస్థిలోనూ హక్కువుండదు. ఈ న్యాయ సూత్రాలు మార్చివేసే హక్కు ఈ కోర్టుకి లేదు. అలాంటి హక్కులు కావాలంటే రాజ్యాంగం,న్యాయ సూత్రాలు తిరగ రాయాల్సి వుంటుంది. శ్రీమతి సుమతిగారి వాదనని మేము వ్యక్తిగతంగా సమర్థించినా, అలాంటి సంతానంమీద మా సానుభూతి వున్నా ఈ న్యాయస్థానంలో కూర్చుని అలాంటి బిడ్డలకి మేము జరిపే న్యాయం ఏమీ వుండదని చెప్పడానికి విచారిస్తున్నాను. సుమతిగారి వాదనలోని పాయింట్లు పరిశీలించి నీతి సూత్రాలు న్యాయ సూత్రాలు, మార్చి రాసి ఈనాడైనా స్త్రీకి న్యాయం జరిగేట్టు చూడమని మేమూ మన రాజ్యాంగాన్ని అర్థిస్తున్నాము. వాది కుమారి రూపకి పుట్టబోయే బిడ్డకి లీగల్‌గా ప్రతివాది సురేష్‌కుమార్ ఆస్థిపాస్తుల మీద ఎలాంటి హక్కులుండకపోయినా మానవతా దృష్ట్యా ఆ బిడ్డకి ఆస్థిలో ఒక భాగం ఇవ్వడం న్యాయమని కోర్టుభావిస్తూ కోరుతుంది.

"ప్రతివాదిసురేష్‌కుమార్ వాదికుమారి రూపని నెలరోజుల లోపల వివాహం ఆడాలి. వివాహం ఆడని పక్షంలో వారం లోపల అతను జైలుశిక్ష అనుభవించడానికి సిద్ధపడాలని కోర్టు తీర్పు చెప్తూంది"

జడ్జిగారు జడ్జిమెంటు చదివి, కేసు పోలీసులకి హేండోవర్ చేసున్నట్లు చెప్పగానే కోర్టు అంతా చప్పట్లతో దద్దరిల్లింది. జడ్జి ఛాంబర్స్‌లోకి వెళ్ళిపోయారు.సురేష్, రామనాథం మొహాలు నల్లగా మాడిపోయాయి. సుమతి సంతోషంగా రూపని కౌగిలించుకుంది. పద్మావతి సంతోషం పట్టలేనట్టు సుమతి చేతులు పట్టుకుంది. న్యూస్ రిపోర్టర్లు రూప, సుమతి చుట్టూ గుమిగూడారు. రూప ఫ్రెండ్సు...

హుర్రే రూపా-సురేష్ మస్ట్ మేరీ రూపా అంటూ ఆడపిల్లలు రూపని చుట్టుముట్టి అభినందనలు తెలుపుతూ సంబరంగా అరిచారు. మగపిల్లలు సురేష్‌ని చుట్టు ముట్టి రూప వైపు లాక్కొచ్చారు బల వంతంగా గింజుకుంటున్నా వినకుండా.

"కాంప్రమైజ్ బాయ్! రూపని పెళ్ళి చేసుకో. అన్ని అభిప్రాయ భేదాలు పోతాయి. వుయ్ ఆల్ వాంట్ యూ బోత్ హేపీ" అంటూ ఇద్దరి చేతులు కలప బోయారు స్నేహితులు.

సురేష్ విసురుగా చెయ్యి లాక్కొని తిరస్కారంగా రూపని తీవ్రంగా చూస్తూ "పెళ్ళా!? దీన్నా!? అంతకంటె జైలుశిక్ష సంతోషంగా అనుభవిస్తాను. నన్నింత చేసిన...ఇంత అవమానం చేసిన దీన్ని పెళ్ళాడుతానా? కంఠంలో ప్రాణంవుండగా చెయ్యను" పౌరుషంగా, ఆవేశంగా రూపని మింగేసేట్టు చూస్తూ అన్నాడు.

ఆ తిరస్కారం చూసి రూప కూడా ఏహ్యంగా సురేష్‌ని చూసింది.

"నీవు పెళ్ళాడుతానన్నా నిన్ను చేసు కోడానికి నేను సిద్ధంగా లేను మిస్టర్. నిన్ను పెళ్ళాడాలని ఈ కోర్టుకెక్కలేదు. నీకు బుద్ధి చెప్పడానికి ఎక్కాను. నా కోరిక తీరింది. నౌ, యుగో టు హెల్ ఐ హేట్ టు టాక్ టు యూ ఎనీ మోర్" అంది రూప ఏహ్యంగా చూస్తూ.

"రూపా" పద్మావతి విశ్వనాథం ఏదో చెప్పబోయారు. "రూపా దిసీజ్ బాడ్! పుట్టబోయే బిడ్డకోసం అన్నా మీరిద్దరూ కాంప్రమైజ్ అయి వివాహం ఆడడం మంచిది" మరో లాయరు సుమతి వంక చూస్తూ సలహా చెప్పమన్నట్టు చూశాడు. విశ్వనాథంగారు కూడా అవునన్నట్టు చూశారు.

"దిసీజ్ అప్ టు హర్ వివాహం అంటే జన్మంతా కల్సిమెల్సి వుండే బంధం. ఇలా ఒకరిపట్ల ఒకరికింత తిర స్కారం, కసి వున్న వివాహం సక్సెస్ ఎలా అవుతుంది? ఈ పెళ్ళి చేసుకోమని నేను ఎలా చెప్పను. బిడ్డకోసం కాంప్రమైజ్ అవగలిగితే మంచిదే. ఇది వాళ్ళిద్దరూ ఆలోచించుకోవాల్సింది" అంది సుమతి గంభీరంగా.

"కమాన్ సురేష్" స్నేహితులు సంధి కుదర్చబోయారు. సురేష్ విసురుగా-

"సారీ, నన్ను బలవంతపెట్టకండి. ఐ హేట్ హర్. నో క్వొశ్చన్ ఆఫ్ మారేజ్ ఆర్నెల్లు జైలుశిక్ష అంతకంటె నయం-ఆజన్మాంతం అనుభవించే శిక్ష కంటె" అంటూ విసురుగా వెళ్ళిపోయాడు.

అంతా నిట్టూర్చారు. రూప చాలా నిర్ల క్ష్యంగా చూసింది. ప్రెస్ రిపోర్టర్లు రూపని ఏవేవో ప్రశ్నలడిగారు. రూప అభిప్రాయాలు వ్యాసంగా రాసివ్వమని కోరారు.

"ఈ కేసు వల్ల మీరు సాధించింది ఏమిటి? కోర్టుకెక్కడం వల్ల మీకు నష్ట పోయింది ఎక్కువ కాదా?" అన్నాడో రిపోర్టరు.

"ఏమి సాధించానా? ఆ ప్రశ్న ఇంకా అడుగుతున్నారా! నేను, నా జీవితం ఏమయిపోయినా కనీసం కొన్నాళ్ళు, ఈ సంఘటన గుర్తున్నంతవరకేనా ఏ యువ కుడూ ఓ స్త్రీని మోసం చేసేముందు కాస్త భయపడి ఆలోచిస్తాడు. కాదంటారా? నాలాంటి ఒక యువతినన్నా ఈ మోసా నికి గురికాకుండా కాపాడగలిగానన్న తృప్తి నాకు చాలు. ఆడదాన్ని వాడుకుని మోసం చేసి వదిలేసే పురుషులకి ఈ

కేసు ఒక పాఠంగా కొన్నాళ్ళయినా గుర్తుంటుంది. ఇంతకంటె ఏం సాధించాలి? నాలా మరో ఆడపిల్ల ఆలోచించి ధైర్యంగా ముందుకు అడుగు వేసేందుకు తోవ చూపాను. ఆడపిల్లలు ఇంక మన మోసాన్ని సహించరు-అని పురుషులకి తెలియచెప్పేందుకు ఈ సంఘటన తోడ్ప డదూ! ఇలా ప్రతి వూరిలో ఒక్క ఆడ పిల్లయినా ఆలోచించి ధైర్యంగా ఈ అన్యాయాన్ని ఎదుర్కొంటే, కొన్నాళ్ళకి ఇదో ఉద్యమం అయి ఈ పురుషుల ఆట కట్టదా? దీనికి పునాది నేను వేశానన్న తృప్తి కంటె ఇంకేం కావాలి నాకు!!" రూప గర్వంగా, ఆవేశంగా అంది.

"మీరిలా పెళ్ళికాకుండా బిడ్డని కంటే అవివాహిత మాతృత్వాన్ని ప్రోత్సహించి నట్లు గదా! రేపు ఇలాగే కొందరైనా ఆలో





చిస్తే వివాహ వ్యవస్థ దెబ్బతినదా? ఇలా ప్రతివారూ పెళ్ళి కాకుండా బిడ్డలనికంటే సంసార జీవితానికి తావు ఎక్కడ వుంటుంది? కుటుంబ వ్యవస్థ దెబ్బతింటే పుట్టబోయే బిడ్డలకి రక్షణ ఏముంది. మీలా అందరూ ఆలోచిస్తే అక్రమ సంతానం ఎక్కువ కాదా? అపుడు విదేశాలు సహితం మెచ్చుకుంటున్న మన సాంఘిక వ్యవస్థ దెబ్బతినదా?'' ఒక విలేఖరి తెలివిగా ప్రశ్నించాడు. దానికి జవాబు రూప చెప్పబోయేలోగానే



సుమతి అందుకుంది.

"మా పాయింట్ మీరు సరిగా అర్థం చేసుకోలేక పోయారన్నమాట. ఏ స్త్రీ కావాలని వివాహ జీవితానికి, వివాహ జీవితం ఇచ్చే భద్రతకి, సంసార జీవితానికి దూరం అవదు. ప్రతి స్త్రీ సంతోషంగా అన్యోన్య దాంపత్యం గడపాలని,

ఇల్లాలిగా, తల్లిగా సుఖమయ సంసారం చేసుకోవాలనే కోరుతుంది. కావాలని చేతులారా భవిష్యత్తు నాశనం చేసుకుని, మోడులా జీవిస్తూ, లోకుల దృష్టిలో హీనంగా, చులకనఅయి, బిడ్డని కని తిరస్కారాలు, హేళనల మధ్య పెంచుకోవాలని ఏ స్త్రీ కోరదు. మేం అలా స్త్రీ విచ్చలవిడిగా తిరిగి, అక్రమ సంతానాన్ని కనాలని ఎన్నడూ చెప్పలేదు. స్త్రీ కూడా పురుషునిలా మనిషే కనక ఆమె కూడా కోరికలకి బానిసే కనక, ఏ బలహీన క్షణంలోనైనా తనని ప్రేమిస్తున్నాడని భ్రమించి పురుషునికి తనను తాను అర్పించుకోవచ్చు. పురుషునిలో ఆ బలహీనతలని క్షమించే సమాజం స్త్రీని ఎందుకు క్షమించదు అన్నది మా ప్రశ్న ? చేసిన తప్పునించి పురుషుడు తప్పించుకుని పెద్ద మనిషిగా చెలామణి అవగా స్త్రీ ఎందుకు అన్ని విధాల శిక్షింపబడాలన్నది మా వాదన! ప్రకృతి స్త్రీ పట్ల అన్యాయం చూపి మాతృత్వం అనే శిక్ష ఆమెకి విధించింది కనక, ప్రతి స్త్రీ తనని తాను రక్షించుకోడానికి పురుషుని మాటలని నమ్మి పెళ్ళికి ముందే బలహీనతకి లోబడకూడదనే మేమూ అంటున్నాము. కాని అలా బలహీనతకి లోబడిన ఒక స్త్రీ క్షమించరాని నేరం చేసినట్లు భావించరాదని ఆ నేరమే చేసినపురుషుడూ శిక్షించబడాలనే, ఆ న్యాయం కోసమే కోర్టు కెక్కిందని నా క్లయింట్" అంది సుమతి.

కేసు తీర్పు విన్నాక అందరూ రూప భవిష్యత్తులో ఏం చేస్తుందని ఊహాగానాలు చేస్తూ ఇళ్ళకు మళ్ళారు.

సుమతి, విశ్వనాధం, పద్మావతి అందరూ ఇల్లు చేరారు.

"ఇప్పుడింక ఏం చేద్దాం. ఇంతవరకు కేసు పూర్తి అయ్యాక సురేష్ దారికివచ్చి పెళ్ళాడుతాడని ఆశించాను. ఇప్పుడింక ఆ పెళ్ళి జరగదు గదా! రూప సంగతి ఏమిటి? ఇలా దీని సంగతి బట్టబయలు అయ్యాక మరెవడూ పెళ్ళాడడానికి ముందుకి రాడు గదా. ఇప్పుడింక ఏం చేస్తుంది?" విశ్వనాధంగారు సందేహాలు బయట పెట్టారు.

"నాన్నగారూ! పెళ్ళి... పెళ్ళి... పెళ్ళి జీవితంలో ముఖ్య ఘటన కావచ్చుకాని పెళ్ళిలేనిదే జీవితం కాదనడం సరికాదు. నేను ముందే చెప్పాను ఎవరినీ పెళ్ళాడే ఉద్దేశం లేదని. రిజల్ట్సు వచ్చాయి. బి.ఏ పాసయ్యాను. మీరు నా చదువుకి సరిపోయేఉద్యోగం ఏదన్నా చూపించగలిగితే నన్ను కన్నందుకు మీ బాధ్యత తీరిపోతుంది. ఆ సహాయం చెయ్యగలిగితే మంచిదే, లేదంటే నా దారి నేను వెతుక్కుంటాను. నేను సెటిల్ అయ్యేవరకు ఆంటీ అండగా వుంటారని ప్రామిస్ చేశారు. ఆవిడ సహాయంతో ఏదో ఉద్యోగం చూసుకుంటాను"

"అంటే, ఇంక మన ఇంటికి రావా? ఎలాగో వూరువాడ తెల్సింది. ఇంక దాచుకుందుకు ఏముంది? పద ఇంటికి. పాపం ఆవిడని ఎన్నాళ్ళు ఇబ్బంది పెడ్తావు." పద్మావతి అంది. అందరి సంభాషణ వింది సుమతి.

"రూప నాకేం బరువుకాదు పద్మావతి గారూ. నా ఉద్దేశం అడిగితే రూప ఇంక యీ వూరిలో, యీ వాతావరణానికి దూరంగా ఎక్కడైనా వుండడం మంచిది. అని నా ఉద్దేశం. నేను ఇన్నాళ్ళూ దాని గురించే ఆలోచించాను. రూప కిప్పుడు

ఐదోనెల నిండుతూంది. ఇంక మూడు నెలల్లో కనేరోజులు వస్తాయి. నెల్లూరులో మా చెల్లెలు డాక్టరుగా వుంది. అది, దాని భర్త ప్రైవేటు నర్సింగుహోమ్ నడుపుతున్నారు. రూపని అక్కడకి పంపిద్దామనుకుంటున్నాను. మా చెల్లెలికి ఇద్దరూ చిన్నపిల్లలు. ఇంట్లో చూసేవాళ్ళు ఎవరూ లేక, సరి అయిన పనివాళ్లు లేక ఇటు పిల్లలు, అటు ఉద్యోగంతో నానా అవస్థ పడ్తోంది. రూప గురించి అంతా రాసి రూప నా కూతురు లాంటిది అని, నీ సహాయం కావాలని అన్ని విషయాలు రాశాను. మా చెల్లెలు తప్పకుండా పంపించు, ఇంట్లో వుంటుంది పురుడుపోసి పంపే బాధ్యత నాది, మా ఇంట్లోనే వుంటుంది, పిల్లలకి సాయంగానూ వుంటుంది అని రాసింది. ఈలోగా మనమూ రూపకి ఉద్యోగం చూద్దాం. అక్కడ మా చెల్లెలు ప్రయత్నిస్తుంది. రూప ప్రైవేటుగా ఎమ్. ఎ. చదవచ్చు. లేదంటే బి.యిడి ట్రైనింగ్‌కి వెడితే ఏ టీచరుగా నన్నా వుద్యోగం వస్తుంది. ఇదీ నేనుఆలోచించింది. మీరు అంగీకరిస్తే రూపని నెల్లూరు పంపిస్తాను..." సుమతి ఇద్దరి వంక చూసింది.

పద్మావతి చప్పున సుమతి చేతులు పట్టుకుని "దాని గురించి, దాని భవిష్యత్తు గురించి ఇంతలా ఆలోచించే మీరు వుండడం దాని అదృష్టం. దానికి ఆ భగవంతుడే మీ దగ్గరకి వెళ్ళమని దారి చూపాడు. కన్నవాళ్ళకంటే మీరే దాని బాగు గురించి ఆలోచిస్తున్నారు. మీ మాట మేం కాదనం. అది ఇంక మా చెయ్యి దాటిపోయింది. దాన్ని మీ చేతులలో అప్పుడే పెట్టేశాం. మీరేం చేసినా మీ ఇష్టం..." సజలనయనాలతో అంది పద్మావతి.

"ఎంత నల్గురికీ తెల్సినా, ఇంట్లో పెట్టుకుని పెళ్ళయిన దానికి మళ్లీ పురుడు అది పోయడానికి మీకు ఇబ్బందిగా వుంటుంది. అందరూ వింతగా చెప్పుకుంటారు. ఎంత పట్టించుకోకూడదనుకున్నా ఇలాంటివి తప్పవు. అంచేత ఆ పురుడు అది అక్కడ అవనీండి. మా చెల్లెలు డాక్టరు కనక ఆ గొడవంతా చూసుకుంటుంది. ఆ కొత్త వూరిలో అయితే రూప ఎవరికీ తెలీదు. పురుడయ్యాక ఏదన్నా వుద్యోగంలో ప్రవేశపెట్టవచ్చు. రూపా! ఏమంటావు?" అంది సుమతి.

"ఆంటీ, మీరెలా చెబితే అలా చేస్తాను ... నా భాగోగులు మీ కంటే ఎవరికి తెలుస్తుంది. ఇంక ఈ ఊరిలో వుండాలని నాకూ లేదు. నెల్లూరు వెడతాను. ఆవిడ పిల్లల్ని చూస్తూ అక్కడ వుంటాను. ఈలోగా బి.యిడి. సీటుకి అప్లయి చేస్తాను. డెలివరీ అయ్యాక ఏదన్నా ఉద్యోగంలో చేరతాను"

"కానీండి అమ్మా ... పిల్ల పెళ్లిచేసి పంపిస్తే ఇంట్లోంచి వెళ్ళదా? అలాగే రూప ఇంక మా ఇంటి పిల్ల కాదనుకుంటా! ఏదన్నా ఉద్యోగం చూస్తాను. దాని అదృష్టంబాగుంటే...దాని సంగతి తెలిసీ పెళ్ళి చేసుకోడానికి ఏ సహృదయుడన్నా ముందుకు వస్తే సంతోషిస్తా. దాని మార్గం అది ఎన్నుకున్నాక ఇంక మా చేతుల్లో ఏమీ లేదు. అత్తవారింటికి పంపినట్లు దానికి కావల్సినవి నాలుగు కొనిచ్చి, నా శక్తి కొద్దీ-అది లైఫ్‌లో సెటిల్ అయ్యేవరకు దేనికీ ఇబ్బంది పడకుండా ఓ పదివేలు దాని పేర ఫిక్స్‌డ్ డిపాజిట్లో వేస్తాను. దాని భవిష్యత్తు ఎలా వుంటుందో కాలమే నిర్ణయించాలి" అన్నారు విశ్వనాధంగారు.

"రూ పా! నీవు ఇంటికి వెళ్లి ఓ నాలుగు రోజులుండి నీ సామాను అది సర్దుకో, నీకు కావలిసిన బట్టలు అవి కొనుక్కో. ఈలోగా టిక్కెట్టు బుక్ చేసి, మా చెల్లెలికి రాస్తాను. ఇంట్లో నాలుగు రోజులుంటే మీ అమ్మ గారికి వాళ్ళకి తృప్తిగా వుంటుంది" అంది సుమతి.

రూపని వెంట బెట్టుకుని పద్మావతి, విశ్వనాథం గారు ఇంటికి వెళ్ళారు.

* * *

పదేళ్లు కాలగర్భంలో కలిసి పోయాయి ... ఆ రోజు 'శారదా బాల విహార్' ఇంగ్లీషు మీడియం స్కూలు ఆవరణ అంతా రంగు రంగుల కాగితాల తోరణాలతో అలంకరించబడివుంది. ఆరు బయట స్టేజి వేశారు. బ్లూ రేక ఆకు పచ్చరంగు స్కూలు యూనిఫారం తొడుక్కుని, పచ్చని సీతాకోక చిలుకల్లా పిల్లలంతా ఇటు అటు పరిగెడుతున్నారు. టీచర్లంతా హడావిడిగా ఇటు అటు తిరుగుతూ ప్రోగ్రాం ఆర్గనైజ్ చేస్తున్నారు.

ఆ రోజు స్కూలు వార్షికోత్సవం జరుగుతోంది. క్రితం ఏడు పరీక్షలో మంచి మార్కులతో పాసయినవారికి బహుమానాలు, ఆటల పోటీలో బహుమతులు, వినోద ప్రదర్శనలు జరుగుతాయి. గ్రీన్ రూములో పిల్లల తల్లులు, కొందరు టీచర్లు పిల్లలకి మేకప్ చేస్తున్నారు. ఆ పూట కార్యక్రమానికి ఆ జిల్లా కలెక్టరు గారు అధ్యక్షత వహిస్తున్నారు. ఆ సభలోనే పిల్లలకి బహుమతులు అందిస్తారు. ఆరు గంటలకి కార్యక్రమం ఆరంభమవుతుంది.

స్కూల్లో ఇంగ్లీషు టీచరయిన రూప ఎక్కడ చూసినా తానే అయి అటు ఇటు తిరుగుతూంది. పిల్లలకి ఫాన్సీ దుస్తుల మేకప్ చేస్తూంది. స్టేజి మీద ఏ యే ప్రోగ్రాం ఎలాఆరంభించాలో చూస్తూంది. ప్రైజులు పుచ్చుకోవాల్సిన పిల్లలని క్లాసుల వారిగా నించో పెడుతోంది. ప్రైజులు టేబిల్ మీద సరిగా అరేంజ్ చేసి వున్నాయో లేదో చూస్తోంది.

అందరూ రూపా,రూపా అని ఇటు అటు పిలుస్తున్నారు. టీచర్ టీచర్ అని పిల్లలు ఏదో ఒకటి అడుగుతున్నారు. ఆ స్కూల్లో ఏ ప్రోగ్రాం అయినా, ఏ ఫంక్షన్ అయినా రూప ఆధ్వర్యంలో జరుగుతుంది. అన్నింటిలో ఉత్సాహం చూపిస్తూ చలాకీగా తిరిగే రూప హెడ్ మిస్ట్రెస్‌కి కుడి భుజం ఆ స్కూల్లో.

సరిగ్గా ఆరు గంటలకి కలెక్టరుగారు, ఆమె భర్త వచ్చారు. ప్రోగ్రాం ఆరంభమైంది. అధ్యక్షోపన్యాసం అయ్యాక కలెక్టరు గారు గత ఏడాది క్లాసులలో ఫస్ట్ వచ్చిన పిల్లలకి బహుమతులు అందించడం ఆరంభించారు.

ఆ స్కూలు మొత్తం మీద ఐదో క్లాసుకు చెందిన సుమిత్‌కుమార్ ఎక్కువ బహుమతులు గెల్చుకున్నాడు. ఇంగ్లీషులో 90, లెక్కల్లో 100 మిగతా సబ్జక్ట్సులో 85 శాతంతో నాలుగు సబ్జక్టుల్లో ఎక్కువ మార్కులు క్లాసుకి ఫస్ట్, స్కూలుకి ఫస్ట్ వచ్చి మొత్తం నాలుగు బహుమతులు. అవి కాక వ్యాస రచన పోటీలో ఒక ప్రైజు, గేమ్సులో రెండు ప్రైజులు పుచ్చుకున్న సుమిత్ అందరి కంటే ఎక్కువ బహుమతులు పొంది స్కూలు రోలింగ్ కప్ గెల్చుకున్నాడు. పట్టుమని

పదేళ్ళు లేని ఆ కుర్రాడు అన్ని బహుమతులు అందుకోడానికి స్టేజి మీదకి వచ్చినపుడల్లా చప్పట్లు మారుమోగాయి. ప్రతివాళ్ళూ సుమిత్ ని చూసి ముచ్చటపడి మెచ్చుకున్నారు. అన్ని బహుమతులు గెల్చుకున్న సుమిత్ ని చూసికలెక్టరుగారు, ముచ్చటపడ్డారు. సుమిత్ భుజం చుట్టు చెయ్యి వేసి ఆప్యాయంగా

"ఐ యామ్ వెరీ హాపీ మై డియర్ బాయ్. యువర్ పేరెంట్స్ మస్ట్ బి ప్రౌడ్ ఆఫ్ యూ" అంది.

కలెక్టరుగారు అలా తమ విద్యార్థిని అంతగా పొగడగానే ఉబ్బిపోయి హెడ్ మిస్ట్రెస్ సంబరంగా ... స్టేజి మీద పక్కగా నిల్చబడి ప్రైజులు అందిస్తున్న రూపని చెయ్యి పట్టిలాగి,

"షి ఈజ్ ది ప్రౌడ్ మదర్ ఆఫ్ దిస్ బాయ్. షి యీజ్ ఎ టీచర్ ఇన్ అవర్ స్కూల్" అంది గర్వంగా.

"రియల్లీ, గ్లాడ్ టూ మీట్ యు టీచర్" అందామె రూప చెయ్యి పట్టుకుని సుస్మితంగా నొక్కి. "వాటెబౌట్ యువర్ డాడీ సుమిత్" అందామె. నవ్వుతూ ... "వాటీజ్ హీజ్ నేమ్." సుమిత్ ఆమె వంక ఒకసారి చూసి ... తలెత్తి గంభీరంగా.

"హిజ్ నేమ్ ఈజ్ జి. సురేష్ కుమార్" అన్నాడు.

"ఓ? వాట్ ఈజ్ హి? ఆయన ఇవాళ రాలేదా ఇక్కడికి ? ఎక్కడున్నారు?" అంది.

"సుమిత్ "ఆయన వచ్చారండీ... ఇక్కడే వున్నారు ... ఇదిగో ఈయనే" అంటూ కుర్చీలో కూర్చున్న కలెక్టరు భర్తను చూపిస్తూ అన్నాడు.

ఒక్క క్షణం అంతా నిశ్చేష్టులయి పోయారు.... హెడ్ మిస్ట్రెస్ కలవరపడిపోయి "సుమిత్ వాటీజ్ దిస్ ... ఆర్ యూ జోకింగ్" అంది చాలా సీరియస్‌గా.

"నో మిస్...హి యీజ్ మై ఫాదర్ యు కెన్ ఆస్క్ మై మదర్" అన్నాడు. మరోసారి తొణుకు బెణుకు లేకుండా.

ఈ సారి హెడ్ మిస్ట్రెస్ మొహం మరింత నల్లబడిపోయింది. జరుగుతున్న దానితో సంబంధం లేనట్టు నిశ్చలంగా నిలబడిన రూప వంక ఆవిడ కోపంగా చూసింది. కలెక్టరు గారేమో తెల్లపోయి ఆశ్చర్యంగా చూస్తూ నిలబడి పోయింది.

రూపని ఏ క్షణమైతే స్టేజి మీద చూశాడో ఆ క్షణంలోనే కలెక్టరు భర్త మొహం కళావిహీనమయింది. ఇప్పుడది కాస్తా గుర్తు పట్టలేనంత నల్లగా మాడిపోయింది.

"టీచర్ ... వాటీజ్ దిస్? పెద్ద మనుషులతో వేళాకోళమా, సుమిత్ కి కలెక్టరు గారి భర్త తండ్రేమిటి? ఐ విల్ టేక్ యాక్షన్ ఆన్ హిమ్" గొంతు నొక్కిపట్టి రహస్యంగా అంటూ బెదిరించింది కఠినంగా.

అనుపమా దేవి ఇప్పటికి తేరుకుంది. సుమిత్ వంక, రూప వంక, భర్త వంక చూసింది. గుర్తు పట్టలేనంతగా మాడిపోయిన భర్త మొహం చూడగానే ఆమెకి ఏదో అనుమానం తొంగి చూసింది.

"సుమిత్ ఆర్ యూ షూర్ దట్ హి ఈజ్ యువర్ ఫాదర్ " అంది సుమిత్‌ని చూస్తూ.

సుమిత్ ఆమె వంక సూటిగా చూస్తూ "యస్ మేడమ్" అన్నాడు.

"హు టోల్డ్ యూ?"

"మై మదర్ టోల్డ్ మి"

"హేవ్ యూ నాట్ సీన్ హిమ్ బిఫోర్?" మళ్ళీ అడిగింది అనుపమాదేవి.

"నో దిసీజ్ ది ఫస్ట్ టైమ్ ఐ హేవ్ సీన్ హిమ్" అన్నాడు సుమిత్.

ఆవిడ ఈసారి నిశ్చలంగా నిలబడిన రూప వంక చూసి "టీచర్ ... వాటీజ్ దిస్!? సుమిత్ చెబుతున్నది నిజమా... మావారు మీకూ...భర్తా...ఎలా?" వచ్చీ రాని తెలుగులో పట్టి పట్టి అంటూ ఆశ్చర్యంగా అడిగింది.

రూప తలెత్తి సూటిగా అనుపమాదేవి కళ్ళలోకి చూసింది. "మేడమ్ ఐ నెవర్ సెడ్ దట్ హి ఈజ్ మై హస్బండ్... హి ఈజ్ జస్ట్ ఫాదర్ టు మై సన్ ... దట్సాల్" అంది. అనుపమా దేవికి అర్థమైంది.

"ఓ...ఐ ... సీ అంది స్వాచనగా భర్త వంక చూస్తూ. సురేష్ పరిస్థితి దుర్భరంగా వుంది.

అందరి ముందు అంత అవమానం అయిన సహించలేకపోయాడు. భార్య చూపులు ఎదుర్కోలేకపోయాడు. మాడి పోయిన మొహంతో చటుక్కున లేచి బయటికి చర చర వెళ్ళి పోయాడు. వెడుతూ వెడుతూ రూప వంక కసిగా ఒక చూపు విసిరాడు.

'హెడ్ మిస్ట్రెస్ గాభరాపడిపోతూ ఏదో చెప్పబోయింది'

సభలో కలకలం చెలరేగి గందరగోళం అయింది. అనుపమాదేవి చప్పున తెలివి తెచ్చుకుని మొహంలో భావం మార్చేసి ఏం జరగనట్టు నవ్వుతూ—

"కమాన్ టీచర్ ప్రొసీడ్!" అంటూ హెచ్చరించి, మిగతా ప్రైజులు పంచి పెట్టడం పూర్తి చేసిందావిడ. ఎలాగో సభ పూర్తయింది.

ఆవిడ వెళ్ళబోతూ రూపవంక చూసి "ఐ లైక్ టూ టాక్ టూ యూ ఫర్ టెన్ మినిట్స్. వేర్ కెనయ్ మీట్ యూ" అంది మర్యాదగా.

రూప "మీ ఇష్టం. ఎక్కడైనా సరే, ఇఫ్ యూ హా నో అబ్జక్షన్. ఉయ్ కెన్ గో టు మై హౌస్" అంది.

"సరే! రండి వెడదాం" అంది అనుపమాదేవి కారువైపు నడుస్తూ. రూప హెడ్‌మిస్ట్రెస్‌తో చెప్పి, పర్మిషన్ తీసుకుని ఆవిడతో కారెక్కింది.

వాళ్ళిద్దరూ కారెక్కగానే అందరూ ఒక్కుమ్మడిగా జరిగినదాని గురించి రకరకాలుగా వాఖ్యానాలు ఆరంభించారు. ఆశ్చర్యంగా చెప్పుకున్నారు.

*　*　*

"నౌ టెల్‌మీ ఆల్ ఎబౌట్ దిస్. మావారు మీ అబ్బాయికి తండ్రి ఎలా అయ్యారు. ప్లీజ్! టెల్‌మీ ది ట్రూత్ ఐయామ్ ఇన్‌ట్రెస్టెడ్ టు నో ఆల్ దిస్" చాలా ఆరాటంగా అడిగింది అనుపమాదేవి. సుమిత్‌ని పక్కగదిలో చదువుకోమని చెప్పి ఇద్దరూ ముందు గదిలో కూర్చున్నారు.

మూడు గదుల ఇల్లది. ముందు గదిలో నాలుగు గాడ్రెజ్ కుర్చీలు, ఓ బల్ల, మూలగా టేబిల్ ఫాన్, అలమారలో పుస్తకాలు నీట్‌గా సర్ది వున్నాయి. రెండో గదిలో రెండు మంచాలు, పెట్టెలు, బట్టలు. మూడో గది వంటకి, భోజనానికి. నీట్‌గా వున్న ఆ చిన్న ఇంటిని, ఆ ఇంటి ఇల్లాలు రూపని పట్టిపట్టి కుతూహలంగా చూసింది అనుపమ. ఇల్లులాగే ఇల్లాలూ చాలా

సింపుల్‌గా, చక్కగా ఉతికి గంజిపెట్టిన మంచి ప్రింటెడ్ చీర, అదే బ్లౌజ్, ఎడమ చేతికి వాచి, కుడిచేతికి రెండు గాజులు, మెడలో సన్నని ఛయిన్‌తో జుట్టపొట్టిగా కత్తిరించి రబ్బర్ బ్యాండ్ కట్టిన జుత్తు చాలా తేలిగ్గా లైట్ కలర్ లిప్‌స్టిక్‌తో వున్న రూపని గమనించింది అనుపమ.

ఈమెకి, తన భర్తకి ఎప్పుడు, ఎలా సంబంధం వుండేదో; పిల్లవాడు ఎప్పుడు, ఎలా పుట్టాడో; మరి రూపని పెళ్ళి చేసుకోకుండా ఎందుకు వదిలి తనని చేసుకున్నాడో...ఆమె మనసునిండా రకరకాల ప్రశ్నలు, వాటి జవాబులు వినాలని ఆమెకి చాలా ఆరాటంగా వుంది. రూప అబద్ధం చెప్పలేదన్నది భర్త మొహం చూడగానే గ్రహించగలిగింది ఆమె. ఒక్క అర గంటలో గుర్తుపట్టలేనంతగా మాడిపోయిన ఆ మొహం చూసి సుమిత్‌కి తండ్రి అతనే నన్న దానిలో ఇంక సందేహం ఏమీ లేకపోయిందామెకి.

భర్త గెస్ట్ హౌస్‌కి వెళ్ళిపోయాడని డ్రైవరు చెప్పాడు. అతను తనింకా స్కూలు ఫంక్షన్‌లో ఉందనుకుంటాడు. అతన్ని అడిగేముందు రూపద్వారా సంగతి వినాలనిపించిందామెకి. అతన్ని అడిగితే నిజం కాదని బుకాయించవచ్చు. అందుకే ముందు రూపద్వారా నిజాలు వినాలనుకుని ఆమె వచ్చింది.

అనుపమాదేవిని చూడగానే రూపకు ఎందుకో సద్భావం కలిగింది. చదువు, సంస్కారాలు ఉట్టిపడే ఆమె మొహంలో సౌమ్యత వుంది.

ఆవిడ గుజరాతీ అనీ, ఐ.ఎ.ఎస్. ప్యాసయ్యాక కావాలనే ఈ ప్రాంతంలో కలెక్టరుగా వేయించుకుందనీ విని ఉంది. సురేష్ జైలునుండి వచ్చాక ఊళ్ళో మరి మొహం చూపలేక అహ్మదాబాద్ వెళ్ళి అక్కడేదో ఫ్యాక్టరీ మేనేజిమెంటులో ట్రెయినింగయి వచ్చి ఇక్కడ తనే స్వంతంగా ఓ ఫ్యాక్టరీ నెలకొల్పాడు. ఆ ట్రెయినింగ్ సమయంలోనే ఐ.ఎ.ఎస్. ట్రెయినింగ్‌లో ఉన్న తన బాస్ కూతురి అభిమానాన్ని చూరగొని ఆమెకు భర్త అయ్యాడు. ఆవిడే ఈ అనుపమ.

సురేష్‌కి ఇంత చదువుకున్న భార్య, ఇంత పెద్ద ఉద్యోగస్తురాలు దొరికిందనుకో గానే ఏ మూలో ఏదో అసూయో, అసంతృప్తో తొంగి చూసింది. అతను పెళ్ళి కాకుండా అవస్థలు పడాలని, ఆ విధంగా తన కసి తీరాలని ఆమె అంతరాంతరాలలోని కోరిక తీరకపోగానే ఏదో ద్వేషం కలిగింది. హుఁ...తన పిచ్చిగాకపోతే...ఈ దేశంలో మగాడికి పిల్ల ఏం కరువు? చిన్నప్పుడు ఏదో జరిగిందని పెళ్ళి కాకుండా పోతుందా? మగాడికి అదో పెద్ద తప్పుకింద జమా? అనుకుంది.

"ఏమిటి ఆలోచిస్తున్నారు. ప్లీజ్! చెప్పండి. సారీ...ఫర్ మై బాడ్ తెలుగు. ఇంకా అంత బాగా రాలేదు.డిపార్టుమెంటల్ పరీక్ష పాసయ్యానుగాని మాట్లాడడం మీలాగ రావడంలేదు. ప్లీజ్! మా వారితో మీకెలా...మీ సుమిత్ ఎలా అంతా చెప్పండి" అంది తడుముకుంటూ, "నా తెలుగు చూసి నవ్వకండి" అంది.

"వై డోన్ట్ యూ అస్క్ యువర్ హస్బండ్. ఆయననే అడగచ్చుగదా!" అంది రూప,

"నో! ఫస్ట్ ఐ వాంట్ టు హియర్ ఇట్ ఫ్రం యూ" అంది ఆమె నిష్కర్షగా.

"ఆల్‌రైట్! ఇఫ్ యు వాంట్ టు

హియర్, ఐ విల్ టెల్" అంటూ రూప మొదట్నించి అంతా చెప్పుకొచ్చింది. అనుపమ కళ్ళు వెడల్పు చేసుకుని ఆశ్చర్యంగా వింది.

"నిజంగా ఇంత జరిగిందా, హి నెవర్ టోల్డ్ మీ" అంది.

"హుఁ ఎలా చెప్తాడు? ఒక ఆడపిల్లని వాడుకుని వదిలాసని ఏ మగాడు భార్యతో చెబుతాడు."

"మిస్ రూపా! మీరు నిజంగా చాలా ధైర్యస్థులు. కోర్టుకెక్కి సురేష్‌కి బుద్ధి చెప్పడానికి మీ ఫ్యూచర్ కూడా లెక్క చెయ్యలేదంటే నిజంగా మీ ధైర్యాన్ని మెచ్చుకోవాలి.

అంతేకాదు పెళ్ళి లేకుండా ఇలా ఒక పిల్లవాడ్ని కని పెంచుకోవాలంటే ఎంత సాహసం వుండాలి. రియల్లీ ఐ మస్ట్ కంగ్రాజులేట్ యూ" అంది అభినందన పూర్వకంగా.

"అభినందిస్తున్నారా? అంటే నేను చేసిన పనిని అసహ్యించుకోడం లేదా? ఇలా అక్రమంగా ఓ బిడ్డని కన్న దాని మీద మీకు సానుభూతి వుందా?" రూప సందేహంగా అడిగింది.

"వై షుడ్ ఐ హేట్ యూ? మీరన్నట్టు మీరొక్కరే తప్పు చెయ్యలేదు. అసహ్యించుకుంటే సురేష్ పిరికితనాన్ని, కుసంస్కారాన్ని అసహ్యించుకోవాలి" అంది అనుపమ తీవ్రంగా.

రూప మొహంలో ఆనందం కదలాడింది. ప్రశంసా పూర్వకంగా అనుపమా దేవిని చూస్తూ "మీరింత సహృదయులని అనుకోలేదు. మీరు నా తరఫున మాట్లాడుతారని అనుకోలేదు" అంది పట్టుకున్న గొంతుతో.

"సో, యు హావ్ అండర్ ఎస్టిమేటెడ్ మి. మిస్ రూపా! నేనూ ఒక స్త్రీని, నేనూ చదువుకున్నాను. కాస్తో కూస్తో అభ్యుదయ భావాలున్నాయి. మన స్త్రీలకి అనాదిగా జరుగుతున్న అన్యాయం నాకు మాత్రం తెలీదా? రూపా! నిజంగా నీలా ఆలోచించే స్త్రీలు నూటికి ఒకరన్నా వుండి ధైర్యంగా మగాళ్ళ మోసాలని ఎదుర్కొంటే వాళ్ళ ఆట ఎప్పుడో కట్టేది. రూపా! మై సింపతీస్ ఆర్ విత్ యూ ఐ విల్ నెవ్వర్ ఫర్‌గివ్ సురేష్ ఫర్ దిస్" తీవ్రంగా అంది.

"నో, నో మేడమ్ నా గురించి అనవసరంగా అతనితో మీరు ఘర్షణ పడకండి. జరిగిపోయిందేదో జరిగింది. ఇప్పుడు నాకింతకంటే జరిగే అపకారం ఏమీ లేదు. నష్టపోయిందేదో చాలా రోజుల క్రితమే నష్టపోయాను. ఇప్పుడింక నా ఏకైక లక్ష్యం సుమిత్‌ని బాగా చదివించి వాడికి మంచి భవిష్యత్తు కల్గించడమే! వాడికి తండ్రి లేని లోటు ఏ విషయంలోనూ కనపడకుండా పెంచాలన్నదే నా కోరిక. నేను చేసిన తప్పుకి నా బిడ్డని ఏ అనాథ శరణాలయాల పాలో చేసి వాడ్ని బిచ్చగాడుగా, దొంగగా సమాజానికి చీడ పురుగులా తయారుచేసి వాడ్ని శిక్షించకుండా నేను చేసిన తప్పుకి, నా తొందరపాటుకి నన్ను నేను శిక్షించుకున్నాను. ఎలా పుట్టినా బిడ్డని కని పెంచుకునే హక్కు తల్లికి వుండాలని, అలాంటి బిడ్డకి సంఘంలో స్థానం వుండాలన్న నా ధ్యేయం నెరవేర్చడం కోసం ఎన్నో ఇక్కట్లు పడ్డాను. ఎన్నెన్నో విమర్శలు, హేళనలు, తిరస్కారాలు ఎదుర్కొంటూ ఇన్నేళ్ళు వాడిని పెంచాను. మరెన్ని కష్టాలు పడ్డా వాడిని ఒక మంచి సంస్కారవంతుడిగా, మంచి విద్యావంతుడిగా, మంచి పౌరుడిగా తీర్చిదిద్దాలన్న నా ధ్యేయం నెరవేర్చుకుంటాను.

"మేడమ్! సురేష్‌కి తన బిడ్డ బతికే వున్నట్టు, వాడో అనామకుడుగా, అక్రమ సంతానంగా కాక చక్కగా మంచి పిల్లవాడుగా, క్రమశిక్షణలో పెరుగుతూ రేపు పొద్దున తండ్రిని మించిన తనయుడిగా తయారవుతాడు నా పెంపకంలో... అని తెలియచెప్పడానికే ఈ రోజు సుమిత్‌కి ఆయనే నీ తండ్రి అని చూపాను"

"అంటే మీకు ముందే ఇలా మేం స్కూలుకి వస్తున్నట్టు అంతా తెలుసా? మేం ఇలా సుమిత్ తండ్రి పేరు అది అడుగుతామని ఎలా గెస్ చేశారు" ఆశ్చర్యంగా అడిగింది అనుపమాదేవి.

రూప నవ్వింది. "మనిషి సైకాలజీ ఆ మాత్రం తెలీదంటారా నాకు. సుమిత్ అన్నింట్లో ఫస్టు వచ్చాడు, నేచురల్‌గా అందరూ ఎవరి పిల్లాడని తెల్సుకోగోరుతారు. ప్రైజు లిచ్చేవాళ్ళు సహజంగా స్మార్ట్‌గా, తెలివిగా వుండే పిల్లాడు ఎవరీ అబ్బాయి అని అడగడం సహజం. మీరడుగుతారని నాకు తెల్సు. అడగకపోయినా, హెడ్ మిస్ట్రెస్ ప్రైజ్ డిస్ట్రిబ్యూషన్ అయ్యాక స్కూలు మొత్తం మీద ఎక్కువ బహుమతులు గెల్చుకున్న అబ్బాయిని నా కొడుకుగా పరిచయం చేసి ఉండేవారు. తల్లిని చూశాక

తండ్రి గురించిన ప్రశ్న వస్తుంది. ఆ విధంగా సురేష్ సుమిత్ తండ్రని తెలిసేది. అలా జరగకపోయినా మీటింగ్ అయ్యాక సురేష్ దగ్గరికి తీసికెళ్ళి సుమిత్‌కి మీ తండ్రి అడుగో అని చూపేదాన్ని"

"అంటే, సురేష్ ఎక్కడుంది, ఏం చేస్తూంది అంతా తెలుసన్నమాట మీకు?"

"ఎందుకు తెలియదు. మా సుమతి ఆంటీ వల్ల సురేష్ సంగతి తెల్సుకుంటూనే వున్నాను. సురేష్ ఆర్నెల్లు జైలుశిక్ష, తరువాత అహ్మదాబాద్‌లో ట్రెయినింగవుతూ ఓ గుజరాతి అమ్మాయిని పెళ్ళాడాడని అన్నీ తెలుసు. ఈ వూరికి కొత్తగా వచ్చిన కలెక్టరుగారిని సభకి ఆహ్వానిద్దాం అని హెడ్‌మిస్ట్రెస్ మీ పేరు చెప్పగానే నాకు చాలా సంతోషం కలిగింది నేను అనుకున్నది ఇంత త్వరలోనే సిద్ధిస్తూన్నందుకు."

"ఏం అనుకున్నారు ?"

"తండ్రి లేకుండా, తండ్రి నీడ పడకుండా నా కొడుకుని అన్నింటా అతన్ని మించినవాడిని చేసి అతని ముందు సగర్వంగా నిలబెట్టాలనుకున్నాను. నా కొడుకుని చూసి అతను తల దించుకునేట్టు చెయ్యాలనుకున్నాను. ఆ కోరిక ఎప్పుడో కాకుండా ఇంత త్వరలోనే తీరింది. నే అనుకున్నది సాధించగలిగినందుకు ఈనాడు ఎంతో ఆనందంగా ఉంది మేడమ్" రూప కళ్ళు తడి అయ్యాయి.

"మీరు ఇలా అవివాహితలుగా వుండి, కొడుకుని కని పెంచుకోడంలో ఏమీ ఇబ్బందులు పడలేదా? ఎవరూ ఏమీ అనలేదా? విమర్శలు ఎలా ఎదుర్కొన్నారు" కుతూహలంగా అడిగింది ఆమె.

"ఇబ్బందులు...హుఁ... ఈ సమాజంలో మన కట్టుబాట్ల మధ్య పెళ్ళి కాకుండా బిడ్డని కని పెంచడంలో ఇబ్బందులు ఎదురుగాక ఏమవుతాయి. అయితే మేడమ్! భయపడి ముసుగులో దాక్కునే వాళ్ళనే భయపెడుంది సంఘం. నిర్లక్ష్యంగా తిరిగేవారిని ఏమీ చెయ్యలేరు ఎవరూ. నాలుగు రోజులు అని అని విసుగెత్తి ఊరుకుంటుంది లోకం. అయినా ఇలా వంటరిగా అందరినీ ఎదిరించి నిలబడి బాబుని పెంచుకుంటూ బతకడానికి చాలా సమస్యలే ఎదుర్కొన్నాను మేడం. అయితే నా అదృష్టంకొద్దీ నాకు సుమతి ఆంటీ, ఆవిడ చెల్లెలు డాక్టరు వసుంధరగారి అండదండలు లభించి వారి ధైర్యం, ప్రోత్సాహంతో నా పని సానుకూల పరచుకోగలిగాను

బాబు పుట్టిన మూడు నెలలకి డాక్టరుగారు ఆవిడ పరపతి ఉపయోగించి ఓ ఊర్లో గర్ల్స్ స్కూల్లో టీచరుగా వేయించారు. అన్నాళ్లు ఆ ఇంటి మనిషిగా కల్సిపోయిన నన్ను ఆవిడ వదులుకోడానికి ఇష్టపడకపోయినా నా భవిష్యత్తు ఆలోచించి పురుడయి ఇంకా ఆ ఊళ్ళో వుంటే ఊళ్ళో వాళ్ళ ప్రశ్నలకి తట్టుకోలేమని ఆవిడ ఆలోచించి మరో ఊరులోఉద్యోగం వేయించారు."

"సుమిత్‌కి ఈ రోజు వరకు అతని తండ్రి ఎవరో నిజం చెప్పలేదా?" అనుపమ అడిగింది మధ్యలో.

"తెలుసు. సుమిత్ దగ్గిర ఎప్పుడూ నిజం దాచలేదు. వాడికి తండ్రి అంటే ఎవరో తెలిసి మొదటిసారి ఐదేళ్ళప్పుడు అడిగాడు. ఇరుగు పొరుగు పిల్లలు, స్కూల్లో పిల్లలు అందరూ డాడీ, డాడీ మా నాన్న

అంటూండడం చాలాసార్లు విన్నాక వాడి కో సందేహం వచ్చి-'అమ్మా డాడీ అంటే ఎవరు?' అన్నాడు స్కూల్లో చేర్చిన నెల రోజులకి. వాడలా ఎప్పుడో అడుగుతాడని, ఆ ప్రశ్న ఎప్పుడో ఎదుర్కోవాలని ముందే ఊహించాను కనక ఆ జవాబు ఆలోచించే పెట్టుకున్నాను.'' డాడీ అంటే నాన్న బాబూ" అన్నాను. "మరి...మరి సునీత ఇంట్లో, కిశోర్, మంటూ ఇంట్లో, అందరింట్లో డాడీ వున్నారు. మనింట్లో ఎందుకు లేరు, అన్నాడు అమాయకంగా చూస్తూ.

వాడి మొహం చూస్తూంటే మొదటి సారిగా వాడికి తండ్రి లేకపోవడం వాడి కెంత లోటుగా వుందో తెల్సివచ్చింది "లేరుబాబూ! వాళ్ళ డాడీలు మంచి వాళ్ళు కనక వాళ్లింట్లో వున్నారు. మీ డాడీ బాడ్, అంచేత మన దగ్గర లేరు" అన్నాను అంతకంటె ఆ వయసులో ఏం చెప్పినా అర్థం అవదని.

"అలా తండ్రిమీద నించి వాడి దృష్టి మరల్చాను. వాడు చురుకైనవాడు, ఏది చెప్పినా నిమిషంలో గ్రహించేవాడు. చదువులో క్లాసులో ఫస్టు వచ్చేవాడు. వాడి మీదే నా ఆశలు, కోరికలు అన్నీ. కనక వాడ్ని బాగా చదివించి గర్వంగా సురేష్ ముందు నిలబెట్టడమే నా ఏకైక లక్ష్యం.

"మేడమ్! ఈ జీవితంలో అన్నీ నష్ట పోయాను. ఇరవై ఏళ్ళకే జీవితంలో అన్ని అనుభవాలు, అనుభూతులు పూర్తయి పోయాయి. గత పదేళ్ళుగా ఒంటరిగా పసివాడ్ని పెట్టుకుని ఎలా రోజులు లెక్క పెట్టుకుంటూ గడిపానో మీకు తెలియదు మేడమ్. ఎన్ని రాత్రులు నిద్రపోకుండా భవిష్యత్తు గురించి బెంగపడేదాన్నో మీకు అర్థం కాదు. చేతులారా జీవితం నాశనం చేసుకోలేదుగదా అనిపించేది, ఒకోసారి కోరికల తాకిడికి తట్టుకోలేక. పంతంకొద్ది నా బతుకు నేను నాశనం చేసుకుని తప్పు చేశాను అనిపించేది ఏ జంటను చూసినా. ఏ భార్యాభర్తలని, వారి ముచ్చటయిన సంసారాలని చూసి ఏంపాపం చేశానని వీటన్నింటికి దూరమయ్యానని దుఃఖం వచ్చేది.

స్కూటర్ల మీద, కార్లమీద తల్లిదండ్రుల మధ్య వెళ్ళే పిల్లలని చూసి నా పిల్లాడు దీనికెందుకు నోచుకోలేదు అని మనసు గిలగిల్లాడేది. వాడికి కాస్త ఒళ్ళు వెచ్చ బడితే ఆ ఒంటరితనంలో తోడు లేకుండా ఉండడం ఎంత దుర్భరమో తెలిసివచ్చేది. వాడికేదన్నా అయితే నాకెవరున్నారు ఇంక అని అనవసరంగా భయంతో వణికే దాన్ని. పనిమనిషి, పాలవాడు, కూరల వాళ్ళు, చాకలి, ఇరుగుపొరుగు, స్కూల్లో తోటి టీచర్లు నా గురించి కొందరు గుసగుసలాడుకునేవారు. కొందరు మొగుడొదిలినదానినని సానుభూతి చూపే వారు. మరి కొందరు ఎలాగైనా రాజీ కుదుర్చుకోమని సలహా ఇచ్చేవారు.

"సుమిత్‌కి తండ్రి సురేష్ అనే అందరికీ చెప్పారా ? స్కూలు రిజిస్టర్ వాటిల్లో......" అనుపమ సందేహంగా అడిగింది.

"ఆహా...బర్త్ సర్టిఫికెట్ దగ్గరనించి సురేష్ తండ్రి అనే రాయించాను. ఎవరు అడిగినా ఆ పేరే చెప్పాను.

"మేడమ్! ఈ రోజు ఇలా కూర్చుని ఇంతసులువుగా జరిగింది మీకుచెప్పగలుగు తున్నానుగానీ, ఆనాడు నా ఆందోళన, ఆరాటం, అవమానం ఇవన్నీ ఎదుర్కోలేక నేను పడిన ఆవేదనని ఎలా చెప్పగలను.

ఎలా పీడ్ని పెంచను. ఓహ్! ఆ దిగులు, ఆ వ్యధ అనుభవిస్తేనే అర్థం అవుతాయి" రూప నిట్టూర్చి అంది.

"అర్థమైంది మిస్ రూపా! నౌ లెట్ మీ సీ, వాట్ ఐ కెన్ డు ఫర్ హిమ్. సురేష్‌తో మాట్లాడుతాను. ఇదంతా నా దగ్గర దాచి నన్నెందుకు మోసగించాడో అడుగుతాను" ఆవేశంగా అంది అనుపమ.

"వద్దు మేడమ్! దానివల్ల జరిగేది ఏముంది. మీ ఇద్దరూ ఘర్షణ పడినంత మాత్రాన నా బతుకు ఇప్పుడు చక్కబడదుగదా! ప్లీజ్ ... మీరు నన్ను అర్థం చేసుకున్నారు. నాకంతే చాలు, ప్లీజ్ ఫర్‌గెట్ యిట్" అంది రూప.

"ఊహూ...సురేష్‌లాంటి మగవాళ్ళకి, బాధ్యతనించి పిరికిపందల్లా పారిపోయే మగాళ్ళకి బుద్ధి తెప్పించాలి. మీ కెలాగో అన్యాయం జరిగింది. అది పూడ్చలేనిది. కనీసం సుమిత్‌కైనా"సాలోచనగా అంటూ లేచి నిల్చుంది ఆమె. అభిమానంగా రూప చెయ్యి పట్టుకుని నొక్కి "నేను సురేష్‌తో మాట్లాడి మళ్ళీ వస్తాను...ప్లీజ్ వద్దనకండి. మిమ్మల్నిలా చూశాక నాకేం పట్టనట్లు నేను వూరుకుంటే నా చదువుకి అర్థం వుండదు. గుడ్‌నైట్" అంటూ చక చక వెళ్ళి కారులో కూర్చుంది.




అనుపమ ఇనస్పెక్షన్ బంగళాకి వెళ్ళేసరికి సురేష్ బోనులో పడ్డ పులిలా ఇటు అటు వరండాలో చేతులు వెనక్కి కట్టుకుని పచార్లు చేస్తున్నాడు. అనుపమ కారు దిగగానే పచార్లు ఆపి "ఎక్కడికి వెళ్ళావు యింతసేపు ?" అన్నాడు తీక్షణంగా. "రూప ఇంటికి. ఏ రూప అని అడుగుతారేమో! పదేళ్ళ క్రితం ఆమెని ప్రేమించానని ఆమెతో తిరిగి పెళ్ళి పేరు చెప్పేసరికి మొహం చాటు చేశారే ఆ రూప ఇంటికి" సూటిగా అతని కళ్ళలోకి చూస్తూ అంది. సురేష్ మొహంలో రక్తం పొంగింది.

"దాని మాటలన్నీ నమ్ముతున్నావా ? నా మీద కసి తీర్చుకోడానికి వున్నవి లేనివి చెప్పి వుంటుంది. షి ఈజ్ ఎ బిచ్..." సురేష్ క్రోధావేశాలతో అరిచాడు.

"ఆమెకి తీరని ద్రోహం చేసి, చేసిన తప్పుకి సిగ్గుపడి పశ్చాత్తాప పడాల్సింది పోయి ఆమెని గురించి ఇలా మాట్లాడడానికి డోన్ట్ యూ ఫీల్ ఎషేమ్‌డ్, ఆమె 'బిచ్' అయితే అదే పని చేసిన నిన్నేమనాలి?" తీవ్రంగా అంది.

"అనూ..."

"ఏం ఎందుకా అరుపు? నీ సంగతి తెల్సిపోయిందనా! నీవేదో చదువుకున్నవాడివి సంస్కారం వుంటుందని భావించాను. ఒక ఆడపిల్ల జీవితంతో ఆడుకుని, అంత నీచంగా ఆమెని అవమానించి ఆమె ఖర్మానికిఆమెని వదిలే హీనుడవనిగుర్తించలేకపోయినందుకు విచారిస్తున్నాను. ఈ సంగతి నా దగ్గర ఎందుకు దాచి నన్ను మోసం చేశావు. ఐ వాంట్ ఏన్ ఎక్స్‌ప్లనేషన్ ఫర్ దిస్" అనుపమ కఠినంగా అంది.

సురేష్ మొహం మరింత ఎర్రబడింది. "నా గతం గురించి అడిగే హక్కు నీకు

లేదు. పెళ్ళయ్యాక నేనేమన్నా చేస్తే సంజాయిషీ అడిగితే అర్థం వుంటుంది" ఆమె ముందు తగ్గిపోవటం ఇష్టం లేక సమర్థించుకుంటూ అన్నాడు. నిపుపమ అతని వంక తిరస్కారంగా చూసింది. "ఓహో నీవు మగవాడివి గనక పెళ్ళికి ముందు ఎన్ని తిరుగుళ్ళు తిరిగినా ఫరవా లేదన్నమాట. అదేనే చేసివుంటే,నా గతం గురించి పట్టించుకోకుండా వూరుకునే వాడివా ? నా గతం అవసరం లేదనే సహృదయం వుండేదా ?"

"పెళ్ళికి ముందు పరిచయమున్న ఏ పురుషుడితోనో, ఏ కాలేజీ స్నేహితుడి తోనో, ఏ అన్నయ్య స్నేహితుడో పలకరిస్తేనే మొహం మాడ్చుకుంటారే మీ మగవాళ్లు. కాస్త ఎవరితోనన్న సరదాగా మాట్లాడితేనే వాళ్ళిద్దరి మధ్య ఏదో వుందని అపోహపడి అనుమానాలతో కాల్చుకు తింటారే మీ మగవాళ్ళు. భార్య ఏ చిన్నప్పుడో తెలిసీ తెలియని వయసులో ఎవరికన్నా మనసిచ్చి, ఏ ప్రేమలేఖో రాస్తే, అది కంటపడితే పెళ్ళాం శీలాన్ని అనుమానించి, అవమానించి ఆవిడ్ని ఇంట్లోంచి తరిమి కొడతారే...అలాంటిది పెళ్ళికి ముందు ఒక అమ్మాయితో తిరిగి ఆమెకి ఒక బిడ్డని ఇచ్చా నా దగ్గర ఇది ఎందుకు దాచావు అని అడిగే హక్కు నాకు లేదా ? నీ నీతి నియమాలతో, నీ శీలంతో నాకు పని లేదనా నీ ఉద్దేశం. వివాహం చేసుకునే అమ్మాయి పవిత్రంగా వుండాలని మీరు కోరుకుంటారే, అలాగే వి వా హ ం చేసుకునే పురుషుడు పవిత్రంగా వుండాలని మేము కోర కూడదా? మిస్టర్ సురేష్! ఈ పాతకాలపు కబుర్లు, ఈ ద్వంద్వనైతిక నీతి సూత్రాలు ఇంకా వల్లిస్తే సహించి వూరుకునేంత దద్దమ్మలం కాం మేము. నన్ను వివాహం చేసుకునే ముందు, నీవే నిజాయితీ పరుడి వయితే నిర్భయంగా నీవు చేసిన తప్పు ఒప్పుకునే వాడివి. ఫ్రాంక్‌గా మాట్లాడుకునేవాళ్ళం. నా కిష్టమైతే నిన్ను చేసుకునే దానిని ఇలా నీ విషయం నా దగ్గర దాచి నన్ను మోసం ఎందుకు చేశావు" అనుపమ అంత తీవ్రంగా దబాయించగానే సురేష్ బెదిరాడు. మాటల కోసం తడుముకున్నాడు.

"అయితే ఏమంటావు యిప్పుడు ?" అతను కరకుగా అడిగాడు.

"నీతి నియమాలు, శీలం, పవిత్రత లేని భర్తతో కాపురం నేను చెయ్యలేను. నేను ఏదన్నా భరిస్తాను గాని మోసాన్ని భరించలేను. నాకు కొన్ని నియమాలు వున్నాయి. నేను నిజాయితీగా నీతో జీవితం పంచుకున్నాను. నా భర్త అంత నిజాయితీగా వుండడాన్ని నేను కోరతాను. ఇన్నాళ్ళు నీ వెలాంటి వాడివో తెలియక నిన్ను పెళ్ళి చేసుకుని కాపురం చేశాను. తెలిశాక ఇంక నీ నీడ కూడా సహించం లేను. నీలాంటి సంస్కారహీనునితో కాపురం చెయ్యడం నా వల్ల గాదు"

అనుపమ ఇంత దూరం వెడుతుందని సురేష్ ఆశించలేదు. తిడుతుంది, అరుస్తుంది, కోపంతో మాటలు మానేస్తుంది. అలుగుతుంది అదంతా తెలిసి అనుకున్నాడు కాని కాపురం వదులుకుని పోయేటంత దూరం ఆలోచిస్తుందని అతను ఎదురు చూడలేదేమో ఆ మాటలకి నివ్వెరపోయాడు. లోపల్నించి చమటలు ఆరంభించాయి.

"అది...అది...ఆ రూప...ఆ రాక్షసి.. ఆ బిచ్ నాకు చేసింది ఇంకా చాలక నన్ను కోర్టుకీడ్పించి, నా పరువు మంట

గల్పినా కసి తీరక, ఇలా నీకు అన్నీ కల్ల బొల్లి మాటలు చెప్పి మన ఇద్దర్నీ విడ దీసి కసి తీర్చుకోవాలని చూస్తూంది.దాని మాటల వలలో పడిపోయి ఇలా నన్నే కాదంటావా? ఐ విల్ కిల్ దట్ బిచ్. ఏదో వంకని ఆ ముండని జైలుకి పంపిస్తాను."

సురేష్ ఒళ్లు మరిచి ఆవేశంతో వణు కుతు అరిచాడు.

"సురేష్! మరొక్కమాట ఆమెగురించి చెడుగా మాట్లాడావంటే నేనూరుకోను. నేనూ స్త్రీని. ఒక స్త్రీని ఇలా అమ ర్యాదగా, కుసంస్కారపుడిగా మాట్లాడు తుంటే నేను ఎంతమాత్రం సహించను. ఐ విల్ టీచ్ యూ ఎ లెసన్"కర్కశంగా అంది అనుపమ.

"నీకేదో మందు పెట్టింది. దానివలలో పడిపోయావు. ఇంతలా నిన్ను మార్చే సింది. అదెలాంటిదో నీకు తెలియదు. ముందు చెప్పకపోవడం తప్పే! ఇప్పుడు చెప్తా విను. విన్నాక నీకే తెలుస్తుంది".

"అవసరంలేదు. అంతా ఆమె నోట విన్నాను. ఆమె చెప్పింది నిజమని నమ్మాను. అనవసరంగా కంఠ శోషపడి మళ్ళీ చెప్పకు. ఇంక మనం ఇద్దరం కల్సి వుండడం అసంభవం. నేను నీనించి విడి పోతాను. కోర్టులో డైవోర్స్‌కి అప్లై చేసాను"స్థిర నిశ్చయంగా అంది అనుపమ. సురేష్ మొహం తెల్లగా పాలిపోయింది.

అనుపమ వెళ్ళిపోతుంది. విడిపోవాలి. కోర్టు...డైవోర్స్...తన పరువు ప్రతిష్ఠ... లోకుల హేళనలు జీవితంలో రెండో సారి పరువు నడిబజారు కెక్కబోతూంది. సురేష్‌కి చమటలు పట్టాయి. ఎంత నిల దొక్కుకుందామన్నా కాళ్ళలో వణుకు పుట్టింది.

"అయితే నీ దృష్టిలో నాకున్న విలువ ఇంతేనన్నమాట? ప్రేమించుకున్నాం పెళ్ళి చేసుకున్నాం. సంసారం చేశాం. పిల్లని కన్నాం. ఆ వివాహబంధానికి నీవిచ్చే విలువ ఇంతేనన్నమాట? ఎప్పుడో జరిగిన దానికోసం దాని మాటలు నమ్మి విడిపోతాను అని బెదిరిస్తావా. హుఁ... నీవు ఉద్యోగస్థురాలివని కదూ ఆ గర్వం? అందుకే కాదూ అంత తెగింపు. నీవిలా బెదిరిసే నీ కాళ్లు, దాని కాళ్ళు పట్టుకుంటా ననా నీ ఉద్దేశం. వెళ్ళు వెళ్ళు సంసారం వదులుకుని లేచిపోతే నష్టపోయేది ఆడదే. నాకేం పోయేదిలేదు. నేను మగాణ్ని" అహంకారంతో అన్నాడు.

అనుపమ తిరస్కారంగా చూసింది. "పెళ్ళి మానుకునే రూప బతకగలిగింది. కాపురం వదులుకుని నేను బతకలేనం టావా? మగాడినన్న అహంకారంతో ఇన్నాళ్ళు మీ జులుం సాగించారు.ఇప్పుడు ఈ కష్ట నష్టాలని ఎదుర్కొనే మనస్థైర్యం ఆడవాళ్ళకి అబ్బుతుంది. నిజమే నేనూ ఉద్యోగస్థురాలిని. నీతో సరి సమానంగా సంపాదిస్తున్నాను. నా బతుకు నేను బతక గలను. అందుకే వెడుతున్నాను. ఆడదానికి ఇన్నాళ్ళూ ఆర్థిక స్వాతంత్రం లేకపోబట్టే ఆమెని గుప్పిట్లో బిగించి ఆటలాడారు. ఇప్పుడింక మీ ఆటలు సాగవు. ఇన్ని మాటలనవసరం. రేపు ఉదయమే నేను వూరికెడుతున్నాను.

ఇంకా ఏదన్నా మాట్లాడాలనిఉంటే కోర్టులో మాట్లాడుకుందాం. గుడ్‌నైట్" అనుపమ విసుగ్గా లోపలి గదిలోకి వెళ్ళి పోయింది.

సురేష్ స్థాణువులా నిలబడిపోయాడు. ఇదేమి హాస్యంగాదు అనుపమ సీరియస్‌గా మాట్లాడింది అని అతనికర్థమైంది. అతనేం

చెయ్యాలో తోచనట్టు నిర్జీవంగా కుర్చీలో కూలబడ్డాడు. అనుపమతో రాజీ మినహా మరో దారి లేదన్నది అతనికి అర్థమైంది. తన హోదా, పరువు, గౌరవం నిల్పుకోవాలంటే అనుపమని నిల్పుకోవాలి. లేదంటే మరోసారి తన బతుకు నవ్వుల పాలవుతుంది.

అనుపమతో 'సారీ! గతంలో జరిగింది పొరపాటే నీతో ఎలా చెప్పగలను అంచేత చెప్పలేకపోయాను క్షమించు' అనాలి. ఎలా అనడం? మగ అహం అడ్డువచ్చింది. మరో అరగంటకి మగ అహాన్ని అవతలికి నెట్టి నిస్సహాయిగా లేచి గదిలోకి వెళ్లాడు. అనుపమ పక్కమీద కూర్చుని ఐదేళ్ళ కూతురికి ఏదో కథల పుస్తకం చూసి చెపుతూంది.

"అనూ! సారీ అనూ! జరిగింది మర్చిపో. ఐయామ్ రియల్లీ సారీ ఫర్ ది పాస్ట్. చెప్పి నిన్ను వదులుకోలేక నీనించి దాచాను. ప్లీజ్ మరిచిపో. నా కోసం కాకపోయినా మన నీరూ కోసం. అందరికంటె ఎక్కువగా 'నీరూ'కి మన ఇద్దరి అసరా కావాలి. అది నీకు తెల్సు. సారీ చెప్పానుగా, ఇంకా నన్ను శిక్షించకు" అన్నాడు మంచంమీద కూర్చుని అనుపమ వంక చూసి. ఆమె అతని కళ్ళలోకి చూసింది. "క్షమాపణ చెప్పవలసింది ముందు రూపకి. ఆ తరువాత నాకు. ముందు వెళ్ళి ఆమెకి చేసిన అన్యాయానికి క్షమాపణ చెప్పండి. ఆమె మిమ్మల్ని క్షమిస్తే నేనూ క్షమించగలను" అనుపమ అంది.

సురేష్ మొహంలో మళ్ళీ ఆవేశం ఉబికింది. "ఇంపాసిబుల్ — దానికి నేను క్షమాపణ చెప్పడమా!? నీవు నా భార్యవి. నిజం దాచి నిన్ను వివాహం ఆడానుకనక నీకు సంజాయిషీ ఇస్తున్నాను. దానికి నేనెందుకు చెప్పాలి. షి ఈజ్ నో బడీ టు మి. నాకంత అవమానం చేసిన దాన్ని ఈ జన్మలో క్షమించను. అనూ! నీ దగ్గర సారీ అనడానికి నేను సిగ్గుపడను. ఒక సారి కాదు వందసార్లు చెబుతా, కాని రూపకి మాత్రం చచ్చినా చెప్పను" అన్నాడు నిష్కర్షగా.

"అయితే సరే మీ అహం దాచుకోండి నన్ను వదులుకోండి" అంటూ మళ్ళీ కూతురితో మాటలు మొదలుపెట్టింది. రెండు నిమిషాలు చూసి పొంగే ఆవేశాన్ని అదుపులో పెట్టుకుంటూ—

"నీ ఉద్దేశం ఏమిటసలు? రూప దగ్గరకి నన్ను పంపి, ఆమెకి క్షమాపణలు చెప్పించి కించపరిచి, అవమానపరిస్తే నీ కోపం చల్లారుతుందా? నీ కసి అప్పటికి తీరుతుందా?"

"కసి కాదు...అది మీ కనీస ధర్మం. ఆమెకి జరిగిన అన్యాయానికి మానవత్వం వున్న ఎవరన్నా చేసిన తప్పుకి, పాపానికి ఆమెకి క్షమాపణ చెప్పి ఆ పాపం కడుక్కోవాలి. చూడండి. దేవుడు ఎప్పుడో ఎక్కడో శిక్షించడు. మనం చేసిన పనులకి యీ జన్మలోనే అనుభవించాలి. ఇదిగో మీరు రూపకి చేసిన ద్రోహానికి, ఆమె బిడ్డకి జరిగిన అన్యాయానికి శిక్షగా 'నీరూ' రూపంలో భగవంతుడు మిమ్మల్ని శిక్షించాడు. ఈ అవిటిపిల్లనిచ్చి జన్మంతా ఏడవమని శిక్షించాడు. మీరు చేసిన తప్పు నా బిడ్డని బలిగొంది. ఇంకా మీరు రూపని క్షమాపణ అడగడానికి సిగ్గుపడ్తారా...?" అనుపమ కంఠం రుద్ధమయింది.

సురేష్ మొహం వివర్ణమయింది. నీరూ వంక చూస్తుంటే అతని మనసంతా కలచి

వేసింది. నిజమా! ఇది రూపకి తను ద్రోహం చేసినందుకు. ఆమె బిడ్డకి అన్యాయం చేసినందుకు దేవుడు తన బిడ్డనిలా అవిటి దాన్నిచేసి తనని శిక్షించాడా ?... తన పాపం నీరూని బలిగొందా?

సురేష్, అనుపమలకి వివాహమయ్యాక ఆలస్యంగా మూడేళ్ళ తరువాత కాన్పు వచ్చింది అనుపమకి. బిడ్డ పుట్టిన సంతోషం మూడు క్షణాలు నిలువలేదు. ఆ పిల్ల పుట్టడమే నడుందగ్గర 'ఓపెన్ వూండ్'తో పుట్టింది.డాక్టర్లు చూడగానే చెప్పేశారు."ఈ పిల్లకి నడుంకింద భాగంకి నరాలువెళ్ళలేదు. ఆ నరాలన్నీ వుండచుట్టుకుని నడుందగ్గర వుండలా వుండిపోయాయి. అంచేత నడుం కింద భాగం పనిచెయ్యదు. స్పర్శజ్ఞానం వుండదు. జన్మంతా అలా అవిటిదాని మాదిరిగానే వుండాలి. ఏ డాక్టరు చెయ్యగలిగింది ఏమిలేదు. ఆ బిడ్డ ఎంత త్వరలో చనిపోతే అంత అదృష్టవంతులవుతారు" అన్నారు.

అనుపమ ఆ మాట విని తెలివితప్పింది. సురేష్ అవస్థ వర్ణనాతీతం ! బిడ్డ బతికి బాగుండాలని ఏ తల్లితండ్రులైనా కోరడం సహజం. దానికి విరుద్ధంగా అనుపమ, సురేష్– అటు యిటు అందరూ ఆ బిడ్డ బతికితే ఆ బిడ్డకి నరకం, కన్నతల్లికి నరకం ఆ బిడ్డపోతే చాలన్నట్టుగా దేముడ్ని ప్రార్థించారు. మీరు చేసిన పాపం అనుభవించాలి అన్నట్టుగా ఆ బిడ్డ బతుకుతూనే వుంది. ఎన్నెన్ని మందులు, డాక్టర్లు, ఎన్ని పూజలు, ముడుపులు ఏవి చేసినా ఆ బిడ్డ బతుకంతే.

కాళ్లులేక, నడవలేక జీవితం అంతా అలా అవిటిదానిలా బతకవలసిన కూతుర్ని చూసి అనుపమ, సురేష్‌ల జీవితంలో ఆనందమే లోపించింది. ఆ యింట నవ్వులే కరువయ్యాయి. బిడ్డ పెరుగుతున్నకొద్దీ మిగతా పిల్లలతో పోల్చుకుని ఆ తల్లిదండ్రులుపడే బాధ వర్ణనాతీతం. దానికి తగ్గట్టు తరువాత ఐదేళ్ళయినా మరో కాన్పు రాలేదు అనుపమకి. మరో బిడ్డ అయినా వుంటే కాస్త దుఃఖం తగ్గేదేమో. అదీ లేక పోవడంతో వారి జీవితంలో సారం చచ్చిపోయింది. ప్రేమించి పెళ్లి చేసుకున్న ఆనందం మూడునాళ్ళ ముచ్చటయింది.

అనుపమ మాటలు వినగానే మానిన గాయం రేగినట్లయింది సురేష్‌కి.

అతని మొహంలో బాధ చూసి "సురేష్ ప్లీజ్ ! ఆమె దగ్గరకి వెళ్ళు. ఒక్కసారి క్షమాపణకోరు. నీకన్నబిడ్డని చూసుకో. ఆ బాబే నీ పెద్దకొడుకు అనుకో ! రూపకి జరిగిన అన్యాయం సరిదిద్దలేనిది. కాని సుమిత్‌కి అన్యాయం జరగకుండా చూడడం నీవిధి. ఆబిడ్డకి తండ్రిప్రేమ కొంతయినా దక్కనీ ! కన్నందుకు తండ్రిగా నీ చేతనయింది చెయ్యి. మనకి వాడు మగబిడ్డ అనుకో. నీ మొదటి బిడ్డ వాడు. నాకు ఇంకా పిల్లలు పుట్టినా వాడే నీకు పెద్దకొడుకు. మన పిల్లలతోపాటు ఆ పిల్లాడికి ఆస్థి హక్కు ఇవ్వు. నీ కనీస బాధ్యత అది. ఈ విధంగా చేస్తే ఆ దేముడు నిన్ను క్షమించవచ్చు. మనకు మళ్ళీ ఓ బిడ్డ పుట్టచ్చు. మన ఈ దిగులు, దుఃఖం కాస్తయినా తీరచ్చు. వెళ్ళు సురేష్. వెళ్ళు. ప్లీజ్! నిన్నర్థిస్తున్నాను" అనుపమ చేతులు జోడించి గద్గదికంగా అంది.

సురేష్ ఇంక ఆపుకోలేకపోయాడు. ఆమె భుజానికి తల ఆన్చి చంటి పిల్లాడిలా ఏడ్చేశాడు.

* * *

రాత్రి తొమ్మిది గంటలవేళ కారులో

వచ్చిన సురేష్, అనుపమ నీరూని చూసి ఆశ్చర్యపడింది రూప. అనుపమ సురేష్‌ని మందలించి క్షమాపణ చెప్పించడానికి తీసుకొచ్చి వుండవచ్చని అనుకుంది రూప. తలుపు తీసిన రూపవంక సూటిగా చూడలేక కళ్ళు వాల్చుకున్నాడు సురేష్.

"ఏమిటలా చూస్తున్నారు - మమ్మల్ని లోపలికి పిలవరా?" అంది అనుపమ నవ్వి. తెల్లపోయి నిల్చున్న రూప తేరుకుని...

"రండి. ... రండి ..." అంది...- లోపలికి వెళ్లి లైటు, ఫాను వేసింది.

"రూపా! సురేష్ నీకు చేసిన ద్రోహానికి క్షమాపణ కోరాలని వచ్చాడు" అంది అనుపమ ఉపోద్ఘాతంగా.

"రాలేదు. మీరు తీసుకొచ్చారు" రూప అదోలా నవ్వి అంది.

సురేష్ మాటలు కూడదీసుకుంటూ, "నిజమే రూపా! అనుపమ నా కళ్ళు తెరిపించింది. రూపా ఐ యామ్ సారీ! నన్ను క్షమించు" సిగ్గుపడుతూ అన్నాడు.

"ఇన్నేళ్ళ తరువాత ఈ క్షమాపణలకి అర్థమూ లేదు, ప్రయోజనమూలేదు. ప్లీజ్! దయచేసి నా మానాన నన్ను బతకనీ! నీతో మాట్లాడితే నా నోరు నా అదుపులో ఉండదు. అనవసరంగా అన్‌ప్లెజంట్ సీన్స్ నాకిష్టం లేదు. దయచేసి వెళ్ళిపోండి" రూప కటువుగా అంది.

సురేష్ ఇబ్బందిగా అనుపమవంక చూశాడు. అనుపమ సురేష్‌వంక 'ఆమెని సమాధానపరచడం నీ వంతు' అన్నట్టు చూసింది.

"రూపా! నేను చేసింది తప్పే. తెలిసీ తెలియని వయసులో వ్యామోహాన్ని ప్రేమ అనుకుని నీతో ఆటలాడాను. బాధ్యత మీద వేసుకునే శక్తిలేక నిన్ను వదుల్చుకోవాలని నిన్ను అవమానించాను. దానికి నీవు తగిన ప్రతీకారం చేశావు. ఇద్దరం తప్పు చేశాం."

"కానీ శిక్ష నేను అనుభవించాను. జీవితంలో ఇరవై ఏళ్ళకే అన్ని అనుభవాలు కోల్పోయి మోడులా బతుకుతున్నాను. నీకేం నిక్షేపంలా బతుకుతున్నావు. మరో అందమైన యువతిని పెళ్ళాడావు. ఉద్యోగం, వ్యాపారం, గౌరవం, పరపతి, సంసారం, పిల్లలు...ఇన్నింటి మధ్య హాయిగా వున్నావు పెద్దమనిషిలా. నేను అవహేళనలు, తిరస్కారాలు, అవమానాలు, బాధ్యత నెత్తిన వేసుకుని ఒంటరిగా జీవితంతో పోరాడుతున్నాను. ఇప్పుడు చెప్పు. నీ కారణంగా ఇంత నష్టపోయిన నేను నిన్ను ఎలా క్షమించాలో, అసలు ఎవరైనా క్షమించగలరేమో చెప్పు. నేను మామూలు మనిషిని. అందులో ఒక ఆడదాన్ని. అంత ఔదార్యం, క్షమ చూపడానికి నేనేం దేవతనికాను" కటువుగా చూస్తూ అంది.

"ఇంతకీ ఇన్నేళ్ళ తరువాత నా క్షమాపణ నీకు దేనికి, నేను క్షమించకపోతే నీకు జరిగే నష్టం ఏమిటి?" వ్యంగ్యంగా అంది రూప.

"నాకు చేసిన అన్యాయానికి దేవుడు అంటూ వుంటే. నిన్ను క్షమించి వుండేవాడు. ఆ దేవుడే నిన్ను క్షమించి, నీకు అన్ని సుఖాలు అందించి సుఖంగా ఉండమన్నప్పుడు ఇంక నా క్షమాపణ దేనికి?"

"కాదు రూపా! ఆ దేవుడు నన్ను క్షమించలేదు. నీకు, నీ బిడ్డకి నేను చేసిన అన్యాయానికి ఇదిగో చూడు. నా కూతురిని అవిటిదాన్ని చేసి జన్మంతా ఏడవమని నన్ను శిక్షించాడు" నీరూని చూపుతూ

అన్నాడు.

రూప ఆశ్చర్యంగా నీరూ వంక చూసింది.

"ఏమిటి? ఏమిటైంది. ఎందుకలా..." అనుపమని చూస్తూ ఆమెకి తెలియకుండానే అడిగింది. అనుమప క్లుప్తంగా సంగతి వివరించింది.

రూప సానుభూతిగా చూసింది. "రూపా! ఇన్నాళ్ళు నీమీద కోపంతో, కసితో నీవు నన్ను కోర్టుకెక్కించి అవమానించావని నిన్ను అసహ్యించుకుని కసి పెంచుకున్నాను. కానీ అనుపమ... ఆమె మూలంగా నా తప్పు తెలుసుకున్నాను. నీవు నన్ను క్షమించకపోతే ఆమె నన్ను క్షమించదు. మా నీరూకోసమన్నా మేమిద్దరం కలిసి వుండాలి. అసహాయురాలైన మా బిడ్డకి తల్లితండ్రి ప్రేమ కావాలి" సురేష్ కంఠం పట్టుకుంది. రూపలో ఏదో గాయం రేగింది. చురుకుగా చూసింది.

"సురేష్! నా బిడ్డ తండ్రి ప్రేమకి నోచుకోకుండా పదేళ్ళనించి బతుకుతున్నాడు" అంది. సురేష్ మొహం ప్లానమయింది.

"ఈనాడు అనుపమ నిన్ను క్షమించదని, ఆమె ఈ కారణంగా ఇల్లు విడిచి వెళ్ళిపోతే నీ పరువు-ప్రతిష్ట మంటగలుస్తాయని ఆమెకోసం క్షమాపణ అడుగుతున్నావు" కటువుగా అంది.

"రూపా!" అనుపమ కల్పించుకుంటూ జరిగిపోయినది తిరిగి తేలేం. తప్పులు చేయడం మానవ లక్షణం. తప్పు ఒప్పుకుని పశ్చాత్తాప పడేవాళ్ళని క్షమించడంలో మానవత్వం కనిపించాలి. నీ బాధ, ఆవేదన అర్థం అయింది. నీకు అతనేం చెయ్యలేకపోయినా నీ బిడ్డకి చేతనయింది చెయ్యాలనే ఇప్పుడు వచ్చాం" అనుపమ సౌమ్యంగా అంది.

"రూపా! సుమిత్ నా బిడ్డ. వాడు నా మొదటి బిడ్డ. ఈరోజునించి వాడి బరువు బాధ్యత నీతోపాటు నేనూ పంచుకుంటాను. నా 'నీరూ'కి వాడు అన్నయ్య. నాకింక ఎంతమంది పుట్టినా వాడు నా మొదటి బిడ్డ. వాడికీ నా ఆస్థిపాస్థులలో ఒక భాగం వుంది."

"మీ దయా ధర్మాలు వాడికి అవసరం లేదు. మీరు జాలిపడి ఇచ్చే దానాలు వాడికి అవసరంలేదు. నా బిడ్డని నేను పెంచుకోగలను" గాయపడిన మనసుతో తీవ్రంగా అంది రూప.

"దయ, ధర్మం కాదు. అది వాడి హక్కు. తండ్రి ఆస్థికి హక్కుదారుడు వాడు. వాడికి సంక్రమించాల్సింది దానం చేసే హక్కు నాకేం లేదు. అది వాడి హక్కు. రూపా!నీ కోపం నాకర్థమయింది. నా మీద కోపంతో వాడి హక్కుని కాదనకు. రూపా! సుమిత్‌ని చూస్తే నాకు చాలా గర్వంగా, ఆనందంగా వుంది. నీ పెంపకంలో వాడ్ని చక్కగా తీర్చిదిద్దావు. నీలాంటి తల్లి అండన వాడు సంస్కారవంతుడిగా పెరుగుతాడు. వాడు నీ పేరుతోపాటు నా పేరూ నిలిపే అవకాశం నాకియ్యమని అభ్యర్థిస్తున్నాను. నిన్ను నేను నా జీవితంలోకి ఆహ్వానించలేనుగానీ సుమిత్‌ని సంతోషంగా ఆదరిస్తాను. వాడికేం అవసరమయినా వాడి తండ్రి ఉన్నాడన్నది నీవు గుర్తుంచుకో" సురేష్ ఎమోషనల్‌గా చమర్చిన కళ్ళతో రూపని అభ్యర్థిస్తూ అన్నాడు.

రూప విచలిత అయింది. హఠాత్తుగా ఆమెకి దుఃఖం ముంచుకు వచ్చింది.

అన్నాళ్ళు ఒంటరిగా, ధైర్యంగా పోరాడిన రూప ఆ క్షణంలో బేల అయిపోయి ఏడ్చింది. చటుక్కున అనుపమ ఆమె భుజం చుట్టూ చెయ్యివేసి దగ్గరికి లాక్కుంది.

"నో రూపా! ఏడవద్దు. నీలాంటి స్త్రీ ఏడవకూడదు. ఇన్నాళ్ళు ఒంటరిగా అన్నింటికీ ఎదురు నిలిచావు. ఈరోజు నీకు అండగా మేం ఉన్నాం" ఓదార్చింది అనుపమ.

"నా సుమిత్ తప్ప నాకెవరూ... ఈ లోకంలో ఎవరూ... ఈనాడు తండ్రి నంటూ సురేష్ వచ్చి వాడి ప్రేమ, అభిమానం పొంది వాడ్ని నాకు దూరం చేస్తారా? నో! వాడి ప్రేమ నాకు తప్ప మరొకరికి దక్కకూడదు" రూప అక్కసుగా అంది.

"నో రూపా! దిసీజ్ బాడ్. సురేష్ మీద కోపంతో అలా ఆలోచిస్తున్నావు. అది సరికాదు. బిడ్డకి తల్లితండ్రి ఇద్దరి ప్రేమా కావాలి. సురేష్ నీ భర్త అయితే ఇలా ఆలోచించేదానివా? నో... అలా లీన్‌గా ఆలోచించకు. నీ బిడ్డ నీకే ఉంటాడు. వాడి ప్రేమ, అభిమానం ఎలాగూ నీకే ఉంటాయి. సురేష్‌ని తండ్రిగా అంగీకరింపచెయ్యి. అంతే చాలు. అప్పుడప్పుడు సురేష్ వచ్చి వాడి మంచి చెడ్డలు చూస్తాడు. ఎప్పుడైనా సెలవుల్లో వాడిని రెండు రోజులు తండ్రి దగ్గరికి పంపుతూ వుండు. లోకానికి సురేష్ తండ్రి అని నిర్భయంగా చెప్పు" అనుపమ అనునయిస్తూ అంది.

"రూపా! సుమిత్‌ని పిలువొకసారి. ఒకసారి సరిగా చూడనియ్యి నన్ను. ప్లీజ్" అన్నాడు సురేష్ ప్రాధేయపూర్వకంగా.

పక్కగదిలో సంభాషణంతా వింటున్న సుమిత్‌ని అనుపమ లోపలికెళ్ళి భుజం చుట్టూ చెయ్యివేసి ఆప్యాయంగా తీసుకు వచ్చింది.

"సుమిత్! ఇన్నాళ్ళు మీ డాడీ ఎవరని అడిగావుటకదా! ఈయనే మీ డాడీ" అంది. సుమిత్ స్థాణుగా తండ్రివంక చూశాడు. తరువాత రూపవంక చూశాడు.

సురేష్ రెండడుగులు ముందుకు వేసి సుమిత్ చెయ్యిపట్టుకుని, "హలో సుమిత్! డోన్ట్ యు ఫర్ గివ్ యువర్ డాడీ!" అన్నాడు.

సుమిత్ ఆ మాటకి మెత్తపడి పోయాడు. తల్లివంక ప్రశ్నార్థకంగా చూశాడు. రూప తల ఆడించింది.

"ఆల్ రైట్ డాడీ! మమ్మీ క్షమించింది కనుక ఐ యామ్ ఆల్సో ఫర్ గివింగ్ యు" అన్నాడు హుందాగా.

"దెన్ కాల్ మీ డాడీ" అన్నాడు సురేష్ సంతోషంగా.

"డాడీ!" సిగ్గుపడుతున్నట్లన్నాడు నెమ్మదిగా సుమిత్.

"సుమిత్ మై బాయ్! ఐ యామ్ వెరీ హాపీ ఎబౌట్ యు. ఐయామ్ ప్రౌడ్ ఆఫ్ యు" సుమిత్‌ని దగ్గరకి తీసుకుని నుదురు ముద్దు పెట్టుకున్నాడు సురేష్.

అతని కళ్ళల్లో తడి. అనుపమ కళ్ళు చెమర్చాయి. రూప విచలిత అయి చూస్తోంది.

"సుమిత్! షి ఈజ్ యువర్ సిస్టర్ నిరుపమ. బాడ్ లక్. షి కెనాట్ వాక్. విల్ యు ప్లేవిత్ హర్. విల్ యు హెల్ప్ హర్ వెన్ షీ ఈజ్ ఇన్ నీడ్ ఆఫ్ హెల్ప్" అంది అనుపమ, సుమిత్ చెయ్యిపట్టుకుని నీరూ దగ్గరకి తీసుకెళ్ళి.

"అఫ్‌కోర్స్ ఆంటీ! ఐ విల్ ప్లే విత్ హర్. నా ఆట సామాన్లు అన్నీ యిచ్చి ఆడిస్తాను ఆంటీ" అన్నాడు సంతోషంగా నీరూ దగ్గర కూర్చుంటూ.

"నీరూ! సుమిత్‌ని 'అన్నా' అని పిలు" అన్నాడు సురేష్.

నీరూ సిగ్గుగా తల ఆడించింది.

"రూపా! ఇప్పుడు నాకెంత ఆనందంగా ఉందో నేను చెప్పలేను. మనసు ఎంత ప్రశాంతంగా ఉందో తెలుసా? గుండెల్లోంచి ఏదో బరువు దించినట్లు, గిల్టి ఫీలింగ్ పోయి ఏదో గర్వంగా వుంది. అనూ... ఐ మస్ట్ సే థాంక్స్ టు యు. నన్ను మనిషిని చేశావు" హృదయపూర్వకంగా అన్నాడు సురేష్.

"ఇందులో నా స్వార్థమూ వుంది" అనుపమ నిర్మలంగా నవ్వుతూ అంది.

"నీ స్వార్థమా! హౌ?" ఆశ్చర్యంగా అడిగాడు సురేష్.

"నీరూకి అన్న దొరికాడు. అది పెద్దయ్యాక దాన్ని చూడడానికి మనం లేనపుడు సుమిత్ అన్నగా ఆ బాధ్యత తీసుకుంటాడు" ఆమె కంఠంలో దుఃఖం పొంగింది. తల్లిగా ఆమె హృదయం గురి అవుతున్న రంపపుకోత గుర్తించింది రూప.

"మీరు అలా అధైర్యపడకండి. నీరూకి ఆమెలో ఏదో లోటుందన్న భావం రానీకుండా పెంచాలి. మీరిలా అధైర్య పడితే ఏం చెయ్యలేరు" అంది రూప.

"రూపా! నీ ధైర్యం నాకు లేదు. నీరూకి ఆత్మవిశ్వాసం కలిగించి పెంచాలని ఎంత తాపత్రయపడుతున్నాను. కానీ నా ధైర్యం చాలడంలేదు. ఈ ఉద్యోగ నిర్వహణలో నీరూకి కావాల్సిన ప్రేమ, ఆదరణ పూర్తిగా ఇవ్వలేకపోతున్నానేమో అనిపిస్తుంది.

"అలా అయితే నీరూని నా దగ్గర వదలండి. సుమిత్‌తో కల్సి చదువుతూ, ఆడుతూ...ఇద్దరూ కలిసే ఒంటరితనం కూడా వుండదు" అంది రూప.

"నిజంగానా! రూపా! నిజంగా నీరూ నీ దగ్గర కొన్నాళ్ళయినా పెరిగితే నాకు నిశ్చింతే. కానీ విడిచి ఉండగలనా" అంది బేలగా.

"ఆంటీ! నీరూని ఉంచండి. నేను చదువు చెపుతా, ఆడిస్తాను" అన్నాడు సుమిత్.

రక్తసంబంధం ఎంత గట్టిదో ఆ కొద్ది క్షణాల్లో అర్థమైంది రూపకి. శత్రువులా ద్వేషించిన సురేష్ బిడ్డమీద తనకెంత జాలి, సానుభూతి. తండ్రిని ద్వేషించిన సుమిత్‌లో చెల్లెలుపట్ల అప్పుడే ఎంత అభిమానం! ఈ అనుభూతినించి తప్పించుకోలేకపోవడంలోనే వుందేమో ఈ మానవాళి మనుగడ! ఎన్నుకున్నా భార్య-భర్త, అన్నా-చెల్లి, తల్లి-తండ్రి... వీరిమధ్య అభిమానాలు, ఆప్యాయతలు చెరిగిపోవేమో... !

"కొన్నాళ్ళుంచి చూడండి. అంతగా ఉండలేకపోతే తీసుకెడుదురుగాని" అంది రూప.

"సుమిత్! చెల్లెలిని జాగ్రత్తగా చూడు" అంటూ అనుపమ ఇద్దరికీ ముద్దు పెట్టింది.

సురేష్ రూప దగ్గర కళ్ళతోనే వీడ్కోలు తీసుకున్నాడు.

కారు కనుమరుగు అయ్యాక లోపలికి వచ్చి ఇద్దరి పిల్లలమధ్య కూర్చుని ప్రేమగా నీరూ తల నిమిరింది రూప.



# పట్టభద్రుడు

కొత్తపట్నం ట్రాన్స్‌ఫరై వచ్చిన సరహరి మేష్టారు మొదటి రోజు సాయంత్రం బళ్ళోంచి బయటపడి, రోడ్డు పక్కన కనబడ్డ ఓ హోటల్లోకి జేబు తడుముకుంటూ నడిచారు. అయిదు నిమిషాల అనంతరం సర్వారాయుడొచ్చి "ఏం కావాలిసార్ ?" అనగానే, మేష్టారు వెజిటబుల్ దోసెకి ఆర్డరిచ్చి, తలెత్తిచూసి తత్తరపడ్డారు. అప్పటికే సర్వారాయుడు ఎందుకో ముసిముసిగా నవ్వి వెళ్ళి పోయాడు. మరో అయిదు నిమిషాలు ఆలోచించగానే చటుక్కున గుర్తొచ్చింది



సర్వారాయుడి పేరు ముద్దుకృష్ణ. ముద్దుకృష్ణ మాష్టారి బళ్ళోనే ఏడవ తరగతి దాకా చదివాడు. ముద్దు కృష్ణ అనేవాడు మేష్టారు వాడిని అప్పట్లో. చదువు బాధ పడలేక, ఏడో తరగతి మధ్యలోనే ఇల్లూ వూరూ వదిలి పారి పోయిన ముద్దు కృష్ణ మళ్ళీ యిన్నేళ్ళ తరవాత ఇవాళ ఇలా దర్శన మిచ్చాడు.

'ప్చ్...వాళ్ళ నాన్న ఎంత బాధ పడేవాడు – కొడుక్కి చదువబ్బలేదనీ, ఇల్లు విడిచిపోయాడనీ! చివరికా బాధ తోనే పోయాడు కూడా! వీడిప్పుడు సర్వర్‌గా తేలాడన్నమాట జీవితంలో!'

వెజిటబుల్ దోశ ప్లస్ సర్వారాయుడు వచ్చారు. మేష్టారు ప్లేటు ముందుకు లాక్కుంటూ, "చూడవోయ్" అన్నారు.

ముద్దు కృష్ణ నవ్వుతూ, "అవున్సార్! నేనే మీ పాత శిష్యుడు ముద్దు కృష్ణని" అన్నాడు.

మాష్టారు దీర్ఘంగా నిట్టూర్చి,

"ప్చ్ ... ఆనాడు కాస ఒళ్ళొంచి చదివి వుంటే యీపాటికి ఏ యస్సెస్సీ పాసయినా గుమాస్తా ఉద్యోగమయినా దొరికేది కదా !" అన్నారు.

ముద్దు కృష్ణ నవ్వాడు మళ్ళీ. నవ్వి జేబులోంచి ఓ తోలు పర్సు తీశాడు. దానిలోపలి అరలోని ఫొటో మాష్టారి ముందుంచాడు–

"అప్పుడు పారిపోయి రాగానే ఈ హోటల్లోనే క్లీనరుగా చేరాను. తరవాత తరవాత కష్టపడి ప్రవేటుగా మెట్రిక్యూ, బి.ఏ. ఆ తర్వాత ఎం.ఏ. కూడా ప్యాసై ఉద్యోగాల వేటలో పడ్డాను. కానీ–ఎంతకీ మామూలు గుమాస్తా ఉద్యోగం కూడా దొరకలేదు. ఈలోగా ఈ హోటల్ పెద్దదై పోయి సర్వరుగా ప్రమోష నొచ్చింది. ఇప్పుడు నా జీతం గట్రా అన్నీ కలుపుకుంటే మీరు సంపాదించే దానికి రెట్టింపు ఉంటుందిలెండి మాష్టారూ"

పట్టభద్రుడి కోటు, టోపీలో వున్న ముద్దు కృష్ణ ఫొటో చూసి మేష్టారు నోరు వెళ్ళబెట్టారు.

—శివరామ్

# పిలక బొమ్మ

ఆ తరగతిలో విద్యార్థులందరికీ తెలుగు మాస్టారంటే చాలా చులకన. ఆయన్ని ఏదో రకంగా విసిగించి ఇబ్బంది పెట్టే వారు. ప్రతి రోజూ బ్లాక్ బోర్డుపై తెలుగు మాస్టారి బొమ్మ వేసి బోడిగుండు, దాని పైన పిలక, ఆ పిలకకు పూలగుత్తి అచ్చం కోతిలా గీసి దాని క్రింద 'తెలుగు మాస్టారు' అని రాసేవారు.

ఆ రోజూ తెలుగు మాస్టారు బోర్డుపై కనబడే తన కార్టూను బొమ్మను ఊహిం చుకుంటూ తరగతిలోకి అడుగు పెడు తూనే బోర్డువైపు చూశారు. తన బొమ్మ వెక్కిరింపుగా కనిపించింది.

పడబోతున్న మాస్టార్ని చూసి గొల్లున నవ్వుతున్న విద్యార్థులందరూ ఒక్క సారిగా నోళ్ళు మూశారు.

రోజూ బోర్డుమీద బొమ్మగీసే వెధ వని ఈ రోజు ఎలాగయినా పట్టుకోవాలని కోపాన్ని అణుచుకుని చిన్నగా ఓ చిరు నవ్వు విసిరారు.

"ఈ బొమ్మ ఎంత బావుందోయ్! భవి ష్యత్తులో మంచి చిత్రకారుడవుతాడు. దీన్ని వేసిన వాడికి రెండు రూపాయలు బహుమానం. వెంటనే వచ్చి బోర్డుపై బొమ్మ గీసిన వారు తీసుకుపొండి" అంటూ జేబులో నుంచి రెండు రూపాయి కాగితాలు తీసి పిల్లలందరికి కనబడే ట్టుగా చూపారు మాస్టారు.

ఒక పిల్లాడు మెల్లగా లేచి అడుగులో అడుగు వేసుకుంటూ మాస్టారికి దగ్గ రగా వచ్చాడు.

'ఆహా ఇన్నాళ్ళకు దొరికావురా! నీ అంతు చూస్తా! నే వేసిన పాచిక పారింది' అని లోలోన సంతోషించారు మాస్టారు.

వెంటనే ఆ కుర్రాడి చేయి పట్టుకుని "ఏరా! నా బొమ్మ వేయడానికి నీకెన్ని గుండెలురా! దున్నపోతు వెధవా" అంటూ చేతిలోని బెత్తంతో గట్టిగా బాదసాగారు. కుర్రాడు టాపు లేచేలా ఏడుపు అందు కున్నాడు. "అదికాదు సార్" అంటూ ఏడుస్తూనే ఏదో చెప్పబోయాడు.

"ఏది కాదురా! నీ తలకాయ కాదు! బొమ్మ వేసింది చాలక యింకా ఏడుస్తు న్నావా ?" అంటూ మండి పడ్డారు మాస్టారు.

"నేను...నేను... వెయ్యలేదు సార్" అన్నాడు కుర్రాడు.

"అయితే మరెందుకొచ్చావిక్కడికి!"



"ఇందుకు సార్...చాలా అర్జంటు" తన కుడి చేతి చిటికన వేలు చూపిం చాడు దెబ్బలుతిన్న కుర్రాడు.

కొయ్యబారి పోయారు తెలుగు మాస్టారు. వాణ్ని పంపించి వెనుక తనూ పరుగెత్తారు బైటికి.

—శ్రీలక్ష్మి

# లాంగ్ లీవ్

గుమాస్తా గుర్నాధానికి అర్జంటుగా 'డబ్బు' కావలసి వచ్చింది. తను పనిచేస్తున్న ఆఫీసులో చాలా మందిని ఒకరికి తెలీకుండా మరొకళ్ళని అడిగి చూశాడు. ఎవ్వరూ ఏమీ సాయం చేయలేక పోయారు. పైగా "సారీ... గుర్నాధం... వెరీ ...వెరీ ... సారీ" అంటూ తెగ విచారం వెలిబుచ్చారు. గుర్నాధానికి తెలిసిన మిత్రుడొకడు మాంచి సలహా ఒకటి ఉచితంగా పారేశాడు.

ఇక దాంతో గుర్నాధానికి పట్టపగ్గా లేకుండా పోయింది. వెంటనే తను తీర్థయాత్రలకు తన కుటుంబం మొత్తం ఆరుగురితోసహా వెళుతున్నానని, ఫలానా ఎక్స్. వై. జెడ్. నెంబరు బస్సులో ఫలానా తారీఖున ప్రయాణమని, అందుకని కొంత సొమ్ము అడ్వాన్సుగా యిప్పించమని మేనేజిమెంట్ వారికి లీవుతో సహా దరఖాస్తు పెట్టుకున్నాడు.

మేనేజిమెంట్ వారు లీవ్ ట్రావెల్ కన్సెషన్ రూల్సు ప్రకారంగా గుర్నాధం ప్రయాణాన్ని లెఖ్ఖగట్టి, ప్రయాణం చేసే దూరాన్నీ, స్థలాల్నీ, బస్సు నెంబర్నీ నోటు చేసుకున్నాక మొత్తం అవబోయే సొమ్ములో నూటికి ఎనభై రూపాయల చొప్పున ఇచ్చేశారు.

ఇంకేం, గుర్నాధం ఎగిరి గంతేశాడు. తన అవసరం తీర్చుకుని యింకా సెలవు ఎలానూ ఉంది గదాని సరదాగా ఫేమిలీతో సినిమాలకీ, సర్కస్‌లకీ వెళ్ళి హాయిగా గడిపేశాడు. సెలవు అయిపోయింది.

అంతే, వెంటనే డ్యూటీలో జాయనవడానికి ఆఫీసుకు వచ్చాడు. ఇలా చేరాడో లేదో గుర్నాధాన్ని చూసి అందరూ హడలిపోయారు. మనవాడు అందర్నీ పలకరిస్తుంటే గిజగిజా వణికు పోయారు.

మతి పోయింది గుర్నాధానికి. తను గుర్నాధాన్నేనని, తమ ప్రయాణం చాలా



సుఖంగా జరిగిందని ఫలానా ఫలానా స్థలాలు గట్రా చూసేమని తెగ చెప్పుకు పోతున్న గుర్నాధాన్ని ఆఫీసరుఅర్జంటుగా రమ్మంటున్నారని ప్యూను కబురందించాడు.

తడబడే అడుగుల్తో లోపలికి అడుగు పెట్టాడు గుర్నాధం. "మిష్టర్! నువ్వెవరివో అచ్చు మా స్టాఫ్ గుర్నాధం లాగ ఉన్నంత మాత్రాన నిన్ను చనిపోయిన మా గుర్నాధంగా భావిస్తామని అనుకోవద్దు.

అసలు మా గుర్నాధం ఫేమిలీతో ప్రయాణం చేస్తున్న ఫలానా ఎక్స్‌వై జెడ్ నెంబరు బస్సు ఫలానా దగ్గిర బోల్తాపడి అంతా చనిపోయారని పేపర్లో యిదిగో వార్త...కాబట్టి నువ్వు మమ్మల్ని యిక గుర్నాధంగా నమ్మించలేవు. పాపం మా గుర్నాధం ఫైనల్ సెటిల్‌మెంట్ అంతా నిన్ననే పూర్తయిపోయింది. అతని వారసులు ఎవరేనా వుంటే వచ్చి తీసుకుపొమ్మని కబురూ పంపేశాము....సో... ఇలాంటి పిచ్చి పిచ్చి మోసాలు చెయ్యబోకు. పోలీసుల్ని కేకేసి అప్పగించవలసి వస్తుంది" అంటున్న ఆఫీసరుగారి మాటల్తో మతిపోయింది గుర్నాధానికి. ఏదో చెప్పడానికి ప్రయత్నించబోతున్న గుర్నాధం జబ్బ పుచ్చుకుని "పదవయ్యా దొంగ గుర్నాధం. ఇది సినిమా కాదు. ఆఫీసయ్యా బాబు ఆఫీసు. పద...పద..." అంటూ బయటకు బరబరా లాక్కుపోయాడు ప్యూను.

-ఎం. ఉమామహేశ్వరరావు

# కారణం

మిలటరీ సర్వీసు రిక్రూట్‌మెంట్‌కి అప్లికేషన్లు పెట్టినవారికి ఇంటర్వ్యూలకు పిలుపులు వచ్చాయి. ఇంటర్వ్యూల్లో పాల్గొనేందుకు దేశం నలుమూలల నుంచీ అభ్యర్థులు బయలుదేరారు. రైళ్ళలోనూ, బస్సులలోనూ ఎక్కడ చూసినా ఆ బాపతు వాళ్ళే కనిపిస్తున్నారు.

రైలు ప్రయాణం చేస్తున్న రామారావు తన ఎదురుగా కూర్చుని వున్న దృఢంగా వున్న వ్యక్తిని చూసి పలకరింపుగా నవ్వి "మీరు ఫలానా ఇంటర్వ్యూకేనా ?" అనడిగాడు.

"ఔనవును మీరూ అందుకేనా ?" అన్నాడతడు.

ఇద్దరికి మాటలు కలిశాయి. కబుర్లలో పడ్డారు.



"ఇంతకీ మీరు మిలటరీలో ఎందుకు చేరాలనుకొంటున్నారో తెలుసుకోవచ్చునా ?" అతన్ని అడిగాడు రామారావు.

"నేను బ్రహ్మచారిని, దేశాభిమానిని, దేశసేవ చేయాలని, శాంతి భద్రతలను కాపాడాలని ఆశయం వున్నవాణ్ని. అందుకే చేరాలనుకుంటున్నాను... అన్నట్లు మరి మీరు ఎందుకు చేరాలనుకుంటున్నారు? మీరూ బ్రహ్మచారేనా ?" అన్నాడతను.

"నాకు భార్య ఉంది. నేను శాంతి కాముకుణ్ని. అందుకే యుద్ధంలో చేరాలనుకుంటున్నాను" అన్నాడు రామారావు.

-కొండూరి కమలకుమారి.

# ఆటకట్టు

ఫస్ట్‌క్లాస్ కూపేలో ప్రయాణం చేస్తున్నాడు సుబ్బారావు. అంతవరకూ పెద్ద మనుషుల్లా కూచున్న ముగ్గురు వ్యక్తులు హఠాత్తుగా కత్తులు తీసి సుబ్బారావుని బెదిరించారు.

పాపం! సుబ్బారావు కిమ్మనకుండా కుడి చేతివి రెండు, ఎడమ చేతిది ఒక వుంగరం, వాచీ సమర్పించుకున్నాడు. దుండగులు అంతటితో తృప్తి పడక సుబ్బారావు సూట్ కేస్ కెలికి రెండువేల రూపాయలు జేబుల్లో పడేసుకున్నారు.

"కాజీపేటలో దిగిపోతాం. అంత వరకూ అల్లరి చెయ్యకుండా బుద్ధిగా కూర్చో" బెదిరించారు దుండగులు.

అయితే కాసేపటికి సుబ్బారావు మెదడులో మెరుపులా మెరిసిందో ఐడియా.

"అర్జంటు" అంటూ సుబ్బారావు రెండు వేళ్ళు చూపించి సీట్లోంచి లేచాడు.

"పిచ్చివేషాలు వెయ్యొద్దని ముందే చెప్పాంగా."

"నిజంగానే. యమ అర్జంటుగా వెళ్ళాలి. క్షణం ఆలస్యం చేస్తే తరువాత మీకే ఇబ్బంది" అన్నాడు సుబ్బారావు.

"సరే పద" అంటూ సుబ్బారావు టాయిలెట్‌లో కెళ్ళి బయటికి వచ్చే వరకూ కాపలా నిలబడ్డాడు వాళ్ళలో ఒకడు.

సుబ్బారావు పని ముగించుకొచ్చి సీట్లో కూర్చున్నాడు. కాస్సేపటికి టి.సి. వచ్చి టిక్కెట్లు చెక్ చేసుకుని వెళ్ళిపోయాడు.

మధ్య ఏదో స్టేషన్లో బండి ఆగి మళ్ళీ కదిలింది.

మరో అరగంట తరువాత బండి కాజీపేట స్టేషన్లో ఆగింది. బండి ఆగీ ఆగటంతోటే ఫస్ట్‌క్లాస్ కూపేలోకి పోలీసులు జొరబడి దుండగుల్ని అరెస్ట్ చేసి తీసుకుపోయారు.



ఇంతకీసుబ్బారావు చేసినతెలివైనపనేమిటంటే టాయిలెట్‌లోకి వెళ్ళి తన టిక్కెట్టు మీద దుండగుల గురించి అర్థమయ్యేలా రాశాడు. దాన్నే టి. సి. వచ్చినప్పుడు చూపాడు.

—యన్నం ఉమాపతి

Edited, Printed and Published by Ramoji Rao Ch. for Vasundhara Publications. Printed at Colorama, Offset Printers, Hyderabad. CHATURA Telugu Monthly, Eenadu Compound, Hyderabad - 500 004.

CHATURA Telugu Monthly, Hyderabad-500 004.    Regd. No. H/HD/402